విశ్వసాహిత్యమాల : 50

# విజ్ఞాని పౌలోవ్

(నాటకం)

అనుసరణ :

మహీధర జగన్మోహనరావు.

1951 సెప్టెంబరు.




★

విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

Rs. 2/8

M. పపావా రచించిన సినేరియో ననుసరించి
వ్రాయబడింది.

అవంతీ ప్రెస్ - రాజమండ్రి.

# జీవిత సంగ్రహం.

సుప్రసిద్ధ రష్యన్ విజ్ఞాని ఇవాన్ పిత్రోవిష్ పౌలోవ్ పేరు మానవ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. న్యూటన్, డార్విన్, పాశ్చర్, ఐన్‌స్టైన్ మొదలైన మహావిజ్ఞానుల అంతస్థుకు జెందినవాడీయన.

ర్యాజాన్ పట్టణ సమీపంలోని 'యాసం' అనే గ్రామంలో పురోహితునింట 1849 సెప్టెంబరు 14 న యీతడు జన్మించేడు. తండ్రి పీటర్, తల్లి వీరా, కుటుంబనామం పౌలోవ్. మఠపాఠశాలలో విద్యాభ్యాసం పూర్తిగావించి, పీటర్సుబర్గ్ విశ్వవిద్యాలయంలో చేరి, సైనీ. మెండలీవ్‌లవంటి మహాపండితులవద్ద శరీర, రసాయనాది శాస్త్రముల నభ్యసించి, పట్టమును 1875 లో తీసుకున్నాడు. పిదప మిలిటరీ మెడికల్ ఆకాడమీలో చదివి, వైద్యశాస్త్రంలో (1879) పట్టభద్రుడయ్యేడు. తరువాత పీటర్సుబర్గ్‌లోనే యస్. పి. బోట్కిన్ (1832-89) క్రింద పరిశోధనలు గావించేడు. జంతువులమీద ప్రయోగాలు చేస్తూ, శరీరశాస్త్రానికీ-రోగనిదానానికీ అపారకృషి గావించిన బోట్కిన్ పండితుని పర్యవేక్షణ క్రింద యీయన (1879 నుంచి) చాలకాలం పనిచేసేడు. 1883 లో M. D. పట్టంపొంది, ప్రొఫెసర్‌గా నియమించబడ్డాడు, ఆ పిమ్మట జర్మనీలో లీప్జిగ్ నగరంలో ఫిజియలాజికల్ ఇన్స్టిట్యూట్‌లో కారల్ లద్విగ్ దగ్గరా, బ్రెస్లాలో ఉడోల్ఫు హైడెన్‌హీమ్ దగ్గరా రెండేళ్ళపాటు వున్నత పరిశోధనలలో తరిఫీదు పొందేడు. మొదటినుంచీ రెండు చేతులా శస్త్రము చేయుట నభ్యసించి సవ్యసాచిగా వుండేవాడు.

డాక్టర్ పౌలోవ్ గొప్ప మానసికశక్తి, లక్ష్యశుద్ధి గలవాడు. విజ్ఞాన శాస్త్రంద్వారా మానవసేవ చేయు సంకల్పంతో యావజ్జీవితమూ

కృషిచేసిన మహితాత్ముడు; సర్వతోముఖ పాండిత్య ప్రతిభయుగల శరీర శాస్త్రజ్ఞుడు; తీక్షపరిశీలనాశక్తి, ఓరిమిగల ప్రయోగదక్షుడు. ఆయన ప్రయోగాలు యావత్ప్రపంచాన్నీ దిగ్భ్రమ నొందించేయి. మొదట్లో విజ్ఞానలోక మీయన ప్రయోగాలపట్ల వుదాసీనంగా వున్నా, కాలక్రమేణా యీయన సిద్ధాంతాలు విజ్ఞానులకు శిరోధార్యములైనాయి.

1888 లో పౌలోవ్ పండితుడు క్లోమము (Pancreas) లోని స్రావకనాళాల్ని కనిపెట్టేరు. 1890 లో పీటర్సుబర్గులోని ఓల్డెన్‌బర్గ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్పెరిమెంటల్ మెడిసిన్‌కు డైరెక్టరుగా నియమితుడై 1897 నాటికి జీర్ణగ్రంధులు, జీర్ణక్రియనూ గూర్చి సమగ్ర పరిశోధనలు గావించేడు జీర్ణావయవాల్ని కోసి వేరుచేసి, జీర్ణనాళమంతటా కృత్రిమగ్రంధుల్ని తగిల్చి, జీర్ణక్రియాక్రమమును మానవ నేత్రగోచరం గావించేడు: ఇంజనీర్లు నదులు, కాలువలు, లాకులులోని నీటి పారుదలను తమ యిచ్ఛవచ్చినట్లు కంట్రోలు చేయునట్లే సజీవమైవున్న జీర్ణావయవాల్ని, కృత్రిమ సాధనాలవల్ల పనిచేయించేడు. ఈయన సిద్ధాంతాల ననుసరించే నేడు చికిత్సాశాస్త్రంలో అనేక అభివృద్ధులు సాధ్యమైనాయి. 1897 నాటికే యీయన పూర్తిగావించిన జీర్ణక్రియా సిద్ధాంతములకై 1904 లో డాక్టరు పౌలోవ్‌కు నోబెల్ బహుమతి నిచ్చేరు. 1897 లో మిలిటరీ మెడికల్ అకాడమీలో శరీరశాస్త్రాచార్యుడుగా కూడ నుండెను.

లాలాగ్రంధులు, ఆహారనాళము, ఆహారకోశము, వీటికి జీర్ణక్రియలోగల పాత్రను, జీర్ణరసములెట్లుత్పన్నములై యేమేమి చేయునో, ఆహారమేయేమార్పుల్ని యెట్లు పొందుతూన్నదీ,- యిట్టి క్లిష్ట విషయాలను యీయన ప్రయోగములద్వారా కనుగొనుటలో గావించినకృషి యీయనకు మరో నూతన రంగానికి గొనిపోయింది. 1902 మొదలుకొని మెదడు, ఉన్నతనాడీమండలము,-వీటిపై తన ప్రయోగాల్ని

కేంద్రీకరించి క్షుధ, ఆత్మరక్షణ, సంతానేచ్ఛ, సంతాన పోషణాసక్తి,- యిట్టి శరీరధర్మముల స్వభావరీతులను నిర్వచించేరు, ఈయన. ఇట్టి శరీరధర్మములు స్వాభావికములనీ, ప్రాకృతికములనీ శాస్త్రజ్ఞులలో వ్యాపించియున్న భావముల్లో పౌలోవ్ సిద్ధాంతాలు విప్లవాన్ని తెచ్చేయి. మనశ్శాస్త్రంలోనూ, సాంఘిక విద్యాసూత్రాల్లోనూ, సిద్ధాంతాల్లోనూ విప్లవాన్ని దెచ్చిన 'నిబద్ధమనోక్రియ' (Conditional Reflex) సిద్ధాంతాన్ని మొదట్లో ప్రవచించినది పౌలోవ్ పండితుడే. మెదడు, దాని వ్యాపారాలు,- వీటినిగూర్చి పౌలోవ్ గావించిన పరిశోధనలు మానవవిజ్ఞానికి కొత్తబాటలు నిర్మించేయి. నిద్ర, తంద్ర. స్వప్నము, అలసట, మనోవశ్యము మొదలగువాటి అంతరార్థాలను గ్రహించేందుకు యీయన ప్రయోగాలు యెంతో తోడ్పడినాయి. క్షుధాదులైన శరీరధర్మములకు మెదడుమీదను, మెదడుకు క్షుధాదులమీదను గల క్రియప్రతిక్రియల స్వభావాన్నీయన తన ప్రయోగాలద్వారా నిరూపించెను. మనోకేంద్రం (Central Cortex) ద్వారా వ్యాధినిర్మూలన చేయుటగురించి యీయన సూచనలు ముందు తరాల శాస్త్రజ్ఞులకు మార్గదర్శకములైనాయి.

1906 లో లండన్‌లో జరిగిన శాస్త్రపరిషత్సభలో యీయన తన పరిశోధనలను గూర్చి యుపన్యసించెను. ప్రాణుల నడవడికలన్నియు వాటి శరీరావయవములయు, కణములయు క్రియ ప్రతిక్రియలయొక్క సంయోగ సంక్రమణములవలన యేర్పడుచున్నవని ఆయన ఋజువు చేయుటతో పరిసరములకు ప్రాణుల నడవడికపైగల అమేయప్రభావము స్థాపించబడింది. ఈ సిద్ధాంతమువల్ల మానవుల బుద్ధి, భావము, నడవడి మొదలైనవి సాపేక్షికములు, నియతములు, పరిణామ శీలములు అని సిద్ధాంతీకరించెను. పౌలోవ్ పండితుని యీ సిద్ధాంతము మనస్తత్వ శాస్త్రంలో గొప్ప విప్లవాన్ని తెచ్చుటయేగాక గతితార్కిక భౌతిక వాదమును బలపర్చుటద్వారా శ్రామికవర్గోద్యమాలకును, కమ్యూనిజము

నకును నూతనశక్తి విచ్చినది. 1907 లో యీయనను లండన్‌లోని రాయల్ సొసైటీ సభ్యునిగా తీసికొనెను; 1909 లో ఫిజియలాజికల్ సొసైటీలో గౌరవ సభ్యుడాయెను; 1915 లో రాయల్ సొసైటీయొక్క కోప్లేమెడలు యీయన కొసగిరి; 1923 లో ఎడింబరో నగరంలో అంతర్జాతీయ శరీరశాస్త్రమహాసభలో పౌలోవ్ 'నిబద్ధమనోక్రియ' లను గూర్చిన వుపన్యాసము నాయన కుమారుడు చదివెను; 1928 లో హార్వే త్రిశత వార్షికోత్సవమునకై రాయల్ సొసైటీతరపున యింగ్లాండులో నీయన వుపన్యసించిరి; ఆయేటనే యీయన 'రాయల్ కాలేజి ఆఫ్ ఫిజిషియన్స్' లో గౌరవసభ్యుడుగా యెన్నుకోబడెను.

1927 లో పౌలోవ్ తన సుదీర్ఘ పరిశోధనా ఫలితాలను క్రోడీకరించుతూ, 'నిబద్ధమనోక్రియలు' (Conditioned Reflexes) అనే గ్రంధము వ్రాసెను. దీని నా సంవత్సరమే 'అన్రెప్' అను యీయన శిష్యుడు యింగ్లీషులోని కనువదించెను.

ఇంగ్లాండులో ప్రొఫెసరు ఎ. వి. హిల్ F. R. S. తో పౌలోవ్ పండితుడు జరిపిన స్నేహసంభాషణను యీ క్రింది పొందుపరుస్తున్నాము :

ప్రొ. హిల్:- మిత్రమా! లోకంలోని మహా మేధావులెందరో మతగురువుల బిడ్డలు. మా యింగ్లాండులో యిది మరింత విస్పష్టంగా చూడగలం!

పౌలోవ్:- అందులో విపరీతమేమీలేదు. నా తండ్రి తాతలు మతగురువులే. అంతేగాదు. నా భార్యకూడ మతగురువు బిడ్డమే, మిత్రమా!

ప్రొ. హిల్:- అంతేనా? మీరు వైజ్ఞానిక లోకానికే గురువులు గదూ!

పౌలోవ్:- (అమాయిక సంతోషంతో) మీ సౌజన్యమే అట్లనిపిస్తూందిగాని నా యందంతటి విశేషమేముంది, మిత్రమా?

ప్రొ. హిల్:- ఈ విషయం యాదృచ్ఛికంగాదు. దీనివల్లనే మీ నిబద్ధమనోక్రియా సిద్ధాంతం ధృవమని తేలిపోతూంది।

పావ్లోవ్:- వాస్తవం। జీవితపరిసరాలే మేధాప్రవర్తనలకు ప్రవర్తకములైతే తరతరాలుగా భావ గౌరవాన్నందిన వారిలో యితరులందరిలో కంటె సాంద్రతరంగా మేధావులు, ఘనులు, వుద్భవించడంలో ఆశ్చర్యం లేదుగదా।

ఈ సంభాషణ నుంచి మనం నేర్చుకోవలసినదొకటే. మన సామాజిక వ్యవస్థ, జీవితవిధానాలు,-వీటివల్లనే ప్రధానంగా నిర్ణీతములవుతూన్న విషయాలకై గతమునకై విచారించుటకంటె, ముమ్మందు యీ వ్యవస్థలో మార్పులు దెచ్చుటయే కర్తవ్యము.

సోవియటు విప్లవం వచ్చిన అనతికాలంలోనే (1919) మాగ్జిం గోర్కీ అధ్యక్షతక్రింద కమిటీ నేర్పరచి, ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక డిక్రీని ప్రకటించి, పావ్లోవ్ శాస్త్రపరిశోధనలు నిరాతంకంగా కొనసాగుటగు తోడ్పడింది. పెట్రోగ్రాడ్‌నే లెనిన్‌గ్రాడ్‌గానూ, ఓల్డెన్‌బర్గ్ ఇన్‌స్టిట్యూట్‌నే మాగ్జిం గోర్కీ ఇన్‌స్టిట్యూట్‌గానూ అప్పటినుంచే వ్యవహరిస్తున్నారు.

1932 లో సోవియటు యూనియన్ అంతటా యెన్నో శాఖలు ఆయన శిష్యులైన వైజ్ఞానికుల ఆధిపత్యాన స్థాపించబడినాయి.

ఆ యేడే వివిధశాఖ లన్నిటినీ కలిపి 'అఖిల యూనియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్సరిమెంటల్ మెడిసిన్'గా పునర్నిర్మించేరు. ఉష్ణమండలంలోని 'సుఖోమీ' నగరంలో కొత్తగా బయోలాజికల్ పరిశోధనా కేంద్రాన్ని యేర్పరచి, కోతులమీద పరిశోధనలు చేయడానికి ప్రత్యేకించేరు.

1934 లో యీ అఖిల యూనియన్ ఇన్‌స్టిట్యూట్‌ను లెనిన్

గ్రాడ్ నుంచి మాస్కోకు మార్చేరు. కాని, పౌలోవ్ మాత్రం లెనిన్‌గ్రాడ్‌లోనే వుండి పోయేరు. మాస్కోలో ఇన్‌స్టిట్యూట్ నూతనగృహ నిర్మాణానికై పదికోట్ల రూబుల్సు ఖర్చు చేసేరంటే సోవియట్ ప్రభుత్వం విజ్ఞానం పట్ల యెంత ఆసక్తి గలిగి వున్నదీ తెలుసుకోగలము. ఈ సంవత్సరమే ఆయన 85 వ జన్మదిన సందర్భంలో సోవియటు ప్రభుత్వ మాయనకు పదిలక్షల రూబుళ్లు బహూకరించింది.

1935 లో లండన్‌లో జరిగిన న్యూరలాజికల్ కాంగ్రెస్‌లో యీయన జర్మన్ భాషలో నుపన్యసించగా పండితలోకమంతయు లేచి నిలిచి, కరతాళధ్వనులతో యీయన నభినందించెను.

1935 లో లెనిన్‌గ్రాడ్‌లో అంతర్జాతీయశాస్త్రీయ మహాసభలో యీయన ప్రముఖపాత్ర వహించి పండితమాన్యు డాయెను.

'VIEM' (Vsesoyuzny Institut Experimentalnoi Meditsiny) అని సంగ్రహంగా పిలువబడే యీ అఖిల యూనియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్పెరిమెంటల్ మెడిసిన్‌కు మాస్కోలో 22 శాఖలు, లేబొరేటరీలూ, లెనిన్‌గ్రాడ్‌లో 10 న్నీ వున్నాయి. రెండు చోట్లా కూడ ప్రత్యేకమైన ఫొటో ఫిల్మ్ లేబరేటరీలు, సాంకేతిక గ్రంథాలయాలూ వున్నాయి.

1941 నాటికి సోవియట్ యూనియన్‌లో 223 మెడికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్లు, యిరవై వేల సైంటిఫిక్ వర్కర్లతో, నలభై కోట్ల రూబుళ్ల బడ్జెటుతో పనిచేసేవి. ఇవిగాక స్థానిక లేబొరేటరీల్లో రీసెర్చర్లూ వేలాదిగా పనిచేసేవారు. ఇవి యెన్నో గ్రంథాల్నీ, పత్రాల్నీ, కరపత్రాల్నీ కోటానుకోట్ల ప్రతుల్ని ప్రచురించేయి. పౌలోవ్ శ్రమ సార్థకమై, మానవజాతి పురోభివృద్ధికై వుపయుక్తమైంది, నేటి సోవియట్ విధానం క్రింద.

మహావైజ్ఞానికుడు పౌలోవ్, 1936 ఫిబ్రవరి 27 న యిన్‌ఫ్లు యంజావల్ల మరణించేడు. విజ్ఞానాకాశంలో మరొక కాంతిపుంజం అస్త మించింది. రష్యన్ రిపబ్లిక్ యొక్క ఆరోగ్యమంత్రితో సహా ప్రముఖు లనేకులు పౌలోవ్ శవవహనంచేసి, తమ కా మహావిజ్ఞానిపట్ల గల భక్తి గౌరవాలను వెల్లడి చేసేరు.

ఈయన కుటుంబప్రీతి గలవాడు; హాస్యప్రియుడు; నిత్యోత్సాహి; సరసుడు; నిర్మొగమాటి; దేశభక్తుడు; నిరాడంబరుడు; పండితలోక ప్రశంసలను, నోబెల్ బహుమానమును అందియు, వుబ్బు, గర్వముల నందని సాత్త్వికుడు; సాంప్రదాయిక వేషభాషాచారములయందు గౌర వము గలవాడు; సమయపాలనయందు నిష్ఠగలవాడు. ప్రతి దినము 10 మొదలు 6 గంటలవరకు పరిశోధనలలో తన్మయుడై కృషిచేయుచు, అరువదేళ్లు విజ్ఞానాన్వేషణ గావించిన జ్ఞానతపస్వి: ధన్యజీవి: మహా పండితుడు పౌలోవ్.

ఇట్టి మహాత్ముల జీవితాలద్వారా మానవజాతి తన పురోభివృద్ధి మార్గాన్ని సుగమం చేసుకుంటుందని మా విశ్వాసం. ఈయన జీవిత చరిత్రను సోవియట్ ఫిలిం నిర్మాతలు వెండితెరపై కెక్కించి, ముందు తరాల వారికి భద్రపరచేరు.



## విజ్ఞప్తి

1935 నుంచీ విశ్వసాహిత్యమాల ద్వారా ఆంధ్ర మహా జనులకూ, ఆంధ్ర భాషకూ సేవచేస్తూ, యధాశక్తిగా విజ్ఞాన వ్యాప్తికి కృషిచేస్తూన్నాము. ఇప్పటికి, యీ పదహారు సంవత్సరాల్లోనూ యేబది గ్రంథములను మాత్రమే ప్రకటించ గలిగేము. ఎన్నో గ్రంథాలు వ్రాతప్రతులుగా వుండగానే ప్రభుత్వ దాడులవల్ల పోయినాయి. సంవత్సరాల తరబడి తీవ్ర నిర్బంధాలకి గురియై జైళ్లలో వుండిపోవుటవల్లనూ, మా పుస్తకాల స్టాకులను ప్రభుత్వం పూర్తిగానో, కొంతభాగమో స్వాధీనం గావించుకొంటూండడం వల్లనూ యేర్పడిన కష్టనష్టాలవల్ల మా ప్రచురణ కార్యక్రమం అనేకసార్లు నిలిచిపోతూ వచ్చింది. ఎన్ని కష్టాలు వచ్చినా లెక్క-చేయకండా మా సేవాకార్యక్రమాన్ని చేతనైనంతలో కొనసాగిస్తూనే వున్నాము.

ప్రస్తుతం మూడేళ్ళ దారుణ నిర్బంధానంతరం తిరిగి ఆంధ్ర మహాజనులకు 'గోర్కీ జీవితం' అను పుస్తకాన్ని అందించడంతో మా కృషిని తిరిగి ప్రారంభించేము. ప్రస్తుతం 'విజ్ఞాని పావ్లోవ్' అను యీ పుస్తకాన్ని అందిస్తున్నాము. ఆధునిక యుగంలో మానవ విజ్ఞానాన్ని అత్యున్నత శిఖరాల కందచేసిన ఒక మహావిజ్ఞాని ఆదర్శజీవితం యిందులో అతిచక్క-గా, కళా సమన్వితంగా పొందుపరచబడింది. సోవియటు ఫిలిం నిర్మాతలు యీ మహామహుని భవ్యజీవితాన్ని వెండితెరపై కెక్కించి

ముందు తరాల మానవులకు భద్రపరచేరు. ఆ కథా సంవిధానాన్నే, సిసెరియోనే తీసికొని, యీ రూపంలో వెలువరుస్తున్నాము. చదివి ఆనందించుటకూ, విజ్ఞానబోధకూ మాత్రమే యీ గ్రంథము వుపయోగిస్తుంది.

అతిక్లిష్టమైన శాస్త్రీయవిషయాల్నీ, సాంఘిక సమస్యల్నీ యీ గ్రంథంలో అరటిపండొలిచి చేతబెట్టినట్లుగా చేసిన గ్రంథ రచనా సంవిధానాన్ని చూచి మనం నేర్చుకోవాల్సిన దెంతేనా గలదు.

విద్యార్థులు, రచయితలు, కళారాధకులు, విద్యాధిపులు యీ గ్రంథాన్ని కొని, చదివి, దీని పూర్తి వుపయోగాన్ని పొందగోరుచున్నాము.

టాస్ (సోవియటు) వార్తాసంస్థవారు మేము కోరినదే తడవుగా పౌలోవ్ పండితుని బ్లాకును, ఆయన కుటుంబము బ్లాకును పంపి, యీ గ్రంథమునలంకరించుటకు తోడ్పడినందుకు వారి నభినందిస్తున్నాము.

మాకు ఆంధ్రమహాజనులందరూ చేయూతి నొసగ ప్రార్థన. ఆంధ్రభాషకు అలంకార ప్రాయములైన మా ఉత్తమ ప్రచురణలను ప్రతి ఆంధ్రుడూ చదివి, ప్రోత్సాహమిచ్చుట కనీస కర్తవ్యము.

ఇట్లు,

30—10—51, రాజమండ్రి.

మహీధర జగన్మోహనరావు,
సంపాదకుడు.

# పాత్రలు.

పీటర్ పౌలోవ్—పురోహితుడు. కథానాయకుని తండ్రి. ర్యాజాన్‌వాసి.

డిమిత్రీ పిత్రోవిష్ పౌలోవ్— ఆయన పెద్దకొడుకు. రసాయనశాస్త్రాచార్యుడు.

ఇవాన్ పిత్రోవిష్ పౌలోవ్—సుప్రసిద్ధ శరీర శాస్త్రవేత్త. రెండోకొడుకు. మహావిజ్ఞాని. కథానాయకుడు.

వీరా పౌలోవా—పురోహితునిభార్య. కథానాయకుని తల్లి.

సెరాఫిమా వాసిలియేవ్నా పౌలోవా—కథానాయకుని భార్య. 'సీమా' ముద్దుపేరు. ఆయనకు సహపాఠి.

వ్లాడిమిర్ ఇవానోవిష్ పౌలోవ్—కథానాయకుని కుమారుడు. 'వొలోడ్యా' ముద్దుపేరు.

వీరా ఇవానోవ్నా పౌలోవా—కథానాయకుని కుమార్తె.

మిలోచ్‌కా—మనుమరాలు.

ఆర్షిప్ సెమ్యోనిచ్ తెలిగిన్—ర్యాజాన్ వణిక్ప్రముఖుడు. వృద్ధుడు.

మార్ఫా తెలిగినా—ఆయన భార్య. వృద్ధురాలు.

తెలిగిన్‌ల తోటమాలి—వృద్ధుడు.

భిక్షుకులైన యిద్దరు కుంటివాళ్లు—వృద్ధులు.

గ్జెనియా,—విద్యార్థిని. ఇవాన్, సెరాఫిమాల సహవాసి.

ఇవాన్ పిత్రిశ్చేవ్—విద్యార్థి, ఇవాన్ సహపాఠి. తర్వాత ప్రభుత్వోద్యోగి.

సెర్గీ పిత్రోవిష్ బోట్కిన్—సుప్రసిద్ధ వైద్యుడు. పిత్రోగ్రాడ్‌లో క్లినికల్, ఫిజియలాజికల్ లేబొరేటరీల డైరెక్టరు. 1832—1889.

నికోడిమ్ వాసిలియేవిష్—లేబొరేటరీలో పనివాడు.

తల్లి, తండ్రి, పుత్రుడు—క్లినికల్ హాస్పిటల్‌కు మృతుని కొరకు వచ్చిన కుటుంబం.

విద్యార్థి—ఇవాన్ కొరకు వచ్చిన సహపాఠి.

యువమిధునం—కార్మికులు-ఇవాన్-సెరఫిమాలను పరామర్శిస్తారు.

గ్లెబ్ మైఖలోవిచ్ జ్వాన్టేన్సవ్- } లేబొరేటరీలో పౌలోవ్ అసిస్టెంట్లు.
చెవ్ జకారోవిచ్ జబేలిన్- }

దౌవారికుడు-భార్య—బోట్కిన్ ఇన్స్టిట్యూట్‌లో.

ఫెనిచ్కా—పౌలోవ్‌లయింట వంటకత్తె.

ఆంద్రీ స్టెపానిచ్—పౌలోవ్ అసిస్టెంటు.

స్టెఫాన్ తిమోఫియిచ్—ప్రొఫెసరు. సైన్సు అకాడమీలో 1904 లో
పౌలోవ్‌కు స్వాగతమిచ్చినవాడు.

వర్వారా ఆంటొనోవ్నా ఇవానోవా—మెడికల్ విద్యార్థిని. తర్వాత పౌలోవ్
అసిస్టెంటు. 'వార్యా' ముద్దుపేరు.

బూయింగ్టన్—కేంబ్రిడ్జిలో శాస్త్రజ్ఞుడు. మరిద్దరు ఆంగ్లవిజ్ఞానులు.

జార్జిరాజు దూత.

ప్రభుత్వ ఆఫీసులో గుమాస్తాలు.

కోసక్ సైనికులు.

ఎఫ్. సొలోగుబ్ }
డి. మెరిఝోవ్‌స్కీ } రష్యన్ కవులు.
జడ్. గిప్పియస్ }

విప్లవ సైనికులు.

నికోలాయ్ సెర్గియేవిచ్ సెమ్యోనోవ్—వైద్యవిద్యార్థి, కమ్యూనిస్టు, తర్వాత
పౌలోవ్‌వద్ద సోవియట్ ప్రతినిధి.

జార్జిహిక్స్—పిట్రోగ్రాడ్‌లో అమెరికన్ మెడికల్ అసోసియేషన్ ప్రతినిధి.

మాగ్జిం గోర్కీ—సుప్రసిద్ధ రష్యన్ మహాకవి.

వరదల రక్షణదళం.

వరదల కమిటీ రాయబారి.

కాపలా సిపాయి.

వరదలో చిక్కబడ్డ ఆ స్త్రీ—బిడ్డతో.

పిచ్చి ఆసుపత్రిలో రోగులు.

అమెరికాలో—నీగ్రో కూలీ-ఫొటోగ్రాఫర్లు-విలేఖరులు.

,, ఇమిగ్రేషన్ ఆఫీసరు.

ఓడ కెప్టన్.

ఎడింబరో విశ్వవిద్యాలయంలో సభ-సన్మానం చేసిన ప్రొఫెసర్లు.

ఛాఫర్—పౌలోవ్ కారు నడిపేవాడు.

లెనిన్‌గ్రాడ్ రైల్వే ప్లాట్‌ఫారం మీద జనం.

ట్రాం కండక్టర్స్.

రోడ్డు కూలీలు.

డాక్టరు మార్టినోవ్—మరికొందరు డాక్టర్లు. పౌలోవ్‌కు ఆపరేషన్ చేసిన వారు.

ట్రాఫిక్ పోలీస్.

మెడికల్ గ్రాడ్యుయేట్లు.

సెర్గీ మిరోనిష్ కిరోవ్—సోవియట్ ప్రభుత్వ ముఖ్యుడు, కమ్యూనిస్టు నాయకుడు.

నోటు:—నాటకరంగం చాలభాగం పిట్రోగ్రాడ్ లోనే. ఈ నగరమే 1918 విప్లవం తర్వాత లెనిన్‌గ్రాడ్ అయింది.

మానవ సేవాపరాయణులూ,
సద్ధర్మ నిరతులూ, సుహృద్వరులూ
డాక్టర్ చెలికాని రామారావు గారికి
ప్రీతిపూర్వకంగా.

17

# విజ్ఞాని పావ్లోవ్

## ఒకటో అంకం

### మొదటి రంగం

[రష్యా దక్షిణప్రాంతంలో ర్యాజాన్ పట్టణ సమీపంలోని అడవి ప్రక్కనున్న కాలిబాటలో యిద్దరు యువకులు నడుస్తుంటారు. అడవి అంచున కుటీర ప్రాంగణంలో గోడకు జేరగిలబడి, చంకకర్రల కానుకుని యిద్దరు వృద్ధులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వేసవికాలం ఐనా ఆ వృద్ధులు పెద్ద బుఖాలు వేసుకుని వుంటారు. దారినపోతూన్న ఆ యువకుల్ని చూచి సంభాషణను వారిమీదికి మరల్చుతారు.]

మొదటివృద్ధు:- ఆపడుచువాళ్ళు ఎవరై వుంటారంటావు?

రెండోవృద్ధు:- పురోహితుడు పీటర్ తేడూ, ఆయన కొడుకులురా వాళ్ళు!

మొదటివృద్ధు:- ఆయన కెందరేమిటి కొడుకులు?

రెండోవృద్ధు:- ముగ్గురు. ఐతే యేం ప్రయోజనం? తర్వాత ఆయన స్థానాన్ని తీసుకొనే వాడొకడూ లేడు!

(దూరాన చెర్చిగంటలు మ్రోగుతాయి. ఆ శబ్దం వినగానే వృద్ధులిద్దరూ టోపీలుతీసి చేతబట్టుకుని, భక్తితో శిలువ వేసుకుంటారు......ఇవాన్, డిమిట్రీలు అశువివంచనే బడిపోతూంటారు......దూరాన మరో కుటీరప్రాంతంలో ఒకస్త్రీ కోడిపెట్టను తరుముతూంది. కోడి బిగ్గరగా అరుస్తూ అటుసటు పరుగెడుతూంది. కుటీరం బైటకూర్చుని కొందరు యువతులు

సూర్యాక్రాంతపుగింజలు ఒలుచుకు తింటూంటారు. పనిపాటులు చేసుకునీ ఆయువతుల అంగాలన్నీ పరిపుష్టములై వుంటాయి. అక్కడి కుటీరాలన్నీ కొయ్యవే. ప్రతీ కుటీరానికీ ముందు దట్టమైన కోరడీ, ద్వారమూ వున్నాయి. ముంగిట కూరపాదులు, పూలమొక్కలు, అక్కడక్కడ పండ్లచెట్లు విల్లోవృక్షాలు కోరడిద్వారాల కిరువైపులా జంటలుగా పెరుగుతూ, దట్టమైన ఆకులతో చల్లని నీడనిస్తుంటాయి. చెర్చిలో సాయంతన ప్రార్థనలకై ఆహ్వానిస్తూ గంటలు మ్రోగుతున్నాయి. ఆ అటవీప్రాంతమంతా వివిక్తంగానూ, నిశ్శబ్దంగానూవుంది. చర్చిగంటల గుంజనధ్వని ఒక్కటే మందంగా వినిపిస్తూంది......దారిన బోతూన్న ఆ యువకులిద్దరూ యీ వివిక్త వాతావరణ ప్రభావానికి ముగ్ధులై మాటలాడుకో నారంభిస్తారు.)

ఇవాన్ పొవ్లోవ్:- అన్నయ్యా! ఈ ప్రదేశమెంత వివిక్తంగా, నిశ్శబ్దంగా వుంది! ప్రకృతంతా నిద్రాణమైనట్లుందిగదూ? ఈ వాతావరణం గాఢమైన ఆలోచనల్ని ప్రేరేపించేదిసుమా!

డిమిట్రీ పొవ్లోవ్:- వాన్యా! నువ్వో చిత్రమైనవాడివి రా. ఎప్పుడూ యేదో భావనాప్రపంచంలో స్వాప్నికసంచారం చేస్తున్నట్లుంటావు.

ఇవాన్:- అన్నయ్యా! నువ్వు స్వప్నమంటే జ్ఞాపకం వచ్చింది. నీకెప్పుడేనా యిల్లాంటి కల వచ్చిందా? నీకు శక్తివున్నంత వడిగానూ యెక్కడికో త్వరత్వరగా బోతూన్నట్లూ, ఐనా

యెంతసేపటికీ ఒక్క అడుగేనా ముందుకు సాగక, వున్న చోటనే పాతుకుపోయినట్లుగా వున్నట్లూ, ఎంత కొట్టుమిట్టాడినా ఒక్క జానెడు మేరకూడా ముందుకు పోలేకపోవడం యెంత భయంకరం!

డిమిట్రీ:- వాన్యా! నాకల్లాంటికల యెప్పుడూ రాలేదు గాని, (చిరునవ్వుతో) అమ్మ వేసిన దోసెలు తింటూంటే మాత్రం నాకు సరిగ్గా అటువంటి భావమే కలుగుతుందిరా. తినాలను కున్నంత వేగంగా, బాగా తిననేలేము! ఏమంటావ్? అంతేనా?

ఇవాన్:- పరిహాసంగాదన్నయ్యా. ఇదేనాకు పగటికలై పోయిందనుకో. నేనెక్కడికో బహుశీఘ్రంగా పోవాల్సివున్నట్లూ- అదెక్కడికో నాకూ తెలియదు!- కాని నా కాళ్ళుమాత్రం యెంత ప్రయత్నించినా ఒక్క అంగుళంమేర అయినా జరగనట్లూ వుంటుంది!

డిమిట్రీ:- (సానునయంగా) వాన్యా! నువ్వు మనసు గట్టిబరచుకోవాలిరా. నీ జీవితమంతా ముందేవుంది. ఆదర్శాలకోసం కృషిచేసేందుకు యేకాగ్రతా, అర్హతా ముఖ్యంసుమా!

ఇవాన్:- అన్నయ్యా! మనం జీవించేది ఒకే ఒకసారి. ఔనా? అందుకనే తిరిగి కూడదీసుకోలేని మన జీవితంలో ప్రతినిముషాన్నికూడా సార్థకంగా, ఆదర్శంగా, మానవోచితంగా గడపాలి. దాన్నిగూర్చే నేనెప్పుడూ కలలుగంటున్నాననుకో.

డిమిత్రీ:- తమ్ముడూ! నువ్వనేది నిజంగా యెంతో గొప్ప విషయం. కాని, అది అందరకూ సాధ్యమవుతుందా అని...

(మాట్లాడుకుంటూ వారిద్దరూ పట్టణ పరిసరాలకి చేరుకుని, ఒక పెద్ద ప్రహారీగోడ గేటుముందుకి వస్తారు. గోడమీద తళతళ మెరిసే యిత్తడి పలకమీద 'తెలిగిన్ అండ్ సన్సు' అనే పేరు చెక్కివుంటుంది. లోపలగా యెత్తైన రాతికట్టడం బ్రహ్మాండంగా కానవస్తూంది. ఇవాన్ ఆ ద్వారంవద్ద ఆగుతాడు.)

ఇవాన్:- అన్నయ్యా! ఒక్కమాటు ఆగరా. ఇప్పుడేవస్తా.

(గేటును త్రోసుకుని లోనికిపోతాడు. లోపలి సౌధప్రాంగణంలో భౌంయ్‌మని కుక్క మొరిగిన శబ్దం. ఇవాన్‌ను కరవడానికి వురకబోయే కుక్కని సేవకుడు గొలుసుపట్టిలాగి నిలుపుతున్నాడు. మేడచుట్టూ పెద్ద ఆపిల్‌తోట. తోటంతా శిశిర ఋతుశోభలో అతిమనోజ్ఞంగావుంది. పొంగిపొరలే జీవనవికాస జనిత మనోహర సౌందర్యవాహినిలో తలమున్కలైన ఆ యువకుడు అనిమేషుడై నిలిచిపోతాడు. వృద్ధుడైన తోటమాలి చేతిలో కత్తిపట్టుకుని యివాన్‌ను సమీపిస్తాడు. వనసౌందర్యానికి ముగ్ధుడైన ఆ యువకుణ్ణి దూరాన్నుంచే గమనించిన తోటమాలికి యెంతో గర్వం కలుగుతుంది.)

తోటమాలి:- వందనాలు, బాబూ!

ఇవాన్:- తాతా! ఈ తోట యెంత బాగుంది!

తోటమాలి:- బాబయ్యా! ఈ తోట పెంపకంలోనే నా రక్తం ధారపోసేను. తెలిగిన్‌ల నౌకరీలోనే తలపండిపోయింది.

ఇవాన్:- ఇటువంటి చక్కనితోటను పెంచిన నీ శ్రమ వూరికే పోలేదు, తాతా!

తోటమాలి:- ఈ చేత్తో యెన్నితోటలో పెంచేను. అదే నాకు సంతోసం, బాబయ్యా!

ఇవాన్:- అదేం తక్కువగాదులే, తాతా! మీా యజమానిని చూడ్డానికి వచ్చేను.

(గుమ్మాలెక్కి సౌధంలోనికి ప్రవేశిస్తాడు.)

## రెండో రంగం

[తెలిగిన్ మేడమీది గది. లోన వుక్కగా వుంది. సాయంతన ప్రార్థనకు ఆహ్వానించే చెర్చిగంటల శబ్దం యిక్కడికి కూడ తాజుగా వినవస్తూంటుంది, పెద్ద పందిరిమంచంమీద తూలికాతల్పం, కుప్ప తిప్పలుగా తలగడలు. వాటిమీద శుష్క శరీరియైన వృద్ధుడు పడుకుని వుండి, వూపిరాడక గిజగిజ లాడుతూంటాడు. లావాటి వృద్ధస్త్రీ మంచం దగ్గర నిలబడి వుంది. రోగియే తెలిగిన్, వృద్ధస్త్రీ అతనిభార్య మార్ఫా]

మార్ఫా:- (శిలువవేసుకుంటూ) ఏమండీ! మీారు పవిత్రజలాన్ని తీసుకుని, ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. పురోహితులు బైట కనిపెట్టుకునివున్నారు.

ఆర్ఖిప్ సెమ్యోనిచ్ తెలిగిన్:- (చిరాకుగా) ఊరుకో! ఆయనకేం తొందరలేదు. ఆగుతాడులే. ఆయన కొడుకునే

ముందు యిక్కడికి పంపమను. ఎంతలేదన్నా అతను సీటర్స్
బర్గు డాక్టరు !

మార్ఫా:- మీకింకా ఐహికాడంబరాలు, తాపత్రయాలూ
పోలేదుగదా! ఖర్మ!

తెలిగిన్:- నోరుముయ్యవే, మూర్ఖురాలా! ఎన్నేళ్ళు వచ్చినా
యింతే నువ్వు!

మార్ఫా:- మధ్య నాకెందుకంటూ నిష్ఠూరం. నా మాట మీ
రెప్పుడు విన్నారుగనక?

(బైటికి వెళుతుంది. చావడిలో పురోహితుడు పీటర్
నల్లని అంగీధరించి కూర్చుని వుంటాడు.)

మార్ఫా:- ఫాదర్! ఆయన ముందుగా మీకుమారుణ్ణే తీసుకు
రమ్మంటున్నారు. మనమేం చేస్తాం!

(ఆగకండా బైటికిపోతుంది. తిరిగి వెంటనే డాక్టర్
యివాన్‌ను వెంటబెట్టుకుని ఆ చావడిలోకివస్తుంది. తండ్రీ కొడు
కులు ఒకరొకరిని చూచుకుంటారు.)

డాక్టర్ ఇవాన్ పావ్లోవ్:- (ఆశ్చర్యంగా) నాన్నా ! మీరా ?

ఫాదరు పీటర్ పావ్లోవ్:- (కఠినంగా) ఔను! ఇక్కడీ సమ
యంలో యింకెవరు కూర్చుంటారు? వెళ్ళు. ఆయన ముం
దుగా నిన్నే చూడాలంటున్నాడు. మృత్యువు సన్నిహితమై
వుండగాకూడ అతను తుచ్ఛమైన ఐహికవిషయాలకే
ప్రాధాన్యత నిస్తున్నాడు! శాంతం పాపం! అల్పమానవులు !
సరే, వెళ్ళు.

(ఇవాన్ మాటాడకుండా లోనికి వెళ్ళిపోతాడు.)

(అప్పుడే మేడమీది రోగిగదిలో యివాన్ ప్రవేశిస్తాడు. అతనివెంబడే పొడుగాటి సన్నని యువకుడు లోనికివచ్చి, మంచందరికి పోయి, రోగిచేతిని ముద్దెట్టుకుంటాడు.)

యువకుడు:- నాన్నా ! ఎల్లావుంది ? ఒంట్లో యేమైనా కొంచెం నయమా ?

తెలిగిన్:- (పేచీకోరుతనంగా) ఊc! నాకేం భయం లేదులే. నేను అప్పుడే చావను. మిమ్మల్ని యేడిపించడానికేనా బ్రతికి వుంటాను! (డాక్టర్ యివాన్ వైపుచూపుతూ) ఇదుగో! ఈ పీటర్సుబర్గు డాక్టర్ నన్ను బ్రతికిస్తాడు. నువ్వింక వెళ్ళచ్చు.

(కుమారుడు బైటికి వెళ్ళిపోతాడు, మారుమాటాడకుండా.)

తెలిగిన్:- డాక్టర్! ఊపిరికూడా ఆడటంలేదు. నాకు తక్క-మిగిలిన జీవులందరికీ కావాల్సినంత గాలివుంది. నాకు మాత్రం... (పళ్ళికిలిస్తాడు.) నాకు బాగా జ్ఞాపకం, మీ ఒళ్ళో పిల్లలందరితో నూకలిసి క్రిష్టమస్ పండుక్కి కీర్తనలు పాడుతూ వచ్చేవాడివి, మాయింటికి. గుర్తుందా ?

ఇవాన్:- ఆc! గుర్తుంది. మీ బజ్జీలు, మిఠాయిలు మాంఛి రుచిగావుండీవి కూడాను.

తెలిగిన్:- ఐతే నీ కవి బాగా యిష్టమున్న మాట! ఔనా ? సరే, నీ కృతజ్ఞత చూపించే అవకాశం యిదే. కానీ.

(ఇవాన్ తెలిగిన్ శరీరం పరీక్షిస్తాడు. తలపంకిస్తాడు.)

తెలిగిన్:- అంటే యింక లాభంలేదన్నమాట! నాకు మృత్యు వాసన్నమై వుందంటావా? మార్ఫా!

(గృహిణి గదిగుమ్మంలోంచి వస్తూంటుంది.)

తెలిగిన్:- మార్ఫా! ఇతనికి నూరురూబుళ్ళు యియ్యి! నిజం చెప్పినందుకు. కేవలం అందుకే! డాక్టర్లు యిప్పటివరకూ నా సొమ్ము వేలకువేలు దోచేసేరు. దోపిడీగాంగలు! నన్ను బ్రతికిస్తారట! బద్మాష్‌లు! వెళ్ళి ఫాదరు పీటర్‌ను పిలుచుకురా! త్వరగా.

మార్ఫా:- ఇదుగో! ఆయన యిక్కడే వున్నారు.

(ఫాదరు పీటర్ గంభీరంగాలోనికి నడిచివస్తాడు. డాక్టరు ఇవాన్ స్టెతస్కోప్ జేబులో కుక్కి, బైటికి వెళ్ళిపో నుద్యుక్తుడవుతాడు.)

తెలిగిన్:- డాక్టర్! అప్పుడే వెళ్ళిపోకు. ఒక్కమాట. తరువాత యేమవుతుంది? ఏం? చెప్పవూ?

(అంటూ తెలిగిన్ మంచంమీద లేచికూర్చుని డాక్టరు చేతిని గట్టిగాపట్టుకుని భయం, ఆశ, బాధతోకూడిన కళ్ళతో చూస్తుంటాడు. ఫాదరు మెల్లగా సమీపిస్తాడు.)

తెలిగిన్:- (డాక్టరుతో) నీకు దేవునియందు నమ్మకం లేదు? కానా? ఐతే మరి దేనిమీదవుంది నీకు నమ్మకం? (రోగి ముఖంలో ఆశాచ్ఛాయలు ఒకపరి అలముకొంటాయి. ఈ

శస్త్ర డాక్టరు దగ్గర తన్ను మృత్యుబాధనుంచి తప్పించగల మత మేదైనా వుండకపోతుందా? అన్నట్లు చూస్తాడు.)

డాక్టర్:- (చిరునవ్వుతో) ఆఁ! నమ్మకంలేకేం? మానవుని లోనే నా కమితవిశ్వాసం. మానవవివేకం, విచక్షణా, విజ్ఞానం, వీటిలోనే!

తెలిగిర్:- (నిర్వణ్ణుడై) మానవుడిలోనా? (చీత్కారంతో) మానవుడు వస్త్రైపశువు! పోరుగువాణ్ణి నువ్వు తినెయ్యకపోతే వాడే నిన్ను తినేస్తాడు. ఇదే మానవసమాజనీతి, ధోరణి! ప్రాణిలోకంలోనూ యిదేగదా ప్రధానసూత్రం! నేనల్లాగే చేసేను. తెలుసా? నా తమ్ముణ్ణి నాశనంచేసి, వాడి కుటుంబాన్ని కట్టుబట్టలతో నడివీధిలోకి తగిలేసేను! అఁహాఁ; ఈ భారమంతా యెవరుభరిస్తారు? దేవు డుండితీరాలి! నాకు దేవుడు లేకపోతే జరగదు!

(ఫాదరు పీటర్ గంభీరంగా నడిచివచ్చి, పవిత్రపేటిక (ఫిక్సు) ను టేబిలుమీద నిక్షేపిస్తాడు, దానిమీాది మందుసీసాల్ని క్రిందికిత్రోసి.)

ఫాదరు:- పరమపిత, దేవునికుమారుడు, పవిత్రాత్మ,- వీరి పేరిట......(తనసల్లని అంగీచెరగును రోగితలమీాద కప్పుతూ, కుమారునిపొమ్మని సంజ్ఞచేస్తాడు. ఇవాన్ కిటికీదగ్గరకి పోయి తోటలోకి చూస్తూంటాడు. అక్కడనుంచే యీా ప్రాయశ్చిత్తకాండనంతనూ ఆసక్తితో, ఆశ్చర్యంతో గమ

నిస్తూంటాడు. బైటికి వెళ్ళిపోడాని కాతని మనసు నిరాక రిస్తుంది.)......నేను నిన్ను పాపవిముక్తుణ్ణి గావిస్తూ న్నాను. (భయభక్తి భావా లుట్టిపడేలా వుచ్చరిస్తాడు ఫాదరు యీ వాక్యాల్ని.)

తెలిగిన్:- (ముసుగుక్రిందినుంచే) ఫాదర్! మీ కుమారుడు దేవుడంటే నమ్మడు. దానికి బాధ్యులెవరు ?...(హాఠా త్తుగా డాక్టర్ నుద్దేశించి బిగ్గరగా అరుస్తాడు.) ఇదుగో! డాక్టర్! నేనింక జీవించనని నువ్వెల్లా చెప్పగలవు? నువ్వు దేవుడివా? ఏం, చెప్పు! కాదంటే నువ్వు నోరుమూసుకుని వుండడమే మంచిది! మనం అందరం ఆ దేవదేవుని బాని సలం, అందరం——(అంటూ ఫాదరు చేయిపట్టుకుని ముద్దె ట్టుకుంటాడు. మెల్లగా మంచంమీదే లేచినిల్చుని, కిటికీ లోంచి బైటితోటలోకి చూస్తాడు.) ఈ నేడు యాపిలు చెట్లు విరగ్గాచినాయి! (ఆయాసపడుతూ) ఎవరికావాలి, వెధవపళ్ళు!

ఫాదరు:- (కోపంగా) అపవిత్రవాక్కులు మాట్లాడక! నీకు ఈశ్వరసాన్నిధ్యం కలిగించనుసుమా.

తెలిగిన్:- ఐతే నేను విధిగా చావాల్సివుందన్నమాటే?...... సూర్యుని ప్రకాశం వుడగనిదేనే?...నాపండ్లతోట నిలబడి వుండగానే?......(ఉక్కిరిబిక్కిరవుతూ) ఇదంతా యెవరి కోసం? నాకుగానిది నాశనంగానీ! మీకోసమా? పోనీ, ఎవరికిగావాలి!

డాక్టరు ఇవాన్:- (ప్రశాంతంగా) తెలిగిన్! అసూయ మీ హృదయాన్ని దహించేస్తూంది. ఔను, మరి! ఫలవృక్షాలు ఒక్కరికోసమనేమిటి? మీతో అవి పోవడంయెల్లాగ?... కాస్తూనేవుంటాయి.

తెలిగిన్:- అల్లాజరగడానికి వీల్లేదు! వీళ్ళని అంటించా!...అః హాః! అవి నాశనంకావాల్సిందే. నేనంటున్నా, అవి మరెవరికీ కాకూడదు! మూర్ఫా! (మూర్ఫా గుమ్మంలో కనిపిస్తుంది.) ...తోట! పళ్ళచెట్లు!...అన్నీ నరికించెయ్యాలి!

(మూర్ఫాముఖంలో భయవిషాదాలు గానవస్తాయి.)

ఫాదరు:- తెలిగిన్ బుద్ధితెచ్చుకో! మతిచెడగొట్టుగోకు! నిన్నే!

తెలిగిన్:- (మూర్ఫాతో) నేనుచెప్పింది వినబడలేదూ? ఊఁ! సేవకుల్ని వెంటనేపంపు! చెట్లు నరికించు!

ఫాదరు:- ఇవాన్! వెళ్ళిపో! ఇక్కణ్ణుంచి, త్వరగా!...(కుమారుని సమీపించి అతన్ని గుమ్మంవైపు పంపిస్తూ) చూసేవా? నీమాటలతో అతణ్ణి ఏమే స్థితికి దెచ్చేవో?

ఇవాన్:- నేనా ?

ఫాదరు:- నువ్వే! కట్టుబాట్లు, బంధాలు తెగిపోతే మానవుల్లో పశుత్వమే గాదు రాక్షసత్వం విజృంభిస్తుంది. తెలియదూ? దౌర్భాగ్యుడు!...

(తెలిగిన్ తనకడపటి శక్తినంతనూ కూడదీసుకుని, ఆసరాకి మంచమూ, టేబిలూ పట్టుకుని తూలుతూ కిటికీదగ్గిరికివెడతాడు. ఫాదరు పీటర్ నిశ్చేష్టుడై గుమ్మంలోనిల్చునివుంటాడు.)

---

## మూడో రంగం

[తెలిగిన్ పండ్లతోటలో డాక్టరు ఇవాన్ అప్రతిభుడై నడుస్తున్నాడు, వెళ్ళిపోడానికి. సేవకులంతా గొడ్డళ్ళుపట్టుకుని గుమిగూడి వుంటారు. అందరి ముఖాలూ భయాశ్చర్య విహ్వాలములై వుంటాయి.]

తోటమాలి:- (ముఖం చేతులతో కప్పుకుని దుఃఖంతో)
అయ్యో! ఇదేమిటి? చేతులారా పెంచిన తోటను నరుకుతారా యెవరేనా ?

మార్ఫా:- (నోటమాటరాక స్థంభించిపోయి) అయ్యో!

(మేడమీదిగది కిటికీవద్ద శుష్కించిన తెలిగిన్ నిల్చుని వాగరుస్తూ, పైశాచిక అట్టహాసంచేస్తూ అరుస్తుంటాడు.)

తెలిగిన్:- మీ యిష్టంవచ్చినట్లు చెయ్యాలనుకున్నారేం? ఒరీ! పందివెధవలు! నాసొమ్ము తిందామనుకున్నారా, కూర్చుని? నరకండి! చూస్తారేం? కొట్టరే? (ముఖంలో మత్సర ద్వేషాలు తాండవ మాడుతూంటే, వున్నట్లుండి వణుకుతూ క్రిందపడి పోతాడు.)

(ఒక్కమాటు అంతటా నిశ్శబ్దం. పిడుగుతాలగినట్లు అంతా నిట్టూరుస్తారు. సేవకులు గొడ్డళ్ళు క్రిందపారేస్తారు. తోటమాలి పరుగునపోయి యాపిల్ చెట్టులో లోతైన గొడ్డలిగాట్లు తాకుతూ, నిమురుతాడు. పసిపిల్లలవలె, ఆవృద్ధుని నేత్రాలమ్మట కన్నీరు ధారాపాతంగా కారుతూంది )

తోటమాలి:- అయ్యయ్యో! కల్పవృక్షమే! ఎంతకష్టపడి పెంచేను! ఎల్లా మనసు ఒప్పిందో కొట్టమనడానికి !

(దూరంలో విచలితమనస్కుడై నిలబడిన యివాన్ సాయంకాల ప్రార్థనా ఘంటాధ్వనులువిని, ప్రకృతంలోకి వచ్చి తోటదాటి బైటికి వెళ్ళిపోతాడు.)

ఇవాన్:- అన్నయ్యా! రా, వెళదాం.

డిమిత్రీ:- (తమ్ముని వైఖరిచూచి ఆతురతతో) ఏమిటి? వాన్యా! అల్లావున్నావేం?

ఇవాన్ :- ఏమీలేదు. చెపుతాను, రా:

(ఇద్దరూ మాటాడుకుంటూ, అడవిప్రక్కన బడిపోతారు)

---

## నాలుగవ రంగం

(పాలోవ్‌ల గృహంలో భోజనాలగది. తినుబండారాలతో నిండిన ప్లేట్లు టేబిలుమీద అమర్చివుంటాయి. డిమిత్రీ టేబిలుదగ్గర బెంచిమీద కూర్చుని 'గైటరు' వాయిస్తూ, పాడుతూంటాడు. కొంచెందూరంలో ఇవాన్ ఆలోచనలోమునిగి, కుర్చీపై కూర్చునివుంటాడు )

డిమిత్రీ:- (పాటఆపి) ఆ ముసలాడు చాలా చిత్రమైనవాడే! ఐనా నువ్వా నూరు రూబుళ్ళూ తీసుకుని వుండాల్సిందిరా. నిజంగా! ఎందుకు తీసుకోకూడదు? (ఫోర్కుతో వూరిన పుట్టకొక్కును తీసి రుచిచూస్తాడు.)

(తల్లి వీరాపాలోవా చిరునవ్వు నవ్వుతూ లోనికి వస్తుంది.)

వీరా:- ఏమిట్రా, వాన్యా. అల్లా కూర్చున్నావేం? ఆ పీటర్సు బర్గ్‌లో యింతకంటె బాగుంటుందనుకుంటూనేం?

డిమిట్రీ:- లేదమ్మా! అక్కడ పుట్టకొక్కలూ వుండవ్, పచ్చిక బైళ్ళూ వుండవు! (ఇవాన్ వైపు సాభిప్రాయంగా కన్నుగీలు కతూ) జుత్తులు కత్తిరించుకుని, సిగరెట్లు కాలుస్తూతిరిగే పడుచులుంటారు. వాళ్ళూ మా కాలేజీల్లో చదివేవాళ్ళే, మాకుమల్లేనే అద్దెకొంపల్లో స్వతంత్రంగావుంటారు.

వీరా:- ఆడపిల్లల్ని అల్లా స్వేచ్ఛగా వదిలిపెడతార్రా?

డిమిట్రీ:- వదలిపెట్టడానికేముందే, అమ్మా? వాళ్ళూ చదువు కుంటూ, విజ్ఞానవంతులై వుంటారుగా.

వీరా:- చదువుకోవడానికి జుత్తులు కత్తిరించుకోడం, సిగరెట్లు కాల్చడమూనా ముఖ్యం?

ఇవాన్: అమ్మా! వాడికంతా వేళాకోళమేనే. అంతా జుట్టు కత్తిరించుకునే వాళ్ళూ, సిగరెట్లు కాల్చేవాళ్ళే వుండ రమ్మా. ఎక్కడో...

(బైట వాకిలిగేటు కిరకిర లాడుతుంది. వీరాపోయి తలుపు తీస్తుంది. ఫాదరు పీటర్ చిరచిర లాడుతూ లోపలికివచ్చి, వీరాను మెల్లగా ప్రక్కకినెట్టుకుని, తన గదిలోకి పోయి గడియ వేసుకుంటాడు.)

వీరా:- (భర్త కోపంగావున్నట్లు గ్రహించి) వాన్యా! ఏమిట్రా, నాన్న అల్లా వున్నారు? మీరు పోట్లాడుకో లేదుగదా?

ఇవాన్:- ఇంకా లేదమ్మా.

(ఫాదరు పీటర్ గదిలోంచి పెద్ద చప్పుడు విన వస్తుంది. ఏదో బరువైనది నేల కూలిన శబ్దం మళ్ళీ విన బడుతుంది.)

వీరా:- ఏమి మూడిందో గదా! ఆ యీశ్వరుని దయ!

(ఇవాన్ నిశ్చయంతో తండ్రి గదివైపు వెళతాడు. తలుపు తట్టగా, కొంత సేపటికి తలుపు తెరిచి, ఫాదరు పీటర్ దారిలో నిల్చునే ప్రశ్నార్థకంగా చూస్తాడు. కళ్ళు విచిత్రంగా మెరుస్తుంటాయి, ఆయన జుట్టంతా రేగివుంది. గదిలో పుస్తకాలన్నీ చిందర వందరగా నేల మీద పడి వుంటాయి.)

ఫాదరు:- ఏం కావాలిరా, నీకు? (ఇవాన్ మాట్లాడడు.)

వీరా:- వచ్చి తిండి తినండి. అంతా కనిపెట్టుకుని వున్నాం.

ఫాదరు:- నేను భోంచెయ్యను. నా కోసం కనిపెట్టుకోడం దేనికి? (తలుపు మూసుకోవాలనుకొనే సరికి యివాన్ గదిలోపలుంటాడు. ఫాదరు కోపంగా చివాలున పుస్తకాల షెల్ఫు దగ్గరికి పోయి ఒక్కొక్క పుస్తకాన్నే తీసి విసిరి నేల మీద పారేస్తూంటాడు.)

ఇవాన్:- (ఒక్కొక్క దాన్నే తీసి చూసి ప్రక్కన పెడుతూ) బెలిన్‌స్కీ...... చెర్నిషేవ్‌స్కీ...... పిసారేవ్ ......
(శాంతంగా ఒక పుస్తకం తెరిచి సిరాగీత గీచిన భాగాన్ని చదువుతాడు.) "మానవజాతికి గల గొప్పకీడు ఒకే ఒకటి: అజ్ఞానం. దీనికి మందు ఒక్కటే వుంది. శాస్త్రీయ విజ్ఞానం."

ఏం, నాన్నా! మీరు గాదూ యీ వాక్యాలని గుర్తు పెట్టింది? ఇది మీ వ్రాతే!

ఫాదరు:- (కోపంగా) నా రాతే! నాదేనోయ్ తప్పంతా! (గుండెలు చరుచుకుంటూ) శాస్త్రీయ విజ్ఞానాన్ని మతంతో సమన్వయా పరచాలనుకున్నా. దానికి ఫలితం యిది! (ఇవాన్ను వ్రేలితో చూపిస్తూ, భార్యతో) వీడనుకుంటున్నాడు, తన కన్నీ తెలుసునని! దేవుడి కంటే అధికుణ్ణని! ఈ అహం భావం అల్పత్వలక్షణం. (ఇవాన్‌తో) ఇల్లా జరుగుతుం దనుకుంటే యీ దిక్కుమాలిన చదువుకి పంపేవాణ్ణా? మత విద్యాశాలకే పంపేవాణ్ణి కాదూ? (గొడుకు జబ్బపట్టుకుని విదుల్చుతాడు.)......ఓరీ దౌర్భాగ్యుడా! ఆ వృద్ధునిలో గల దైవవిశ్వాసాన్ని నాశనం చేసేవు. ఫలితం?...కండ్ల చెట్లు నరికెయ్యమన్నాడు! ఈ సారేనా గ్రహించేవా?... మానవుడికి యేదో భయం, విశ్వాసం వుండాలి. అదే గనక లేకపోయిందా, యిక ప్రతివాడూ చెట్లు నరికేస్తాడు, కొంప లంటిస్తాడు, సర్వ నాశనానికి వెనుదీయడు. లోకంలో యిక పండ్ల తోటలూ వుండవు, పాడి పశువులూ వుండవు! అప్పుడీ బడాయికోరు మానవుడు యేం తిని బ్రతుకుతాడురా? పుటమన్ను! అప్పుడింక కట్టుబాట్లు యేముంటాయిరా? (పెట్టెలోంచి ఓ పుస్తకాన్ని లాగి భార్యవైపు జాపి) ఇదిగో! దీన్ని తగులబెట్టు! దీంట్లో అంతా విషమే!

(వీరా యేం చేయడానికీ తోచక, కన్నీరు చెంగున ఒత్తుకుంటూ అప్రతిభయై నిల్చుంటుంది. ఫాదరు చివా

లున దూసుకుని మండే పొయి దగ్గరకు పోతూంటే, యివాన్ కూడా దూకుడుగా వెంబడిస్తాడు.)

వీరా:- (భయకంపితయై) ఏమిటీ, యిద్దరికీ మతి పోయిందా యేమిటి? మిమ్మల్నే!

(ఇవాన్ తండ్రి దారికడ్డుగా నిలుచుంటాడు. అతని కళ్ళలో క్రోధం, ముఖంలో రౌద్రం కనిపిస్తున్నాయి. పిడికిళ్ళు బిగించి, చేతులు వ్రేలాడ వైచుకుని, ఓడు గరుస్తూంటాడు. ఇరువురూ దృఢకాయులే, క్రోధావేశ వివశులే; తండ్రి కొడుకు లిరువురూ అచ్చంగా ఒకే పోలికగా వుంటారు. ఒకరి కొకర భిముఖంగా నిల్చుని వుంటారు. కుమారుని ఉజ్వల నేత్రాల్నిచూసి తండ్రి మారాడకుండా ఉదాసీనత వహిస్తాడు. ఇవాన్ సాహసించి తండ్రి చేతిలోంచి నలిగిన పుస్తకాన్ని తీసుకుని, సరి చేస్తూంటాడు. ఫాదరు నిట్టూరుస్తూ, అలిసినట్లు దగ్గరలో బెంచిమీద కూలబడి, మౌనంగా వుంటాడు. పొయ్యి భగ్గున మండుతూ గది నంతనీ సుఖకరమైన వెచ్చదనంతో నింపుతూంది.)

ఇవాన్:- (నలిగిన అట్ట సరిచేస్తూ) 'మెదడు: అనుభవ జాత అనుక్రియలు.' శచినోవ్ పండితుడు యెంత గొప్ప వైజ్ఞానికుడు!

వీరా:- ఈ మాత్రానికి యింత పంతం దేనికి, వాన్యా!

ఫాదరు:- ఇవాన్! నువ్వు చేతగాని పరుగులకి బోతున్నావు!... పీటర్సుబర్గ్ నీబుర్ర తిప్పేసింది!...చదువు నీలో అహం భావాన్ని పెంచింది!...హూఁ!

ఇవాన్:- నాన్నా! మీరు పొరబడు తున్నారు.

ఫాదరు:- ఆ వృద్ధుణ్ణి నిస్పృహతో తెగించేట్లు చేసింది నువ్వే గాదూ? అదీ నా పొరబాటేనా?

ఇవాన్:- ఆయనకి ఈశ్వర సాన్నిధ్యం లేకండా చేస్తానని బెదిరించింది మీరే గదూ? (ఉపాలంభనగా అంటాడు.)

ఫాదరు:- ఐతే యేమంటావురా? నాకు అధికారం వుంది. నేను మతాచార్యుణ్ణి. మరి నువ్వో? నువ్వెవరివంటా? పుణ్యాపాప నిర్ణయం నీ తలకు మించినది సుమా! జాగ్రత! నువ్వు అహంభావంతో పతనం గాకండా చూసుకో.

ఇవాన్:- (శాంతంగా) నాన్నా! అహంభావం లేకుండా చేసుకోవాలనే నా కృషి. అందువల్ల నేను పతనం అవుతా ననే భయం లేదనుకుంటా.

ఫాదరు:- (ఆశ్చర్యామోదాలతో కుమారుని చూస్తూ, మెల్లగా,మార్దవంగా) వాన్యా! నాయనా! నువ్వేనా? ఎంత వాడి వయేవురా! నా వాన్యా! (ఆయన స్వరంలో మెచ్చుకోలు ద్యోతక మవుతూంది; కుమారుని చూసి గర్వపడుతూన్నట్లు తల పంకించుతూ అతణ్ణి మూర్ధాఘ్రాణం చేస్తాడు.)

---

# అయిదో రంగం

[1880 సంవత్సరం ఉగాది ముందు సాయంత్రం పీటర్సుబర్గ్ నగరంలో నెవ్‌స్కీ రాజవీధి. ప్రొద్దు పోయినా వీధంతా వుత్సాహ కోలాహలంతో, పండుగ గుంపులతో సమ్మర్దంగా వుంది. తెల్లవారితే ఉగాది. హోటళ్ళు, అంగళ్ళ ప్రకటనలు బిగ్గరగా, కోలాహలంగా వున్నాయి. డ్యూమా (పార్లమెంటు) భవనం మీది గడియారం పూర్తిగా మంచుతో నిండిపోయి, కానరాడంలేదు. పగకొండైంది. గంటల శబ్దం వీధుల్లోని కోలాహలం మీదుగా శ్రావ్యంగా వినవస్తుంది.

ఒక ప్రక్క వీధిలో మేడమీదగది. విద్యార్థులదని చెప్పకనే తెలుస్తుంది. టేబిలుమీద రొట్టె, మాంసం ప్లేట్లలో వుంది. ఆసవం సీసాలు, గ్లాసులు అమర్చి వున్నాయి. డిమిట్రీ పావ్లోవ్ కుర్చీలో కూర్చుని గైటర్ మీద మందంగా పాడుతుంటాడు. అతని వేళ్ళు గైటరు తీగల్ని అంటీ అంటనట్లున్నాయి. లోపలి గదిలోని తెర మరుగునుండి ఆడవాళ్ళ దుస్తులు కనబడుతున్నాయి.

రెండో గదిలో సోఫాలమీద కూర్చుని వుంటారు,- సెరాఫిమా, జ్హెనియా, పిత్రిశ్చేవ్, మరొకరూ. సెరాఫిమా దట్టమైన తలకట్టును మెలిద్రిప్పి, సిగ చుట్టుకుని వుంది. జ్హెనియా గిరజాలు కత్తిరించుకుని వుంటుంది; ఆమె కళ్ళు చిన్నవి, చిలిపితనం వాటిలో తాండవిస్తుంది. పిత్రిశ్చేవ్ పుష్టిగా, యెర్రని బుగ్గలతో, మాంచి హుషార్‌గా వుంటాడు. మరొక విద్యార్థి సన్నగా, కళ్ళజోడుతో వుంటాడు. సోఫాలమీద పుస్తకాలు చిందర వందరగా పడుంటాయి. వీధులో గ్యాస్ దీపాలక్రింద, మంచు బిళ్ళలు బిళ్ళలుగా పడటం కిటికీల్లోంచి కనిపిస్తుంది.

డిమిట్రీ పాట ముగిస్తాడు. గైటర్‌నుంచి వచ్చే టుంయ్ టుంయ్‌లు కూడ నిలిచిపోయినాయి. డిమిట్రీ లోగదిలోకి వస్తాడు.]

పిత్రిశ్చేవ్:- భేష్! డిమిట్రీ! రసాయన శాస్త్రజ్ఞులకి ఆత్మ వుంటుందని నేను కలలోకూడ అనుకోలేదోయ్!

డిమిట్రీ:- (చిరునవ్వుతో) వుందని యిప్పుడైనా స్పష్టమైందిగా! వాన్యా మాత్రం అల్లాంటి దేదీ లేదంటున్నాడు. అదొక అవయవం గాదనీ...

పిత్రిశ్చేవ్:- ఆత్మ అవయవమా?

విద్యార్థి:- అవయవం గాక మరేమిటో చెప్పు? నాకూ తెలుసుకోవాలని వుంది.

పిత్రిశ్చేవ్:- చెప్పడానికేముందోయ్, నీ మొహం? అంతా అనుకునేదేగా.

విద్యార్థి:- (ఉద్రేకంగా చేతులు విసురుతూ లేచి) అంతా అనుకునేదే మనమూ అంగీకరించాలా? మన విజ్ఞానం తుంగలో వూరద్రొక్కడానికా?...

పిత్రిశ్చేవ్:- ఒప్పుకోక నువ్వు చేసేదేముంది? పోవోయ్, పెద్ద కబుర్లు చెప్పక...

జెనియా:- (రాగతనంతో) ఈ వాగ్వాదాలు మనకి పండుగనాడేనా తప్పవూ? తలా తోకా లేని యీ చర్చలతో ప్రాణం విసిగి పోతూంటే! చాలించుదురూ, మీ పుణ్యముంటుంది గాని.

పిత్రిశ్చేవ్:- ముత్యాల్లాంటి మాటలు! మేలిమి బంగారు తునకలే! (గడియారం చూస్తూ) అప్పుడే పదకొండు దాటిందే! మన డాక్టరు యింకా అయిపు లేడు! పరధ్యాన్నపు...

డిమిత్రీ: వచ్చేస్తాడు. వాడు లేబొరేటరీకి పోతున్నా నన్నాడులే. వాన్యా తలపెట్టిన పని పూర్తి చేయనిదే...

పిత్రిశ్చేవ్:- ఈ వేళా లేబొరేటరీలోనే! అక్కడేం చేస్తున్నాడో తెలుసుకోవాలని వుంది. యూనివర్సిటీ పరీక్షల్లో గెలుపొంది బంగారు పతకం పొందేడు. అకాడమీలో (మెడికో-సర్జికల్) ఔషధ శస్త్ర చికిత్సా పరీక్షలు పూర్తి చేసేడు! ఇవన్నీ చాలక యేడాదినుంచీ బోట్కిన్ క్లినిక్‌లో పాతుకుపోయి వున్నాడు! ఎందుకూ? నే చెపుతూంన్నా వినండి, అన్నింటిల్లోనూ తానే వుండాలంటే యెవడి జీవితమూ చాల దనుకోండి. ఔను! జీవితం అంటే మెల్లప్పుడూ గానుగెద్దులా పని చేయడమేనా? అదొక సుమధుర సంగీతం లాంటిది! సుఖానుభవం లేని జీవితం పీడకలే!

డిమిత్రీ:- (వ్యంగ్యంగా) పదిరాళ్ళు వచ్చే ప్రభుత్వ నౌకరీ సంపాదిస్తే చాలు నంటావు! ఏ ఆఫీసులోనో అన్ని సౌకర్యాలతోనూ వసతిగా వుంటే యింకేం గావాలి? ఔనా?

పిత్రిశ్చేవ్:- (ఎత్తి పొడుపు గ్రహించక) తప్పకుండా! అంతకంటే యేం కావాలోయ్? ఇల్లా కోరడంలో తప్పు నాకేం కనబడదు. నెగడిలో యెన్ని కట్టెలు పడెయ్యి, దమ్మిడీ ఖర్చులేదు. వెచ్చగా కుర్చీలో కూర్చో. అంతే!

(ఈ మాట లాతడు మనః పూర్వకంగా అంటాడు. సెరాఫిమా తప్ప మిగిలిన వాళ్ళంతా నవ్వేస్తారు. ఆమె

మాత్రం కనుబొమలు ముడేసి, టేబిలు గుడ్డ కొస వ్రేలికి మెలి బెడుతూంటుంది.)

సెరాఫిమా:- (పిత్రిశ్ఛేవ్‌తో) మీకు యివాన్ అంటే కిట్టదనుకుంటా.

పిత్రిశ్ఛేవ్:- నాకా? కిట్టక పోడం?

గ్జనియా:- అసలు యెవరేనా అస్తమానం లేబొరేటరీలోనే యెల్లా కూర్చుంటారో నాకూ అర్థం గాదమ్మా. అందులోనూ యిల్లాంటి పండుగపూటా? అదేనా ఆస్పత్రిలోనా!

పిత్రిశ్ఛేవ్:- నేనా? ఇవాన్‌ను అనిష్టంగా చూడడమా? బాగుంది! నడవండి, లేబొరేటరీకి వెళ్ళి వాణ్ణి లాక్కొద్దాం. మహమ్మదు మహీధరం దగ్గిరికి రాకుంటే మహీధరమే మహమ్మదు దగ్గిరికి బోవాలిగదూ!

(ఒక్క క్షణం నిశ్శబ్దం. అంతలో అందరూ ఒకేసారి నవ్వుతారు.)

డిమిత్రీ:- ఏం? ఎందు క్కూడదు? నడవండి పోదాం.

గ్జనియా:- భేషైన వూహ! వెడదాం పదండి!

సెరాఫిమా:- అదంత బాగా వుండదేమో?

గ్జనియా:- అందులో యేముంది? వెళ్ళాల్సిందే.

(నవ్వుతూ అంతా సందడిగా కోట్లు తీసుకుంటుంటారు. పిత్రిశ్ఛేవ్ ఆసవం సీసాలు జేబుల్లో పెట్టుకుంటాడు. అందరూ బిల బిల మంటూ వీధులోకి వస్తారు.)

---

## ఆరో రంగం

(హాస్పిటల్ భవనాలు. రాతి పలకమీద 'క్లినికల్ హాస్పిటల్-ఫిజియలాజికల్ లేబొరేటరీ.' అని వుంది. రాత్రి పన్నెండు గావచ్చింది. మంచు కురుస్తూంది. నిశ్శబ్దం ఆవరించుకుని వుంది. కొంచెం దూరంలో మసకగా క్లినిక్ భవనాలు. తెల్లని టోపీ క్రిందినుంచి నెరుస్తూన్న చెంపలు గానవస్తూ, తెల్లని గౌనులో డాక్టరు బోట్కిన్ భవన ప్రాంగణంలో గానవస్తాడు. ఇద్దరు మగాళ్ళు, బహుశా తండ్రీ కొడుకులై వుంటారు,-యేడుస్తూన్న స్త్రీని చేతులు పట్టుకుని నడిపించుకుని వస్తూంటారు.)

స్త్రీ:- (వెక్కి వెక్కి యేడుస్తూ) అయ్యో! దేవుడా! నాయనా! మమ్మల్ని వదలి పోయావా? ఎల్లా భరించగలను రా!

కొడుకు: (బోట్కిన్‌తో) అయ్యగారూ! శవగృహం యెక్కడుందండి? దయయుంచి చెప్పండి, బాబూ!

డాక్టరు బోట్కిన్:- అదుగో: ఆ కనిపిస్తూందే, అదే!

(వారు ముగ్గురూ అటువైపు తిరుగుతారు. ఆ స్త్రీ వెక్కుతూ, యేడుస్తూ, ఆమె నూరడిస్తూ పురుష స్వరం వినిపిస్తూంటుంది.)

బోట్కిన్:- (ఆ స్త్రీ నుద్దేశించి) అమ్మా విచారించకు. మనమేం చేయగలం? దేవుడు యిచ్చేడు, మళ్ళీ తీసుకుపోయేడు. (ఆయనముఖంలో విచారరేఖ లలముకుంటాయి.)

(గబ గబా నడుస్తూ లేబొరేటరీలోకి పోతాడు. డాక్టరు బోట్కిన్. లేబొరేటరీలో ఒక టేబిలు దగ్గర

కూర్చుని యేదో వ్రాస్తుంటాడు, డాక్టర్ ఇవాన్ పావ్లోవ్. అటెండరు నికోడిమ్ భోజనపు పళ్ళెం పావ్లోవ్ ముందుకు త్రోస్తాడు. ఆతడు తలెత్తి చూసి, యాంత్రికంగా భోజన పదార్థాలు నోట బెట్టుకుంటూ ఉంటాడు.)

పావ్లోవ్:- నికోడిమ్! కుక్కల్ని జాగ్రతగా మేపు తూండాలి సుమా; అదే నీ ప్రధాన కర్తవ్యం.

నికోడిమ్:- (వ్యాకుల పాటుతో) వేళకి తిండి పెట్టక పోతే కుక్క లూరుకోవు. మొరగనేనా మొరుగుతాయి. కాని, మీరో? నేను ఆహారం తెచ్చి నోట్లో పెట్టాల్సిందే. లేక పోతే మూడు రోజులైనా మాటాడ కూరుకుంటారు! కిం లేదు, కం లేదు.

(పావ్లోవ్ మౌనంగా వుంటాడు. నికోడిమ్ యువక ముఖంలో దృఢ నిశ్చయం, గాంభీర్యతా ప్రస్ఫుటంగా కనిపిస్తుంటాయి. ద్వారం దగ్గర తలవంచి గుమ్మాలు దిగి వస్తూన్న బోట్కిన్‌ను చూసి పావ్లోవ్ వుద్రేకంగా లేచి, ఆయన వైపు నడుస్తాడు.)

డాక్టరు పావ్లోవ్:- డాక్టర్! శుభవార్త! ఆ ప్రయోగం వుంది చూచేరూ ...

డాక్టరు బోట్కిన్:- (అలసట, విసుగుతో) ప్రయోగమా! సరే. కానీండి, వింటా. (టేబిల్ దగ్గర కూర్చుని చేతుల్లో తలను ఆన్చుకుంటాడు )

డాక్టరు పౌలోవ్:- (ఏమీ పాలుబోక నిల్చుని మౌనంగా వుంటాడు.)

డాక్టరు బోట్కిన్:- డాక్టర్! క్షమించండి. నాకు యీ రోజు మళ్ళా నరముల బలహీనత కనిపించింది. నా హాస్పిటల్‌లో ఒకరోగి మరణించేడు. రేపే ఉగాదికూడాను. ఆ కుటుంబం యొక్క దుఃఖాన్నేం చెప్పమన్నారు? మరో రోజు దొరక లేదూ మృత్యువుకి?

డా. పౌలోవ్:- కాని, యిందులో మీరు కించ పడాల్సిందే ముంది? ఇదివరలో వేనకు వేలు ప్రాణాలు మీరు కాపాడ లేదూ?

డా. బోట్కిన్:- ఇది వరలో యెందర్ని బ్రతికిస్తే నేం, యీ ప్రాణాన్ని కాపాడ లేక పోయేను!......దేవు డిచ్చినదాన్ని దేవుడే తీసుకు పోయేడు!......అఁహాఁ! దేవుడు తీసుకు పోవడ మేమిటి? నేను డాక్టర్‌ని గాదూ? ఏ డాక్టరూ యిటువంటి వుదాసీన భావంతో వుండ కూడదు!...అటు వంటిది రష్యాలో కల్లా పేరు మ్రోగిన పెద్ద డాక్టరు బోట్కిన్‌కే యింత అజ్ఞానం, అసమర్థతాను!...... చూసేరా? నాకు మీ దగ్గర దాపరికం యేమీ లేదులెండి, డాక్టరు పౌలోవ్! ఇదీ వైద్య విజ్ఞాన స్థాయి!

(నిశ్శబ్దం. డా. బోట్కిన్ లేచి గదిలో యిటు నటు పచారు చేస్తాడు. అది సగభాగం భూగర్భంలోకి వున్న

గది. పై అద్దపు కిటికీలు మంచుకి తెల్లనై మసక బారి నాయి. మధ్య వ్రేలాడే దీపం గదినంతనూ కాంతివంతం చేస్తూంది.....పచారు చేసే బోట్కిన్‌ను గమనిస్తూ పావ్లోవ్ టేబిల్ దగ్గరే మౌనంగా నిల్చుని వుంటాడు. బలిష్ఠుడైన ఆ యువక డాక్టరు వెనక గాజు రిటార్టులు, టెస్టుట్యూబులు వగైరాలతో నిండిన బల్లలు. అభి వృద్ధి బొందుతూన్న లేబొరేటరీ లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ప్రయోగాల కోసం వుంచిన కుక్కలు బోనుల్లోంచి మూతులు పైకి పెడుతున్నాయి. కొంచెం సేపట్లో బోట్కిన్ పచారు మానేసి, సాలోచనుడై, కటువుగా చిరునవ్వు నవ్వుతూ నిలబడతాడు.)

డా. బోట్కిన్:- (పరధ్యానంగా) నా అనంతరం మిగిలే దేమిటి? బోట్కిన్స మిక్స్చర్! అదీ గాకపోతే సాంక్రామిక కామెర్ల రోగాన్ని మొదట నిరూపించేను గాన దానిని 'బోట్కిన్స డిసీజ్' అని నాపేర పిలవచ్చు!... అంతే...కీర్తి కోసం అనుకుంటున్నారా, నా బాధంతా? అబ్బే! కాదు! మనం వైద్యులం. ఔనా? కాని మనం చూసేదీ, కుదిర్చేదీ దేన్ని? కేవలం బాహ్య లక్షణాల్ని! కార్యాన్ని మాత్రమే! దానికి మూలమైన కారణం మాటేమిటి? విజ్ఞాన వేత్తలంతా దీని మూలానికి పోవడానికి శాయశక్తులా యత్నిస్తూనే వున్నారు. కాని యింత వరకు మానవ శరీరాన్ని గూర్చి

తెలిసింది బహుస్వల్పం!......(సంతోషంగా) ఇప్పుడు మీ పరిశోధనల్నే తీసుకుందాం. ఇంతవర కెవ్వరూ వున్నాయనేనా అనుమానించని రెండు నాడుల్ని హృదయ భాగంలో కనిపెట్టేరు! వాటి మూలంగా వైద్యుల శరీర విజ్ఞానానికి యెంత ప్రయోజనమో చెప్పలేము!...(ఉత్సాహంగా) ఔనౌను! డాక్టర్ పౌలోవ్! మీరు సరియైన దారిలో పడ్డారు ఆ మార్గాన్ని వదలకండి. నాడీ మండల ప్రయోగాలద్వారా మీరు శరీర విజ్ఞానానికి కొత్త మెరుగులు పెట్టగలరని నా నమ్మకం...(సాలోచనగా) కాని, మిత్రమా! మీరు నా లేబొరేటరీని వదలి పోవాల్సిన సమయం అనుకుంటూ......

డాక్టర్ పౌలోవ్:- (గడియారం చూసుకుంటూ) లేదు లెండి, దానికేం. కాస్త ఆలస్యమైనా ఫర్వాలేదు.

డా. బోట్కిన్:- (చిరునవ్వుతో) నా అభిప్రాయం మదిగాదు. ఈ క్లినికల్ లేబొరేటరీ మీ ప్రయోగాలకూ, ప్రతిభకూ చాలింది గాదు. కొత్త డాక్టర్లని తరిఫీదు చేస్తూండడమేనా మీకు తగ్గ పని? మీరిక్కడుండడం నా కిష్టంలే దనుకోకండి, డాక్టర్!...ఇక్కడ మీ అవసర మెంతో వుంది. అదీగాక నాకు మీరుండటం చాల సంతోష దాయకం కూడాను...... కాని, గొప్ప ప్రతిభను, విజ్ఞానానికి నూతన శోభను కూర్చగల మీ పరిశీలనా శక్తిని యీ

హాస్పిటలు గోడల మధ్య బంధించి వుంచడానికి నాకు సాహసం కలగటం లేదు...

డా. పావ్లోవ్:- డాక్టర్ బోట్కిన్! మీరు నాకు గురు తుల్యులు. మార్గ దర్శకులు. మీ క్లినిక్‌లో నేనెంతో నేర్చుకున్నా. మీతో గడిపిన ప్రతి నిముషమూ అమూల్య మైనదని భావిస్తున్నానంటే నమ్మరూ?

డా. బోట్కిన్:- మంచిదే. కాని, పోవాల్సిన తరుణం వచ్చిం దని మీ రనుకున్న తక్షణమే.....నాతో చెప్పాలి. మిమ్మల్ని వదలిపెట్టడం నాకు బాధాకరమే అయినా తప్పదు, మరి. నేనే మీకు వీడ్కోలు యిచ్చి పంపు తాను......ఈ చేత్తోనే, యిల్లాగే టోపీ వూపుతూ, శుభాశీస్సులతో మిమ్మల్ని పంపేస్తా. (గోడ గడియారం పన్నెండు కొడుతుంది.) అయ్యో! నా యిల్లు బంగారం గానూ! ఇదేమిటి? అప్పుడే ఉగాది వచ్చేసిందే...వొత్తి బాతాఖానీ పెట్టుకూర్చున్నా.....పండుగ వచ్చేసింది. ఏ దేనా ఆసవం వుందా?

(మంచులో తడుస్తూ వచ్చిన పావ్లోవ్ మిత్రులంతా లేబొరేటరీ బైటికివచ్చి, కిటికీ అద్దాలకి ముఖాలానించి లోనికి చూస్తారు. జైనియా వుత్సాహావేశాలతో బైట నుంచే పెద్దగా అరుస్తుంది.)

జైనియా:- లేబొరేటరీ అంటే పీడకలలా వుంటుందనుకున్నాం!

చూడండి, వాళ్లూ ఆనందంగా ఆసవం పుచ్చుకుంటు న్నారు! నాకిది నచ్చింది!

బోట్కిన్:- (ఆసవ పాత్రను పైకెత్తుతూ) డాక్టరు పౌలోవ్! ఇదిగో! నీ కోరకు! నీ పురోభివృద్ధి నాకాంక్షిస్తూ! నువ్వు చాల దూరం పోగలవు. కాని ఎల్లప్పుడూ గుర్తుంచుకో! విజ్ఞాన శిఖరాల నధిరోహించాలని నిన్నాశీర్వదించే వాళ్ళు చాలమంది వుంటారు. వారిలో ప్రప్రథముణ్ణి నేను!

డా. పౌలోవ్:- కృతజ్ఞుణ్ణి!

(అనుమతి లేకండానే లేబొరేటరీలోకి జొరబడ నున్న విద్యార్థి బృందాన్ని నిరోధించ బ్రయత్నిస్తూన్న నికోడిమ్. మాటలు వినవస్తాయి, ముందరి ప్రాంగణం లోంచి: "ఇ దే మి టం డీ, బాబూ! అమ్మా! మీరూనా? చెపుతున్నా..." కాని, అతని మాటలు లెక్క-జేయకండానే వారందరూ గుంపుగా లేబొరేటరీ లోకి జొరబడతారు. ఒక్క-క్షణకాలం అంతా నిశ్శబ్దం.)

అందరూ:- (ఒక్క- మాటే హఠాత్తుగా) ఉగాది సుఖదాయక మగుగాక!

(బోనుల్లోని కుక్క-లు భౌంయ్ మని అరుస్తుం టాయి.)

డిమిత్రీ పౌలోవ్:- ప్రొఫెసర్ బోట్కిన్! అనుమతి లేకండా వచ్చినందుకు మమ్మల్ని క్షమించాలి!

డా. బోట్కిన్:- దానిదేముందిలెండి! ఏం ఫర్వాలేదు... యౌవనం తన వుత్సాహాన్ని చూపే తీరుతుంది...మీ కందరకూ నా శుభాకాంక్షలు! (లేస్తాడు)

డా. పావ్లోవ్:- డాక్టర్ బోట్కిన్! వెళ్ళిపోతున్నారా?

డా. బోట్కిన్:- వందనాలు! రాత్రి ఒక్కసారి హాస్పిటల్ చుట్టూ తిరిగి రావాలి. అది నా అలవాటు, తెలుసుగా? ...అందులోనూ యీ వేళ, ఉగాది పండుగ...రోగులకి నన్ను చూస్తే...సెలవు!

(హాస్పిటల్ వైపు వెళ్ళిపోతాడు. నిశ్శబ్దం ఆ భవనాన్ని మింగేసింది. మంచు కురుస్తూంది.)

---

## ఏడో రంగం

(తెల తెల వారుతూంది. వసంతోద్యానంలో డాక్టర్ పావ్లోవ్ సెరాఫిమాలు నడుస్తూంటారు. బాటంతా మంచుతో నిండివుంది. చుట్టూ చెట్లమీద తెల్లగా మంచు జాలరుల్లా వ్రేలాడుతూంది. అలవాటు ప్రకారం డా. పావ్లోవ్ పెద్ద అంగలతో గబగబా నడుస్తూంటాడు. సెరాఫిమా అతి కష్టంమీద అతనితో పరుగెత్తుతూన్నట్లు నడుస్తూంది.)

సెరాఫిమా:- నూతన వత్సరపు ఉగాదిరోజు ఎంత సంతోషంగా వుంది!

డా. పావ్లోవ్:- తలుచుకుంటే విచిత్రంగా వుండదూ? సీమా! నూతనవత్సరంలో నిత్య నూతన సౌఖ్యాలు కలగాలని ప్రతి

సారీ కోరుకుంటూంటాము! సౌఖ్యాలకు పాత కొత్త లేమిటో? సీమా! అసలు సుఖం అంటే యేమిటని నీ అభిప్రాయం? (హఠాత్తుగా ఆగుతాడు, సెరాఫిమా మొగం చూస్తూ.)

సెరాఫిమా:- (అస్పష్టమైన చిరునవ్వుతో) ఇల్లాంటి ప్రశ్నకి ఆలోచించకండా జవాబు చెప్పడం కష్టంగాదూ, ఇవాన్ పిత్రోవిచ్!

డా. పాలోవ్:- నా అభిప్రాయ ప్రకారం సుఖమంటే దేనినైనా తెలుసుకోవడం, చేయుగలగడమూ నని. జ్ఞానమూ, కర్మ * వీటిల్లోనే సుఖ మనేది వుంది! (నడక వేగాన్ని హెచ్చిస్తాడు, పరుగెడుతూన్న తన వ్యూహాల నందుకునేందుకా అన్నట్లు.)

సెరాఫిమా:- మీా రెప్పుడూ విచిత్రంగానే మాట్లాడుతారు. ఐనా యిప్పుడీ చర్చ దేనికి! (అతనితో సమంగా పరుగెత్తుతూండడంవల్ల రొప్పుతూంటుంది.)

డా. పాలోవ్:- సీమా! నా భావనా ప్రపంచాన్ని కల్లోల పరుస్తూన్న ఆలోచనల్ని నీకు తెలుపవద్దంటావా? ఒక్కొక్కప్పుడు నేను మహాశక్తివంతుణ్ణైనట్లూ, మరొక్కొక్కప్పుడు అవ్యక్త స్థితిలోవున్నట్లూ వుంటుంది!......హద్దుల్లో

---

* శ్లో. కర్మాత్మ విజ్ఞాన మవిక్రమేణ। సంపాద్య మేకేన నరేణవేద।
యః కర్మణా చిత్తవిశుద్ధిమాప్య। స విద్యయాప్నోత్యమృతంహి విద్వాన్॥

ఆలోచించేటట్లు నా మనస్సును తరిఫీదు చెయ్యాలి! వ్యాయామం ద్వారా కండరాల్ని స్వాధీనం చేసుకున్నట్లు మనస్సును కూడ వశవర్తినిగా చేసుకోవాలి. సీమా! నువ్వు వ్యాయామానికి వెడుతూన్నావా?

సెరాఫిమా:- ఆఁ! అప్పుడప్పుడు.

( వారు పోయే దారిప్రక్క చెట్లక్రింద ప్రాతఃకాలం కాంతిలో ఒక యువమిధునం ముద్దు పెట్టుకుంటూ కనబడతారు. గబగబ పరుగెడుతూన్నట్లు పోతూన్న డా. పావ్లోవ్- సెరాఫిమాలను చూసి, ఆ యువకుడు ఆశ్చర్యంతో అంటాడు. )

యువకుడు:- (పరిహాసంగా) కొంప లంటుకున్నట్లు ఆ పరుగు లేమిటయ్యా? ఆడపిల్లని తీసుకుని షికారుపోయే తీరు యిదేనా! భేష్!

( కొంతదూరం పోయేక డా. పావ్లోవ్‌కు యీ మాటలు అర్థం అవుతాయిలావుంది, చటాలున ఆగి, చిరునవ్వుతాడు. )

డా. పావ్లోవ్:- (నొచ్చుకుంటూన్నట్లు) క్షమించు, సీమా! పరధ్యాన్నంలో పడాను. వేగంగా నడవడం నా కలవాటు. అల్లా అయితే ఆలోచించడానికి నాకు సులువుగా వుంటుంది. నీకు చాలా శ్రమ యిచ్చివుంటా. నిజంగా నేనెంతో విచారిస్తున్నా... కాని, నువ్వు యింత సేపటినుంచీ నాతో సమంగానే వచ్చేవే! ఏదీ, నీ చేయి యిట్లా యియ్యి!

సెరాఫిమా:- అబ్బే! అదేమిటీ? ఏం ఫర్వాలేదు.

(డా. పాలోవ్ తన పెద్ద చేతి నామె కందిస్తాడు. మొదట కొంచెం తటపటాయిస్తూ అనిశ్చితంగా అతని వైపుచూసి చివర కాతని యిష్టానుసారంగానే చేతి నందిస్తుంది. అనుకోకండానే డా. పాలోవ్ వైద్యవృత్తి సహజమైన హస్తవిన్యాసంతో సెరాఫిమా చేయి పట్టుకుని, బొటన వ్రేలితో మణికట్టు దగ్గర స్పృశించి నాడీ పరిశీలన చేస్తాడు. ప్రాతఃకాలపు పిల్లగాలికి ఆమె ముంగురులు రేగి నుదుట నాట్యమాడుతున్నాయి)

డా. పాలోవ్:- (ఆనందంతో) సీమా! నీ గుండె మంచి దార్ఢ్యం గలది సుమా! దెబ్బలేం తప్పడం లేదు, యింత వేగంగా నడుస్తున్నా! సింధునాడి.

(సీమా ముఖంలో బాధ కనిపిస్తుంది, యీ అప్రస్తుత ప్రశంసకు.)

డా. పాలోవ్:- (హఠాత్తుగా) తెలియదూ నీకు, సీమా? బలహీనమైన హృదయంగల స్త్రీని నేను ప్రేమించలేను!

సెరాఫిమా:- (సంతోషాశ్చర్య సంభ్రమాల కలయిక లాంటి సాత్విక స్థాయీ భావంతో ముఖం దీపిస్తుంది. అంతలోనే అది హృదయ పూర్వకమైన నవ్వుగా మారుతుంది.) ఇవాన్ పెత్రోవిచ్! నా ప్రియతమా!... రెండర్థాలు వచ్చేట్లు మాట్లాడుతున్నారేమిటి, యివాళ?

డా. పావ్‌లోవ్:- (లజ్జితుడై) నా అభిప్రాయం... బహుశా... కాని, అవ్వే, నా ఉద్దేశ్యం అది కాదు...... మనం యీ దారిని పోవాలనుకుంటానేం ?

సెరాఫిమా:- అఁహాఁ! అదీ మనం పోవాల్సిన దారి.

(ఇద్దరూ ఆ బాట వెంబడే నడుస్తూంటారు. డా. పావ్‌లోవ్ యిప్పుడు విసితుడూ, విభ్రాంతుడూ ఐనట్లు కనిపిస్తుంది. తన అసందర్భ వాగ్ధోరణికి కించ పడుతూ ఉదాసీనుడై వున్నాడాతడు. వికసిత వదనంతో ఆతని వైపు క్రేగంటి చూపులు విసురుతూ సెరాఫిమా తనచేతి నాతని చేతబెట్టి నడుస్తూంటుంది.

మనం యితఃపూర్వం చూసిన యువ మిథునం ఆనందదీప్తములైన ముఖాలతో యీ మిథునాని కెదురు వస్తారు. ఉద్యానంలోని చెట్లు ప్రాతఃకాలపు పిల్లగాలులకు కదులుతూ తల లాడిస్తుంటాయి.)

---

౮|

# రెండో అంకం

## ఒకటో రంగం

(1902 శిశిర ఋతువు. పీటర్సుబర్గులో డాక్టర్ ఇవాన్ పౌలోవ్ గృహం. బైట గాలీ, వానా; వాన నీరు బొట్లు బొట్లుగా కిటికీ అద్దాల మీదనుంచి జారుతూంది. సాయంత్రం బాగా చీకటి పడింది. ఎత్తైన సెమ్మా మీద పురాతన కాచగోళంలోని దీపం గది నంతనూ ప్రకాశ వంతంగా చేస్తూంది. టేబిలు మీద భోజనపు సామగ్రి సిద్ధంగా వుంటుంది.

సెరాఫిమా యేదో ఆలోచనలో మునిగి వుంటుంది. శాలువా కప్పుకునివున్నా ఆమె వణుకుతూనే వుంది, చలికి. ఆమె వయోధికగా కానవస్తూంది. ఉన్నట్లుండి ఆమె లేచి చిన్న టేబిల్ దగ్గరికి పోయి, దాని మీది ఫొటో ఆల్బం తెరచి చూస్తూ చిరునవ్వుతూంటుంది.)

సెరాఫిమా:- (స్వగతం) మెడికల్ కాలేజీలో చదివే టప్పుడు నా వాన్యా! (పుటలు తిరగేస్తూ) బోట్కిన్ లేబొరేట రీలో పనిచేస్తూన్నప్పటి ఫొటో. (మరోపుట చూస్తూ) వివాహానంతరం నేనూ, వాన్యా జర్మనీలో గడిపిన దినా ల్లోది. (పైకి) ఆ దినాలిక తిరిగి రావు గదా!

(ప్రక్క గదిలోంచి 'అమ్మా!' అని పిలుపు.)

సెరాఫిమా:- నాయనా! వొలోడ్యా! ఇంకా నిద్రలో లేదూ?

వొలోడ్యా:- (ప్రక్క గదిలోంచే) నాన్నగారు వచ్చేదాకా నేనూ మేలుకొని వుండద్దూ, అమ్మా!

సెరాఫిమా:- వద్దు, నాన్నా! పెందరాళే నిద్ర పోవాలమ్మా, చిన్న పిల్లలు, వొలోద్యా!

వొలోద్యా:- నాన్న యెందుకు రాలేదే, అమ్మా!

సెరాఫిమా:- నాన్నారు యిన్‌స్టిట్యూట్‌లో వున్నారమ్మా.

వొలోద్యా:- కుక్కలతోటే గదూ? నాకూ భయంలేదే అమ్మా! కుక్కలంటే.

(బైట గంట మ్రోగుతుంది. సంతోషంగా సెరాఫిమా తలుపు తీయబోతుంది. ప్రక్క గదిలోంచి వొలోద్యా రాత్రి గౌనులో పరుగెత్తుకొని వస్తాడు. తలుపు తెరవగానే ఒక పడుచువాడు లోనికి వస్తాడు. ముందుకు పొడుచుకు వచ్చిన నుదురు, నాజూకైన నోరు. టోపీ, కోటు నిండా వానబొట్లు. సెరాఫిమాను చూచి టోపీతీసి, అభివాదనం చేస్తాడు. ఇతడు డాక్టర్ పావ్లోవ్ అసిస్టెంటుగా పనిచేస్తున్న డాక్టర్ గ్లెబ్ మైఖలోవిష్ జ్నామేన్స్కీ.)

సెరాఫిమా:- (ఆశ్చర్యంతో) డాక్టర్ జ్నామేన్స్కీ! ఇదేమిటి, యిప్పుడొచ్చేరు? ఏం విశేషం లేదుగదా?

డా. జ్నామేన్స్కీ:- అబ్బే! ఏమీ లేదు. డా. పావ్లోవ్ తాను అక్కడుండి పోవాల్సి వచ్చిందని చెప్పమన్నారు. ఇప్పటి దాకా ఆపరేటు చేస్తూనే వున్నాం. కాని, యిప్పటివరకూ ఫలం కలగలేదు.

సెరాఫిమా:- ఐతే అది సాధ్యం అవుతుందంటారా? చెప్పండి,

డాక్టర్ జ్వాన్ ఓస్నెవ్! నా దగ్గరేమీ దాచకండి.

డా. జ్వాన్ ఓస్నెవ్:- (నిస్సహాయమైన చిరునవ్వుతో) నాకు ఆయన శక్తియందు పరిపూర్ణమైన విశ్వాసం వుంది. ఇతరు లేమనుకున్నా మనం పాటించనక్కర్లేదు. (టోపీ నెత్తిమీద పెట్టుకుంటాడు.)

సెరాఫిమా:- అప్పుడే వెళ్ళాలా? ఇంకా వర్షం పడుతూనే వుందే!

డా. జ్వాన్ ఓస్నెవ్:- ఫర్వా లేదులెండి. నేను పోక పోతే ఇవాన్ పిత్రోవిచ్‌కి కోపం వస్తుంది. ఆపరేషన్లలో నేనూ వుండాల్లెండి. సెలవు!

(బైటికి వెడతాడు. సెరాఫిమా చలికి వణుకుతూనే తలుపువేసి గదిలోకి వస్తుంది. చిట పట చినుకులు కిటికీ అద్దాల మీద జడిగొడుతూంటాయి.)

సెరాఫిమా:- (తనలో) ప్రభూ! ఈ అన్వేషణలో ఆయనకి జయము కలిగించవూ? (జాలిగా పైకి) పాపం! ఎన్ని కుక్కలు యీ పరిశోధనలో హతమైపోతున్నాయో! దేవా! వాటి ఆత్మలకి శాంతిని ప్రసాదించు!

వాలోడ్యా:- అమ్మా! నాన్నారు యెందుకు రాలేదే?

సెరాఫిమా:- (వాలోడ్యాను పొదివి యెత్తుకుని ముద్దెట్టుకుంటూ) నా చిట్టితండ్రీ! పడుకుందుగాని పద. నాన్న వచ్చే సరికి చాలా ప్రొద్దు పోతుందమ్మా!

(ప్రక్క గదిలోకి పిల్లవాణ్ణి యెత్తుకునే తీసుకుపోతుంది.)

---

# రెండో రంగం

(పెద్దగేటు మీద 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్పెరిమెంటల్ మెడిసిన్' అని వుంటుంది. రాత్రి భాగం. గాలి, వాన, మంచుతో చీదరగా వుంది. ద్వారపాలకుడు తెరచి పట్టుకునివుంటే డాక్టర్ జ్వాన్‌ట్సేవ్ లోనికి పోతుంటాడు. దౌవారికుని కాబిన్‌లో షాలుతో స్టాకింగ్సు అల్లుతూ అతని భార్య కూర్చునివుంటుంది.)

భార్య:- ఎవరాయనగారు?

దౌవారికుడు:- డా. పౌలోవ్ అసిస్టెంటుల్లో ఒకరు.

భార్య:- ఆయన క్రింద యెందరున్నా రేమిటి?

దౌవారికుడు:- అబ్బో! చాలమంది వున్నారు.

భార్య:- అందరూ వెళ్ళిపోయినా యీయనగారు కుక్కల్ని కోస్తూ యిక్కడే వున్నాడే! ఎన్ని కుక్కల్ని కోస్తాడో లెఖ్ఖేలేదు! ఎంత సేపూ 'అది అందియ్యి!' 'ఇది అందియ్యి!' అంటూనే వుంటాడు, కోస్తూనే వుంటాడు.

దౌవారికుడు:- ఊరుకో. ఆయన సంగతి నీకేం తెలుసు. ఆయన చాలా గొప్పవాడు. ప్రపంచమంతా ఆయన పేరు మోగి పోతూంది, ఎరగవ్!

(ఇన్‌స్టిట్యూటులో ఆపరేషన్ గదిలో పౌలోవ్ ఆయన అసిస్టెంట్లు డా. జబేలిన్, డా. జ్వాన్‌ట్సేవ్‌లు టేబిల్ దగ్గర ఆపరేషన్ చేస్తుంటారు. టేబిలుమీది కుక్కను పౌలోవ్ కోస్తుంటే, అసిస్టెంట్లు సాయం చేస్తుంటారు.)

డా. పౌలోవ్:- స్కాల్పెల్! (జబేలిన్ అందిస్తాడు.)

డా. పౌలోవ్:- ఫోర్సెప్స్!

(డా. జబేలిన్ కదలడు. డా. పౌలోవ్ తలెత్తి చూస్తాడు.)

డా. పౌలోవ్:- ఏమిటి?

డా. జబేలిన్:- నాడి అందడం లేదు, డాక్టర్ !

డా. జ్వాన్ట్సేవ్:- (నుదుటిమీది చెమట తుడుచుకుంటూ) మనం నాలుగు గంటలనుంచి కోస్తూన్నాం. అబ్బా! (కిటికీ దగ్గిరికి పోయి, అలసటచే వణుకుతూన్న చేతులతో సిగరెట్ తీస్తాడు.)

డా. పౌలోవ్:- నాలుగేమిటి ? అవసరమైతే యిరవై నాలుగు గంటలూ చేస్తాం. ఇంకో కుక్కని సిద్ధం చేయండి !

డా. జ్వాన్ట్సేవ్:- ఉన్న జీవాలన్నీ వుపయోగించేసేం ! ఇంక ఒక్కటీ మిగలలేదు. ఈ యేటి డబ్బు పూరాగా ఖర్చుపెట్టేసేం కూడాను ! రీసెర్చి స్కీములపట్ల మంత్రివర్గం యెంత వుదారంగా వుంటూన్నదీ మీకూ తెలుసునుగా ?

డా. పౌలోవ్:- (కోపంగా గౌను పీక్కుంటూ, ముడిరాక తెంపి క్రింద విసిరేస్తూ) దిక్కుమాలింది ! ఛీ ! తగలేసిందిలే ! పీడ !

(నికోడిమ్ గదిలోకివచ్చి, ఒక్కసారి చూడ్డంతోనే పరిస్థితులు గ్రహించి శిరఃకంపంచేస్తాడు. ఆపరేషన్ టేబిల్ హేండిల్ పట్టుకుని దానిమీది మృత జంతువుతో సహా బైటికి త్రోసుకుపోతూంటాడు. గదిలోని నిష్ఠుర నిశ్శబ్దంలో టేబిలు చక్రాల కిరకిర మాత్రం వినవస్తూంటుంది.

డా. జ్వాన్ట్సేవ్, డా. జబేలిన్‌లు రెండు వాష్ బేసిన్‌ల ముందు నిల్చుని చేతులు ప్రక్షాళన చేసుకుంటూంటారు.)

డా. జబేలిన్:- (చెవియొగ్గి వింటూ) ఎంత నిశ్శబ్దం ! మునపటి రోజుల్లో చూడవచ్చే జనంకి హద్దూ పద్దూ వుండేదేగాదు !

డా. జ్యార్ శ్చేన్ :- మనం నవ్వుల పాలవుతూన్నాం మను కుంటా. అకాడమీలో మొహం చూపడానికే భయం వేస్తూంది. చూడగానే డాక్టర్లూ, సర్జనులూ మొహం మీదే నవ్వేస్తూన్నారు !

డా. పాలోవ్ :- (కోటు తొడుక్కుని టోపీ పెట్టుకుని ద్వారం దగ్గరకిపోయి నిలబడే) నవ్వుతూన్నారా ? నువ్వేం భయ పడకు, మన చేవచూపిస్తాం వాళ్ళకి ! (నిరసన సూచకంగా చిటికె వేస్తూన్నట్లు చేత్తో సంజ్ఞచేస్తూ) ఒక్క సంగతి మాత్రం తెలుసుకోండి. ఇక్కడ యెవరినీ నిర్బంధంగా వుంచను. ఇష్టం లేకపోతే యీ క్షణంలోనే మీరు వెళ్ళి పోవచ్చు! వెళ్ళండి ! చూస్తా రెందుకు !

(బిగ్గరగా కేకలేస్తూ అసిస్టెంట్ల మీదికి భీషికగా వెడతాడు.)

---

## మూడో రంగం.

(పాలోవ్ గృహంలో భోజనాలగది. టేబిల్ దగ్గర పాలోవ్, సెరాఫిమా, స్కూలుదుస్తుల్లో వొలోద్యా, మెడలో మఫ్లర్ చుట్టుకున్న వీరా కూర్చుంటారు. ఆరేళ్ళ ప్రాయంగల వీరా స్పూన్, పోర్కుపట్టుకుని, దేన్నో తిండానికి నానా అవస్థలూ పడుతూంది.)

డా. పాలోవ్ :- బిడ్డకి తినిపించడం కూడా నీకు కష్టంగావుందా?

సెరాఫిమా :- పిల్లలకు స్వతంత్రంగా వుండడం నేర్పాలని మీరేగా చెపుతుంటారు ?

(డా. పాలోవ్ మాటాడడు. సెరాఫిమా లేచివెళ్ళి మాంసంకూర తెచ్చి భర్త ముందు ప్లేటులో వడ్డిస్తుంది. పాలోవ్ దాన్ని కోస్తూ కోస్తూ హఠాత్తుగా ప్లేటు దూరంగా నెట్టేస్తాడు.)

సెరాఫిమా:- మీ రేం తిన్నట్టూ?

డా. పాలోవ్:- మాంసం తినలేను! నా కింకేం వద్దు.

వాలోడ్యా:- (ప్లేటు మీద వంగుతూ) మీకు లేబొరేటరీలో ఆ కుక్కలతో యేదో గజి బిజి వచ్చినట్లుంది. అందులో మా తప్పేం లేదనుకుంటా!

(ఈ యెత్తి పొడుపు మాటలు విని పాలోవ్ గిరుక్కున తిరుగుతాడు. కోపంతో భగ్గున మండే సూచనలన్నీ వుంటాయి. కాని వాలోడ్యా అమాయిక ముఖంచూచి చల్లబడి ఫక్కున నవ్వేస్తాడు.)

డా. పాలోవ్:- వాలోడ్యా! నువ్వన్నది నిజంరా! నాకు చిక్కులు కలిగినమాట నిజమే, నాయనా! (లేచి, కొడుకు దగ్గిరికి వచ్చి, కౌగలించుకుని, చుబుకం పుణుకుతూ) సంర క్షకుడు బైలు దేరేడోయ్! తండ్రి! ఏం, నాన్నా? (కుమారుని ప్రేమతో తల నిమిరి, తిరిగి తన చోటికి పోయి కూర్చుంటాడు.)

వాలోడ్యా:- ఐతే భోంచెయ్యండి, నాన్నా!

డా. పాలోవ్:- ఓ! తింటా. సీమా! తెలిసిందా? నేను మాంసం తింటూన్నా.

సెరాఫిమా:- ఇప్పుడేగా చెప్పేరు, తిన నని!

డా. పాలోవ్:- (భార్య చేతిని బుజ్జగింపుగా ముద్దెట్టుకుంటూ) మనిషి క్రింద బడ్డప్పుడు బెడ్డ విసరకూడదు, సీమా! తెలి

సిందా ? ఇంతకూ అసలు సంగతి మీకు చెప్పనే లేదు. జీర్ణకోశం యీ మాంసాన్ని యెల్లా జీర్ణం గావిస్తుందో యింతవర కెవరూ యెరుగరు ! ప్రస్తుతం నేను గావిస్తూన్న పరిశోధనలూ, ఆపరేషన్లూ మనల్ని జీర్ణ క్రియా రహస్యానికి సరా సరిగా గొంపోయి విడుస్తాయి ! ఒక్క నరాన్నైనా నష్ట పరచకండా జీర్ణకోశా న్నంతనూ వేరు చేయాలి...

సెరాఫిమా:- వాన్యా ! క్షమించండి. అసాధ్యమైన దాన్ని తల పెడితే యెల్లాగ ? యూరోపులోనే యీ పని నింత వరకూ యెవరూ చేయలేక పోయేరు ! చివరకి ప్రొఫెసర్ హీడెన్ హైన్ కూడా !

డా. పావ్లోవ్:- యూరోపు ! హీడెన్‌హైన్ ! శాస్త్ర విజ్ఞానానికి యిదే పరాకాష్ఠ అని యెందు కనుకోవాలి ? మన మేం చేతకాని వాళ్ళ మనుకోడం దేనికి ? మనమే యీ పని సాధించి తీరుతాం......జీవిత మంతకూ క్రియారంగం జీర్ణకోశమే గదూ ? (సాలోచనుడై) ఇంత కాలం మృత్యువు నా వెను వెంటనే వుంది. కుక్కలు జీవించడమే లేదు. ప్రాణాలు తీసేందుకు నాకు హక్కెవరిచ్చేరు ?......

సెరాఫిమా:- నిజంగా నేనూ అదే ఆలోచిస్తూన్నా. ప్రాణాలు తీయడం, జంతువులనైనా కోసెయ్యడం......

డా. పావ్లోవ్:- నే నది ఆలోచించడం లేదనుకున్నావు !...

కాని, యీ పనిని నేను వుబుసుక్కోకకై చేయడం లేదు. ఐనా యింత వరకూ నా కృషి సఫలంగానే లేదు. అంతా వృథా. జంతువులు చచ్చిపోయినాయే గాని దానివల్ల సాధించిం దేమీ లేదు. (బిగ్గరగా) వృథాగా ప్రాణహరణం చేసే వనే నింద నామీద పడకండా నా శాయశక్తులా కని చేస్తా...కాని, ఇంక ఒక్క జంతువు కూడా మిగిలి లేదు. సాలుసరి అలవెన్సు పూర్తిగా ఖర్చై పోయింది. ప్రయోగాలు సాగాలంటే......అంతా అంధకారమే...సీమా! మరిచేపోయేను సుమా. ఇదిగో! జీతం వచ్చింది.

(కోటు జేబులోంచి కాగితం పొట్లం తెచ్చి భార్య కిచ్చి, గదిలో యిటువటు పచారుచేస్తూ, కిటికీవద్ద నిల్చుని బైటికి చూస్తుంటాడు.)

డా. పొలోవ్:- కలల్లో కూడ ఆపరేషన్ చేస్తున్నట్లే! అదే టేబులు, కుక్కలు! కానీ, నేను దీన్ని సాధించి తీరుతా!

సెరాఫిమా:- పొదుపుగా వాడి యీ నెల ఖర్చులు తగ్గించేను. ఇది లేకున్నా యిల్లు గడుస్తుంది. తీసుకుని అవసరమైన దానికి ఖర్చు చేయండి. (పొట్లామును తిరిగి భర్త జేబులో పెడుతుంది)

డా. పొలోవ్:- ఏమిటి? సీమా! నిజంగా?

సెరాఫిమా:- నిజం గాకపోతే యెందుకు చెపుతాను?

డా. పొలోవ్:- నా సీమా! ప్రియతమా! (భార్యను కౌగలించుకుని, వున్నట్లుండి బైటికి హడావుడిగా పరుగెడతాడు.)

సెరాఫిమా:- ఎక్కడికిప్పుడు ?

డా. పావ్లోవ్:- (బైట వరండాలోంచి) మంచి బేరం ఒకటి వచ్చి వుంది, సీమా ! పెద్ద మంద ! అద్భుతమైన కుక్కలు! ఇప్పుడే వస్తా.

సెరాఫిమా:- ఔను ! మీరే పనీ నిమ్మదిగా చేయలేరు ! మీకు యీ కృషిలో విజయం కలగాలనే నా యేకైక ప్రార్థన...

---

## నాల్గో రంగం

(డా. పావ్లోవ్ గృహంలో గది. సెరాఫిమా యేదో చొక్కా కుడుతూ సోఫాలో కూర్చుని వుండగా వంటకత్తె ఫెనిచ్కా ప్రవేశిస్తుంది. ఆమె కుష్కించి, మఠంలోని బ్రహ్మచారిణిలా వుంటుంది)

ఫెనిచ్కా:- అమ్మా ! బజారు వెచ్చానికి డబ్బు కావాలండి.

సెరాఫిమా:- (చేసంచిలో తడిమి, కొంచెం చిల్లర తీసిస్తూ) ఫెనిచ్కా ! ఈ వేళకి దీనితో సరిపెట్టు. రేపటి సంగతి చూద్దాం.

ఫెనిచ్కా:- (తీసుకుని అసంతుష్టిగా గొణుగుతూ) ఏం చేస్తాం, దీనితో ? ఏం తెచ్చేదో ?

(బైటికి పోతూ వసారాలో కూడ సాదిస్తూంటుంది.)

ఫెనిచ్కా:- ఇల్లాలు ! పేరుగొప్ప ఊరుదిబ్బ ! నిష్ఫచ్చరం !

(ఎక్కడినుంచో డిమిట్రీ పిత్రోవిష్ పావ్లోవ్- కెమిస్ట్రీ ప్రొఫెసరు, డాక్టరు అన్న వచ్చి, హాలులో కోటు విప్పుతూ, ఫెనిచ్కా సాదింపు మాటలు విని

'దౌర్భాగ్యపు ముండ !' అని తిట్టుకుంటాడు. లోపలి గదిలోకి వస్తూ సెరాఫిమా నగల పెట్టెలోంచి బ్రోచ్‌ని తీయడం చూస్తాడు. అడుగుల సవ్వడి విని సెరాఫిమా పెట్టె మూతపెట్టి, బ్రోచ్ గుప్పిట దాస్తుంది.)

డిమిట్రీ:- ఏమమ్మా ! ఏమిటది ? ఇల్లా చూపించు !

సెరాఫిమా:- అబ్బే ! ఏమీ లేదు. ఊరికే...

డిమిట్రీ:- (దగ్గరికి బోయి గుప్పిడి తెరచి బ్రోచ్‌ని మళ్ళీ నగల పెట్టెలో వుంచుతాడు.) ఏమమ్మా ! ఎందుకిది ? నీ కేమేనా మతి పోతూందా ? (జేబులోంచి డబ్బుతీసి టేబిలు మీద వుంచుతాడు.)

సెరాఫిమా:- (కుర్చీలో కూలబడుతుంది. కన్నీరు ధారావాహినిగా చెక్కిళ్ళమ్మట వచ్చేస్తూంటే) మీ డబ్బు వద్దు. క్షమించండి ! మీ ఋణం యిప్పటికే యెల్లా తీరుస్తామో అర్థం గావటం లేదు !

డిమిట్రీ:- అమ్మాయీ ! అర్థం లేకండా మాట్లాడకు. నే నేం పరాయివాణ్ణా ?

సెరాఫిమా:- ఆయనకి తెలియకండా నే నేమీ...

డిమిట్రీ:- అమ్మా ! నీకు ఓరిమి వుండాలి. వాన్యా సాధారణ వ్యక్తిగాడు. వాడు లోకవంద్యుడు గాబోతున్నాడని నా విశ్వాసం. సీమా ! చిల్లర విషయాలను గూర్చి నువ్వు ఆందోళన పడకు.

సెరాఫిమా:- నాకూ ఆయన శక్తియందు గాఢ నమ్మకంవుంది. ఐనా యింతా భరించడం చాల కష్టంగా వుంది. అన్నిటి కంటేనూ నాకు బాధ కలిగించేది, మేము మీ యింటజేరి

ఆక్రమించుకుని కూర్చోడం మీరు వివాహం చేసుకోక పోవడం యిందుకేనా? మీరూ ఓ ప్రొఫెసర్. తమ్ముని కోసమేనా యీ త్యాగం...

డిమిత్రీ:- అబ్బెబ్బె! సీమా! అల్లా అనుకోకమ్మా! నేను సాధారణ ప్రొఫెసర్‌ని. డబ్బు విషయాని కేంలే. కాని, మామూలు వాణ్ణే.

సెరాఫిమా:- మీ మాటల కేం లెండి. మీరు మాత్రం, డిమిత్రీ పిత్రోవిచ్! మిమ్మల్ని తక్కువ చేసుకోడం మంచిది గాదు!

డిమిత్రీ:- అమ్మా! సీమా! అసంతృప్తితో, కష్టంతో అంటూన్న మాటలు గావు, నావి. రసాయన శాస్త్రం ఒక మహా సముద్రం లాంటిది. నేను దానిలో ప్రొఫెసర్‌నే గాని స్వయం ప్రకాశశక్తి లేదు, నాకు. విజ్ఞాని మెండెలియేవ్ తెలుసుగా? రసాయన శాస్త్రాకాశంలో మెండెలియేవ్ ఒక సూర్యుడు. ఆయన చుట్టూ వుండే గ్రహాల్లో ఒకణ్ణి మాత్రమే నేను! కాని, మన ఇవాన్ వున్నాడే, వాడూ ఒక సూర్యుడు అవుతాడు. నువ్వు అతనితో కడకంటా ప్రయాణిస్తావు! నీ జీవితం ధన్యమైపోవది, సీమా!

(అంటూ సీమా చేతిని ముద్దెట్టుకుంటాడు.)

సెరాఫిమా:- కృతజ్ఞురాల్ని. మీ వంటి అన్నలు అందరికీ వుండరు. ఎప్పుడు కష్టసమయమో సరిగా అప్పుడే మీరు వచ్చి ఆదుకుంటారు. ఆయనకు సహధర్మచారిణిగా వుండే అర్హతను ప్రసాదించమని యెప్పుడూ ప్రార్థిస్తుంటాను.

## అయిదో రంగం

(ఇన్‌స్టిట్యూట్‌లో హాలు. ప్రాచీనమైన గోడ గడియారం గంటలు గుల్లగా శ్రావ్య సంగీతంలా వినబడతాయి. సెరాఫిమా కోటూ, హాటూలో ఓరగానున్న సోఫాలో కూర్చుని, అభిముఖంగా నున్న ఆపరేషన్ గది తలుపులవైపు చూస్తూంటుంది. మూసివున్న తలుపుల మబ్బుటద్దాల్లోంచి లోపల మనుష్యులు లీలా మాత్రంగా కనబడతారు. ఆమె సమీపంలోనే బెంచిమీద నికోడిమ్ కూర్చుని, ముందున్న 'గొరోడ్కి' ఆట కాయలు సర్దుతూన్నాడు. ఈ ఆటంటే పాలోవ్ చెవి కోసుకుంటాడు. నికోడిమ్ చిన్న చాకుతో గాబిడీలు చెక్కుతూ, మధ్య మధ్య వ్రేలితో కొలుస్తూంటాడు.)

సెరాఫిమా:- నికోడిమ్ వాసిలియేవిష్ ! ఇంకా ఎంత ఆలస్యం అవుతుంది ?

నికోడిమ్:- అమ్మగారూ ! అప్పుడే నాలుగ్గంటల నుంచి ఆపరేటు చేస్తున్నారు. ఇప్పటికే గంటల లెక్క మరిచిపోయి వుంటారు ! ఇల్లా చేయడం యిదే మొదటిసారి గాదుగా!...

సెరాఫిమా:- (ముఖంలో ఆందోళన కనిపిస్తూంటే) అబ్బబ్బా ! ఎంత సేపని కనిపెట్టుకోను ?

నికోడిమ్:- ఏం తోచకపోతే ఉబుసుపోకకి యేదైనా చదువుకోండమ్మా !

(గడియారం మీదినుంచి పెంటచేటలాటి పుస్తకాన్నొకదాన్ని తీసి ఆమె కందిస్తాడు)

సెరాఫిమా:- (చదువుతుంది) 'భిక్షుకరాణి' లేక 'న్యాయమే జయము.' (పుటలు తిరగేస్తూంటే ఆమె ముఖం మీాద చిరునవ్వు గానవస్తుంటుంది.)

(టిక్ టాక్ మంటూ గడియారపు కంచు పెండ్యులం ఊగుతూ గంటలు మళ్ళీ కొడుతుంది. విస్ఫారిత నేత్రాలు, బిగించిన పిడికిళ్ళు లోని ఆందోళను వ్యక్తీకరిస్తూంటే సెరాఫిమా నిశ్చలంగా కూర్చుని వుంటుంది. చిట్టచివరకి ఆప రేషన్ గది తలుపులు తెరుచుకుని మెల్లగా బైటికి వస్తాడు, పాలోవ్. ఆయన ముఖంలో అలసటా, శ్రమా గోచరిస్తుంటాయి. ద్వారబంధా న్నానుకుని ఆగు తాడు. ఆయన కళ్లు తెరిచి వున్నా అవి యెక్కడో చూస్తుంటాయి. సెరా ఫిమా భర్తను చూచి గమ్మున లేచి నిల్చుంటుంది. ఏం జరిగింది? పాలోవ్ జయం గాంచేడా? ఆమెకు యిదమిత్థమని తెలియక పోడంవల్ల ఆందోళన పడుతూన్న ట్లుంటుంది. నికోడిమ్ దిగాలుపడిన ముఖంతో, మౌనంగానే ఆప రేషన్ గదిలోకి పోతాడు)

పాలోవ్:- (ప్రకృతానికి వచ్చి చిరునవ్వుతో) చూసేవా, అది అసాధ్యమంటారు! (పిడికిలి బిగించి గాలిలో విసురుతూ, పెద్దగా అరుస్తాడు. భార్య తన యెదుటే నిలబడి వుందని అప్పటికి గ్రహించుతాడు.) నువ్వే, సీమా? సాధ్యమే గాదంటారు, వాళ్లు! చూసేవా?

సెరాఫిమా:- సాధించగలేరా? (సంతోషంతో) వాన్యా! మీ శక్తిసామర్థ్యాలకి సాధ్యం కాని దేదీ వుండదు!

(పాలోవ్, భార్య నడుంచుట్టూ చేతిని బిగించి, రెండో చేత ఆమె చేతిని పట్టుకుని, నాట్య భంగిమంలో వసారాలోకి తీసుకు పోతాడు.)

సెరాఫిమా:- (ప్రేమతో) మీ దగ్గర చెప్పడానికి జంకేనుగాని, వాన్యా! నేను చనిపోయిన కుక్కల కోసం ప్రార్థన చేస్తుం డేదాన్ని!

పాలోవ్:- (చకునిస్తూ) ఓహో! ఇందులో కూడా మనకి దేవుని తోడ్పాటు వుందన్న మాట!

(కోసిన కుక్కతోవున్న ఆపరేషన్ టేబిల్‌ను త్రోసుకు వస్తూన్న నికోడిమ్ గది గుమ్మంలో కనిపిస్తాడు. ఆలిసినట్లున్నా వుత్సాహంతోవున్న జ్వాన్ ట్సేవ్. జదేలిజాయ ఆ వెనకే వుంటారు.)

పౌలోవ్:- నికోడిమ్! దాన్ని భద్రంగా చూడాలిసుమా! మళ్ళీ కొద్ది రోజుల్లో అది మామూలుగా పరుగెత్తడం, చెలగాటా లాడ్డం చూడాలి!

నికోడిమ్:- నాకీ పని కొత్తా, ఏమైనా? తాతకి దగ్గులు నేర్పుతారు!

పౌలోవ్:- (జ్వాన్ ట్సేవ్‌తో) ఈ పని సాధించలే మన్నారు గదూ?... భేషుగ్గా వుంది! అసాధ్యంట! పెద్ద మనుష్యులు!

(గొరోడ్కీలాడే పెట్టెనుచూసి పౌలోవ్ తటాలునపోయి, గాబిడీతీసి గురి చూసి విసురుతాడు.)

పౌలోవ్:- రండి! గొరోడ్కీలాడుదాం.

(బైట ఆవరణలోకి అందరూ వెడతారు. గాలికి పెద్ద గడ్డం అలలు అలలుగా వూగుతూంటే, అత్యుల్లాసంగా పౌలోవ్ గాబిడీలు విసురుతూంటాడు.)

పౌలోవ్:- ఆవిరి యంత్రం!

(జ్వాన్ ట్సేవ్ కొంచెం దూరంలో ఆవిరి యంత్రం బొమ్మను వేస్తాడు.)

పౌలోవ్:- సర్జన్‌లు మన మొహం మీదే నవ్వుతున్నారు? ఔనా! (గాబిడీ విసురుతాడు, యెకసెక్కెంతో. రైంయ్ మంటూ పోయి అది యంత్రం బొమ్మని తుడిచి పెట్టేస్తుంది.)

జ్వాన్ ట్సేవ్:- భేష్!

పౌలోవ్:- అనాటమిస్టులు నమ్మరు!...కానీ, ...ఒక నూయి!...

(జ్వాన్ త్సేవ్ నూయి బొమ్మని వేస్తాడు.)

పావ్లోవ్:- (ఎడంచేతి మీద వూదుకుంటూ) మన దెబ్బ చూస్తారుగా వాళ్ళు! (గాబిడీని విసిరేస్తాడు. బొమ్మ తుడిచి పెట్టుకుపోయింది. దాని విసురు తనకే తగులుతుందేమో నన్నట్లు జ్వాన్ త్సేవ్ ప్రక్కకి తప్పుకుంటాడు. వాతావరణం అంతా విజయోత్సాహంతో వెల్లి విరుస్తూన్నట్లుంటుంది.)

---

## ఆరో రంగం.

(1904 ప్రారంభం. రష్యా జపాన్ యుద్ధం ముమ్మరంగా వుంది. యుద్ధ రంగాన్నుంచి కొన్ని పటాలాలు తిరిగి వచ్చేయి. పెట్రోగ్రాడ్ వీధుల్లో పెద్ద పెద్ద ఆర్మీ కోట్లలో పటాలాలు మార్చి చేస్తున్నాయి. పేవ్‌మెంట్ల మీద గుంపులు గూడి జనులు మౌనంగా నిల్చుని చూస్తున్నారు. వాతావరణమంతా నిరుత్సాహ కరంగా వుంది.

నికోడిమ్ పటాలపు దుస్తుల్లో నెవ్‌స్కీ రాజవీధిలో నడుస్తూంటాడు, చేతిలో ఒక పాకేజి పట్టుకుని. మధ్యలో ఆగి, అటెన్‌షన్‌లో నిలిచి యెదురుపడ్డ ఆఫీసరుకి సైనిక వందనం చేస్తాడు. ఒక గుఱ్ఱపు బండీ, దొడ్డికాళ్ళ డాషండ్ కుక్కను తీసుకుని ఒక గౌరవ స్త్రీ, దారే పోతూంటారు. సెంటుజార్జి పతకధారి యైన మాజీ అశ్విక సైనికుడు చంక కఱ్ఱలపై కుంటు కుంటూ పోతాడు. కాల్బలం దాటి పోతుంది. నికోడిమ్ మళ్ళీ నడుస్తూన్నాడు.)

పత్రికలమ్మే కుఱ్ఱాళ్ళు:- (బిగ్గరగా) తాజా వార్తలు! మంచూరియాలో భీషణ యుద్ధం! తాజా యుద్ధ వార్తలు!

(ప్రజలు యెగబడి పేపర్లు కొంటారు. అందరి ముఖాల్లోనూ విషాదం, నిరుత్సాహం గానవస్తూంటుంది.

నికోడిమ్ ఇన్‌స్టిట్యూట్ దగ్గరికివచ్చి, లోనికి ప్రవేశిస్తాడు. అది మునపటి కంటె చాలా మారిపోయి వుంటుంది దజను పైగా కుక్కలు బోనుల్లో

వున్నాయి. హాలులో గోడలన్నీ ఛార్టులూ, డయాగ్రములతో నిండివున్నాయి. నికోడిమ్ పాకేజీని ద్వారందగ్గరే కుర్చీమీద భద్రంగా వుంచి, టోపీతీసి, నుదుటి చెమట తుడుచు కుంటాడు. లేబొరేటరీ అసిస్టెంట్లు యిద్దరు టేబిల్స్ దగ్గర కూర్చుని యెదుటి ఉత్తరాల ప్రోగుకు చూస్తుంటారు.)

ఒక అసిస్టెంటు:- ఏం వుత్తరాలు! కుప్ప తిప్పలు! యూరోపు, అమెరికాల్లో మూల మూలలనుంచి!

రెండో అసిస్టెంటు:- డాక్టరు పౌలోవ్ ధోరణి నాకేమీ అర్థం గాదు! ఒక్క ఉత్తరమేనా ఆయన చదవడు! ఎంతసేపూ ఒకటే ధోరణి! దృష్టంతా ఆ లాలాజలగ్రంధి మీదే!

మొదటి వాడు:- (స్వరం తగ్గించి మెల్లగా) నన్నడిగితే ఆయన కేదేనా దయ్యం పట్టుకుందేమో నంటా!

రెండో వాడు:- (దగ్గరగా పోయి) మితి మీరి పని చేయడం వల్ల మతి భ్రమణం కలిగిందేమో? ఆంద్రీ స్టెపానిచ్! ఆయన విశ్రాంతి తీసుకోడం అవసర మేమో:

(ఈ సంభాషణ వింటూన్న నికోడిమ్ ముఖం విషాదాక్రాంత మవుతుంది. కుర్చీ మీది పాకేజిని క్రిందికి ఒక మూలకి త్రోస్తాడు.)

మొదటి అసిస్టెంటు:- అదేమిటి? నికోడిమ్!

నికోడిమ్:- ఆఁ! ఏమీ లేదు. డాక్టరు పౌలోవ్ తీసుకు రమ్మన్నారు లెండి......(ఆ విషయాన్ని ప్రస్తావించడాని కయిష్టంగా వున్నట్లవుపిస్తాడు. నిశ్శబ్దం)

---

## ఏడో రంగం

( పాలోవ్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రైవేటు ఆఫీసులో టేబిలు దగ్గర వంగి, నోటు బుక్కులోకి చూస్తుంటాడు. పుటలు తిరగేస్తూ. అక్కడక్కడ నోట్సు రాస్తూ, ప్రశ్నాశ్చర్యార్థకాలు పెడుతూంటాడు.)

పాలోవ్:- (బిగ్గరగా) లాలాగ్రంథి: పరిశీలనా ఫలితాలు! (పుట తిరగేసి) పన్నెండో ప్రయోగం: నికోడిమ్ పదధ్వనులు. (మూడు ఆశ్చర్యార్థకాల్ని వుంచి, సాలోచనుడై గొణుగుతాడు.) అందని ద్రాక్షపండ్లకు అర్రులు జాచుతున్నానా? మోయలేని బరువు తల కెత్తుకుంటున్నానా? ...భరించలేక యెక్కడో వదిలేస్తానేమో?......పోనీ అంటే తగినన్ని ఆధారాలు లేవే?......కానీ! నీ పని నువ్వు చెయ్యి. ఫలితం కలుగక పోదు. ఆధారాలు దొరక్క పోవులే! (పిడికిలితో టేబిలు మీద గుద్దుతాడు. ఆయన ఆలోచనా ప్రవాహానికి అడ్డుకట్టవేసినట్లవుతుంది.)

జబేలిన్:- (ప్రవేశిస్తూనే డాక్టర్ పాలోవ్! ఎంత విచిత్ర విషయమో చూసేరా? కుక్కలు మాంసాన్ని చూసినప్పుడూ, తినేటప్పుడూ కూడ ఒకే రకం లాలాజలం వూరుతుంది. వాటి రసాయనిక వివరాలు (కెమికల్ ఎనాలిసిస్) యిదిగో!

పాలోవ్:- ఏమిటీ అంటున్నారు? ఐతే అంతా స్పష్టంగానే వుంది!......నే నాలోచించేది......

(సాలోచనుడై వుండి, హఠాత్తుగా జబేలిన్ దగ్గరికి వెళ్ళి ప్రశ్నిస్తాడు.)

పాలోవ్:- మీకు పుట్టకొక్కులంటే యిష్టమేనా? అంటే

మీరు వాటిని యెప్పుడేనా ప్రోగు చేసేరా ? చెప్పండి.

(జబేలిన్ యీ అసందర్భపు ప్రశ్న విని ఆశ్చర్యంతో నిరుత్తరుడై వుంటాడు. బహుశా పాలోవ్‌కి అధిక శ్రమవల్ల మతి చలించి వుంటుందే నని కూడా అనుకుంటాడు.

పాలోవ్:- (తానే సంభాషణను సాగిస్తూ) అడవిలో పోతూ పోతూం మనం ఒక్కొక్కపు డొక చెట్లతోపు దగ్గరకి వస్తాము. ఎందుకనో అక్కడ పుట్టకొక్కు లుండి తీరుతవని అనిపిస్తుంది. అనేకు లదివరకే ఆ దారిని పోయి వుంటారు. ఐనా మనం మతి లేనట్లుగా ఆతోపులో చెట్లక్రింద దూరి (పుట్టకొక్కుల కోసం.) తడుముళ్ళాడుతాము. అవి వుండి తీరుతాయని మనం ఘట్టిగా నమ్ముతాము. చివరకి మనం అనుకొన్నట్లే పుట్టకొక్కులు దొరుకుతాయి !

(హఠాత్తుగా జ్వాన్‌ట్సేవ్ వుద్రిక్తుడై ప్రవేశిస్తాడు.)

జ్వాన్‌ట్సేవ్:- (దూరాన్నుంచే) దాని తలా తోకా తెలియడం లేదు, డాక్టర్ పాలోవ్ ! ఆశ్చర్యకర విషయాలెన్నో జరుగుతున్నాయి. (మన లేబొరేటరీలో)... లేబొరేటరీలో వెలుతురు తక్కువగదూ ? అందుకని రోజూ సాయంత్రం కుక్కలికి మేత పెట్టేముందు లైట్లు వేస్తే చాలు, కుక్కలకి లాలాజలం పుష్కలంగా వచ్చేస్తుంది ! తిండీ యేమీ అక్కర లేకుండానే !

పాలోవ్:- (సంతోషోత్సాహాలతో) ఏం ? నే నేమని చెప్పేను? జ్ఞాపకం వుందా ?

(జబేలిన్. జ్వాన్ట్సేవ్ లిద్దరూ 'ఏమిటా చెప్పింది?' అన్న ట్లొకరి నొకరు ఆశ్చర్య దృష్టులతో చూసుకుంటారు.)

పావ్లోవ్:- పోనీండి. నేను మీతో చెప్పలే దేమో? కాని, నే ననుకుంటూనే వున్నాను!......అదే ఆలోచిస్తూ న్నాను......మనం యీ వ్యవహారా న్నంతనూ గజిబిజి చేసుకుంటున్నాం!......అసలు కిటుకులు పొరబాటున వదలి వేస్తున్నాం. ఎన్ని ఆధారాలు! చక్కని ఆధారాల్ని మనం పొరబాటున వదలి వేస్తున్నాం!......ఈ విష యాన్ని మనం యిదివరకే యెందుకు గమనించ లేదు? జీర్ణక్రియా సందర్భంలో లాలాగ్రంధిని గూర్చి మనం ప్రయోగాలు సాగించేం గదూ? చూడండి! ఆ ఫరిశో ధనలు మనల్ని యిప్పుడు యెక్కడికి గొంపోయేయో?... నికోడిమ్ తిరిగి వచ్చేడు?

జ్వాన్ట్సేవ్:- (కంగారుగా) ఆఁ! వచ్చేడు...

పావ్లోవ్:- సరే. మంచిది...(గబగబా లేబొరేటరీవైపు నడు స్తాడు. కుక్కల బోను దగ్గరికిబోయి అసిస్టెంట్లను చే సంజ్ఞతో పిలుస్తాడు. ఇద్దరూ వెడతారు.)

పావ్లోవ్:- ఈ ప్రయోగ సందర్భంలో నేను గమనించినవి కొన్ని విషయాలు చెపుతా......ఒక రోజున 'జాక్' (కుక్క) కి తిండిపెట్టి, గమనిస్తున్నా. సరే, మామూలే గదూ, సహజ మనో వ్యాపారం (రిఫ్లెక్స్) లాలాజలం వూరడం. తిండి చాలలేదు. ఇంకొంచెం తెమ్మని నికోడిమ్‌ని

పంపించేరు. అతను రావడం ఆలస్యమైంది. నాకు విసుగ్గా వుంది. కుక్కకీ విసుగెత్తి వుంటుంది. దాని నోట ఒక్క చుక్క లాలాజలం కూడా లేకండా పోయింది! కాదు మరి? ఎందు కుంటుంది?...వున్నట్లుండి హఠాత్తుగా పుష్కలంగా లాలాజలం ప్రవహిస్తూంది! దానిల్లు బంగారం గానూ, యిది యెక్కడినుండి వచ్చింది? ఎందుకు వచ్చింది?

(జ్యాన్ ట్ప్రవ్, జబేలిన్‌లు అర్థంగాక కళ్ళప్పగించి చూస్తూ వుంటారు.)

పావ్లోవ్:- (విజయ సూచకంగా చూస్తూ) నికోడిమ్ అడుగుల సవ్వడి వసారాలో వినవచ్చింది! అతడు ఆహారం తెస్తూ న్నాడని ద్యోతకమై కుక్క నోట లాలాజలం వూరింది! తెలిసిందా? ఇప్పుడు చూద్దురు గాని, వుండండి, నికోడిమ్! (కేకేస్తాడు.)

(మరునిముషంలో నికోడిమ్ వస్తూన్న సవ్వడి.)

పావ్లోవ్:- (వంగి కుక్క దౌడలోని లాలాగ్రంధి వైపు చూస్తూ) నికోడిమ్ పాదధ్వని సమీపిస్తూన్న కొద్దీ కుక్కకి లాలాజలం హెచ్చుగా స్రవిస్తూంది, చూడండి!

(జ్యాన్ ట్ప్రవ్, జబేలిన్‌లు వంగి పరిశీలిస్తూంటారు.)

పావ్లోవ్:- తేలిం దేమిటి? ఏతావతా పదధ్వనులే లాలా నిర్గమనానికి కారకములైనాయి! కొంచెం ఆహారమేనా అక్కర్లేకండానే! ఏం? ఎందువల్ల? (ఆవేశంతో పచారు చేస్తాడు.) ఇక్కడ ఏేం జరుగుతూంది? ఎందుకు జరుగుతూంది? సున్నం చూపి అన్న మనుకొని నోట నీరూరడం

వుంది గాని యిదేమిటి? పదధ్వనులు విని నోట నీరూరుంది! ఇందులో శ్రవణేంద్రియ ప్రసక్తి యేముంది? శ్రవణభేరికీ, లాలాగ్రంధికీ సంబంధ మేమిటి? కాని, మన పరిశీలనా ప్రయోగాల్లోని పరిస్థితులు యీ రెండు యింద్రియాలకీ సన్నిహిత సంబంధాన్ని కలిగించేయి! రోజూ కుక్కలకి తిండిబెట్టే నికోడిమ్ పాదధ్వనులు వాటి మెదడులో ముద్రితములై వున్నాయి. నికోడిమ్ పాదధ్వనులు, ఆహారం,-యీ రెండూ కుక్క మెదడులో సమవాయి సంబంధం కలిగి వున్నాయి. పరిచిత పాదధ్వని చెవికి సోకినంత మాత్రాన మెదటినుంచి యిచ్ఛాశక్తి బైలుదేరి లాలా జలాన్ని వూరింపజేసింది. కేవలం శబ్దం చాలు! అదీ అక్కరలేదు. దీపాలు వేస్తేచాలు? మీరు చూసినట్లు!

జ్వాన్ స్టేన్:- (గందరగోళంలో పడినట్లు) కాని,...జీర్ణక్రియకూ దీనికీ సంబంధం యేమిటో నా కర్థంకావటంలేదు.

పావ్లోవ్:- (ఉత్సాహంగా) అదే అసలు విషయం! అయ్యో! దీన్ని గురించే నండీ, నేనింత కాలాన్నుంచీ ఆలోచిస్తూన్నది!

జబేలిన్:- (ఆవేశంతో) అయ్యో దేవుడా! మన మతి మండి నట్లేవుంది! ఏమండీ! డాక్టర్ పావ్లోవ్! ఎందుకూ? మనం గనక...... నా వుద్దేశం...... ప్రయోగ పరిస్థితుల్ని మార్చిగల్గితే!......జ్వాన్ స్టేన్! మనం వివిధ సన్నివేశాల్ని కల్పించి, వాటిని తిండి తినడంతో జత చేయ

వచ్చు! మెదడుకి ప్రతి దఫా ఒక చిన్న సమస్యని కల్పించడం...దానికి జవాబును నిర్దేశించ మనడం!...

పాలోవ్:- (సమధికోత్సాహంతో) ఆఁ! అదీ సంగతి! చూసేరుగా, మీరు? ఇక్కడ లాలాజల నిర్గమనమే మనకు జవాబు యిస్తూంది. (పిడికిళ్ళు బిగించి గాలిలో ఝుళిపించుతూ) నూతన భౌతిక పరిసరాల్నీ, పరిస్థితుల్నీ యేర్పరచి మనమే నూతన మనోవ్యాపారాల్ని (రిఫ్లెక్సు) ప్రేరేపించుదాం!......భేష్! బాగుంది! కాని, యీ నూతన ప్రక్రియల (responses) ను యేమని పిలుద్దాం?...... కండిషన్డ్ రిఫ్లెక్సులు! అంటే పరిస్థితుల ప్రభావంవల్ల యేర్పడిన మనో వ్యాపారాలు! నిబద్ధమనోకర్మలు!

(ఒక్క మారాగి, ఆత్మ సంయమనం చేసుకుంటూ, ఉద్రేకాన్ని తగ్గించుకో ప్రయత్నిస్తూన్నట్లుంటాడు.)

పాలోవ్:- కాని, మిత్రులారా! బహుశా నేను అసంబద్ధమైన భావనా ప్రవాహంలో కొట్టుకుపోతున్నానేమో అని కూడా సందేహం కలుగుతూంటుంది!......కాని, మన యెట్ట యెదుట మానవుల మెదడు, దాని వ్యాపారాలు,- అంటే మనస్సు, బుద్ధి వీటికి బోయే......

జబేలిన్:- కోటలోనికి కవాటాలు తెరచి వున్నాయి!

పాలోవ్:- భేష్! ఎంత చక్కగా చెప్పేరు! అరటి పండు ఒలిచి చేతబెట్టినట్లే. ఇప్పటిదాకా వైజ్ఞానికుల కళ్ళేమైనాయి? (ఆలోచిస్తూ కాస్సేపు నిల్చుని, బీరువా దగ్గరికి

వెళ్ళి, పాతబడి వెలిసి పోతూన్న పుస్తకా న్నొకదాన్ని తీస్తాడు.) ఇదేమిటో తెలుసా ? మహామేధావి, శరీర శాస్త్రజ్ఞుడు శచినోవ్ రచించిన 'మెదడు : తద్వ్యాపారాలు.' (తెరచి చూస్తూ) ర్యాజాన్‌లో విహారవిద్యాలయంలో చదువుకొనే దినాల్లో చదివేను. కాని,...... (చకులిస్తూ) ఆ దినాల్లో దీని ప్రాముఖ్యతను పూర్తిగా గ్రహించనే లేదు! ఆ దినాల్లో రష్యాలోని విద్యావంతులందరూ పఠించిన ఉద్గ్రంథం యిది!...శచినోవ్! సజీవమైన మెదడును సమీపించి, కన్నార చూసి, స్పృశించి అర్థం చేసుకోడానికి అవకాశాలు దొరుకుతాయా ? అని ఆయన యెంతో పరితపించేడు!!...ఇప్పటికి మనకా అవకాశం లభించ బోతూంది! సంఘటనలు, ఆధారాలు, పరిశోధనాంశాలు, చేతికి దొరికిన ఋజువు సాక్ష్యాలు...సమకూర్చు కుంటున్నాం! కోటను ముట్టడించ బోతున్నాం! ...నికోడిమ్! అవి తీసుకువచ్చేవా ?

(నికోడిమ్ పాకేజీని తీసుకునివచ్చి యిస్తాడు. పావ్లోవ్ దాని నెంతో ఆతురతతో విప్పుతూంటాడు. పిల్లలు పండుగ బహుమతులైనా అంత ఆసక్తితో విప్పరు. దానిలోని అట్టపెట్టిలోంచి వివిధ పరిమాణాలుగల చిరుగంటల్ని తీసి, ఒక్కొక్కదాన్నే వాయిస్తూంటాడు, పావ్లోవ్.)

పావ్లోవ్:- అయ్యా! (ఒక చిన్న గంటను చూపుతూ) దీన్ని తినుబండారంగా మీరు భావించరుగదా ? ఏం ? ఈ చిన్న గంటతో కుక్కల నోరూరిస్తానని మీకు చెపుతున్నా.

(గంటను పైకెత్తి వాయిస్తాడు. దాన్నొక ప్రక్కగా వుంచి, మిగతా వాట్లనికూడా ప్రయోగిస్తాడు. అన్నీ తలొక రీతిగానూ ధ్వనిస్తాయి.)

(దేవతార్చన సమయంలో వాయించే గంటలవంటి యీ ధ్వనుల నందరూ ఆశ్చర్యంతో వింటూంటారు. పాలోవ్ యీ గంట లన్నింటినీ వరుసగా పేరుస్తాడు)

పాలోవ్:- మిత్రులారా! మన లేబొరేటరీ యింతటి నుంచీ మనో వ్యాపారాలను గూర్చిన ప్రయోగాల్నే చేయాలి!

జ్యాక్ స్టేన్:- (కంగారుతో) డాక్టర్ పౌలోవ్! ఇదేమిటిప్పుడు, ఝట్ళి? జీర్ణక్రియాపరిశోధన లేం చేస్తారు?

పాలోవ్:- డాక్టర్ జ్యాక్ స్టేన్! ఎందు కంత కంగారు పడతారు? జీర్ణకోశం మీద పరిశోధనల్ని మనం దాదాపు పూర్తి గావించినట్లే. ఇక యిప్పుడు మన ముంకున్న పని ఒక శతాబ్దందాకా సరిపోతుంది. సిద్ధంగా వుండండి!

నికోడిమ్:- ఆఁ హాఁ! అదన్నమాట! డాక్టర్ పౌలోవ్! నేను యివాళే వెడుతున్నాను. తప్పను మరి. నేనుండ జాల నందుకు విచారిస్తున్నా ... గంటయింది, నాకు.

(అందరూ నిశ్శబ్దంగా ఎవరేనా దూరం బోయే టప్పుడు ముందొక్కసారి కూర్చుని మరీ బైలుదేరాలనే సనాతనాచారం అనుసరిస్తారు.)

పాలోవ్:- (పేమార్ద్రభావంతో) నికోడిమ్! మరిచేపోయేను, చూసేవా? ఈ వేళే? ఇప్పుడేనా? అయితే... సరే. రా. కాస్సేపు కూర్చుందాం.

నికోడిమ్:- (లేచి) నా తప్పులేవైనా వుంటే మన్నించండి, డాక్టర్ పావ్లోవ్ !

పావ్లోవ్:- దానికేం లే గాని, నికోడిమ్ ! నువ్వు...

(ఇద్దరూ మూడు సార్లు ముద్దిడు కుంటారు.)

నికోడిమ్:- (ఉద్రేకంతోనూ, ఆనందంతోనూ కళ్ళు నీరు గ్రమ్ముతూంటే) ఔను ! అదే నేనూ అనుకొనేది. మీకు వర్ధంతి జరగటం, నేను లేకపోవడం ! ఎంత దురదృష్టం ! పాతికేళ్ళు శాస్త్ర పరిశోధన ! మాటలు గాదు. దగ్గర లోనే వర్ధంతి వుండడం, నేను సమయానికి లేకపోవడం ! యెంత విచారకరం !

పావ్లోవ్:- వర్ధంతి కేం వచ్చెలే, నికోడిమ్ ! (సాలోచనుడై) ఏళ్ళు గడిచి పోతున్నాయి, చేసింది చూస్తే యేం కని పించదు ! నికోడిమ్ ! చూడు, ఇప్పు డిప్పుడే కాస్త దారి తెన్నూ అంటూ కనిపిస్తూంది. వయసువచ్చి మీద పడిపో తూందనేది యెంత కష్టం !

నికోడిమ్:- డాక్టర్ పావ్లోవ్ ! వెళ్ళొస్తా. బ్రతికుంటే మళ్ళీ కలుస్తాంలెండి. అంతా ఈశ్వరేచ్ఛ. మన యిష్టం యే ముంది ?...(వెళ్ళిపోతాడు.)

---

# ఎనిమిదో రంగం

(సెంటు పీటర్స్‌బర్గ్‌లో, మెడికల్ అసోసియేషన్ హాలులో పావ్లోవ్ వర్ధంతి సభ. ప్రొఫెసర్లు, డాక్టర్లు, సర్జన్‌లు, శాస్త్రజ్ఞులు హాలులో క్రిక్కిరిసి వున్నారు. మిలటరీ యూనిఫారాలు ధరించిన సర్జన్‌లు. తెల్లటి శిరోవేష్ట నాలతో నర్సులు; ఆకర్షనీయములైన దుస్తుల్లో కొందరు ఘరానా స్త్రీలు. వీరు కూడా ఆ సభలో చెదురుగా కానవస్తారు.

వయోధికుడైనా వుల్లాసియైన దిమిత్రీ పావ్లోవ్, జీవితఅపరాహ్నంలో పడిన సెరాఫిమా వాసిలియేవ్నాతో ఒక చోట కూర్చుని వుంటాడు. ప్రక్కనే జ్వాన్ ష్ట్సేవ్, జబేలిన్‌లు.

వేదిక మీద దిగ్దంతుల్లాంటి విజ్ఞాన వేత్తలు కూర్చుని వుంటారు. వారిలోనే ఇవాన్ పావ్లోవ్ ఆసీనుడై వున్నాడు. తల నరసిన వృద్ధ ప్రొఫెసర్ స్తెపాన్ తిమోఫెయిచ్ ఉపన్యాసం యిస్తున్నాడు.)

వృద్ధ ప్రొఫెసర్:- ఇవాన్ పెత్రోవిచ్ పావ్లోవ్ విజ్ఞాన శాస్త్ర కాశంలో ఉజ్జ్వలతార! పరిశోధనలో షష్టిపూర్తి నిండిన యీ సందర్భంలో ఆయన నభినందించగలగడం మహా ద్భాగ్యం!

(సభలో హర్షధ్వానాలు. కల కలం వినవస్తుంది. అక్కడక్కడ ప్రశంసా సంభాషణలు వినవస్తాయి.)

దిమిత్రీ పావ్లోవ్:- గుర్తుందా, సీమా? వాన్యాకి గొప్ప భవిష్యత్తు వుందని చెప్పేను జ్ఞాపకం లేదూ?

సెరాఫిమా:- ఔను! కాని, నాకే యేదో భయం, దిగులుగా వుండేది. ధైర్యం చెప్పేందుకు మీరు లేకపోతే...

దిమిత్రీ:- మానవ జీవితమే ఒక పెద్ద పరీక్ష! విశ్వాసం వుండాలి. ఓరిమితో మనం విధి విహితాన్ని...

సెరాఫిమా:- (జ్వాక్ ఉస్పెవ్-జబేలిన్‌లతో కరచాలనం చేస్తూ) మీ రింతకాలంగానూ ఆయనతోనే పరిశోధన సాగిస్తూ న్నారు. ఇందులో మీ పాత్ర యేమంత తక్కువది గాదు! మీకుకూడా యిది వర్ధంతి అనే చెప్పాలి!...

(జ్వాక్ ఉస్పెవ్ దిగులుగా, యెల్లాగో వుంటాడు. తెచ్చి పెట్టుకున్న నవ్వుతో సెరాఫిమా కరచాలనం చేస్తాడు.)

వృద్ధ ప్రొఫెసర్:......జీర్ణ క్రియను గూర్చిన యీాయన పరిశోధనలు ప్రపంచ విఖ్యాతి నందినాయి. వాటికై నోబెల్ బహుమానం మొన్ననే వీరికి లభించింది. వీరికి నోబెల్ బహుమానాన్ని యివ్వడం అంటే ఆ సంస్థకే గౌరవం అని చెప్పాలి! విజ్ఞానాన్ని, పాండిత్యాన్ని ఆరాధించి, మానవ జాతి......

(అతివేలంగా హర్షధ్వానాలు. వేదిక మీది పావ్లోవ్ ముఖంలో కోపం, చిరాకు గానవస్తాయి. అతడు యెబ్బెట్టుగా శిరస్సు వంచి సభకు వందనం చేస్తాడు)

వృద్ధ ప్రొఫెసర్:......పురోగమిస్తూంది. ఇవాన్ పిత్రోవిచ్ పావ్లోవ్‌కి సత్యాన్వేషణలో నిరంతర విజయం, సుఖ శాంతులూ లభించాలని కోరుతాం. ఆయనకు చిరాయురారోగ్యములు ప్రభువు ప్రసాదించుగాక అని ప్రార్థిస్తూ...

(అతడు తన ధోరణిలో తన్మయుడై పోతాడు. దిక్కులు పిక్కటిల్లే హర్షధ్వానాలు. సభలో కలకలం. సంభాషణలూ చెలరేగుతాయి.)

ఒక ప్రొఫెసర్:- మీరూ వచ్చేరా, ప్రొఫెసర్ పిత్రిశ్చేవ్!

ప్రొఫెసర్ పిత్రిశ్చేవ్:- ఓహో! మీరా? వందనాలు.

నేనూ, పౌలోవ్‌ూ బాల్య మిత్రులం. అదృష్టదేవతను చెవులు పట్టుకుని తన కాళ్ళదగ్గిరికి యీడ్చు కొచ్చే దను కోండి, పౌలోవ్ !

ప్రొఫెసర్:- ఆశ లందరికీ ఉంటాయిలెండి. కాని వాటి నందుకు నేందుకు తగ్గ శక్తి సామర్థ్యాలూ, పట్టుదలా...

పిత్రిశ్చేవ్:- అతడు మా చెడ్డ పట్టుదల మనిషిలెండి. అతిశయోక్తి గాదు, వాచ్యంగానే అతడు చెవులు పట్టుకుని అదృష్ట దేవతని స్వాధీనం చేసుకున్నాడు ! ఇక్క- చెవులు పట్టుకుని ! నిజంగా !...

ప్రొఫెసర్:- మీరేం చేస్తున్నా రిప్పుడు ?

పిత్రిశ్చేవ్:- విద్యా మంత్రివర్గం ఆఫీసులో లెండి. డిపార్టు మెంటల్ హెడ్‌గా వున్నాను.

ప్రొఫెసర్:- అల్లాగ నండీ. అదృష్టవంతులు !

పిత్రిశ్చేవ్:- ఏమిటోలెండి, మనదేముంది ! (సంతృప్తికరంగా నవ్వుతూ విరగబడతాడు.)

(పౌలోవ్ ఉపన్యసించడానికి లేస్తాడు. ఉత్సాహధ్వనులు)

పండితులారా ! సోదరీసోదరులారా ! మీ కందరకూ నా హృదయపూర్వక వందనాలు ! నా యొక్క-, నా సహచరుల యొక్క- పరిశ్రమను ప్రపంచమంతా గుర్తించి గౌరవించిందంటే, మన రష్యన్ శాస్త్రపరిషత్‌నూ, తత్ కృషినీ, మన దేశాన్నీ గౌరవించినట్లే ! (ఏమి

చేయూలో తెలియనట్లు హస్త విన్యాసం చేస్తాడు.)... పూజనీయుడైన ప్రొఫెసర్ స్టెపాన్ తిమోఫెయిచ్ స్వాగతాశీస్సుల కెంతో కృతజ్ఞుణ్ణి. కాని, ఆయన సూచించిన 'శాంతి' అనే దాని అర్థం నా కేమీ గ్రాహ్యం కాలేదు... నిజానికి, మానవ జాతి యావత్తూ యిప్పుడు విషమ ఘట్టంలో, డోలాందోళిత పరిస్థితుల్లో వుంది. ఏది యెల్లా వున్నా మనం యీ రోజున యెన్నో విజయాల్ని సాధించి, యింకెన్నో చిక్కు సమస్యల్ని పరిష్కరించగల కృషిని సాగించే స్థితిలో వున్నామని చెప్పగలం... (సభికులంతా నిశ్శబ్దంగా, ఆయన మాటలకై యెదురు చూస్తుంటారు. చిరునవ్వుతో పావ్లోవ్) మహాజనులారా! నాది ఒకటే కోరిక. నేను కడకంటా విశ్రాంతి రహితమైన జీవితాన్ని గడప గలిగేటట్లు మీరంతా ఆశీర్వదించాలి! నిజంగా నా కోరిక అదే. దయచేసి ఆశీర్వదించండి!

(సభలో హర్షధ్వానాలు. విద్యార్థుల గ్యాలరీ నుంచి అదే పనిగా కరతాళ ధ్వనులు. ఒక విద్యార్థిని బాల్కనీ మీంచి ముందుకువంగి, పెద్దగా చప్పట్లు కొడుతూంటే మరో విద్యార్థి అరుస్తాడు.)

విద్యార్థి:- వార్యా! జాగ్రత! సంతోషంలో తూలి ముందుకి పడగలవ్!

విద్యార్థిని వర్వారా అంటోనోవ్నా:- (తిరిగి చూసి) అదీ! నిజమైన మగాడంటే అల్లా వుండాలి! (ఒక్క మాటు ఆగి) చదువు పూర్తయేక నేనూ ఆయన క్రింద పరిశోధనల్లో చేర్తాను.

ఇంకో విద్యార్థి:- (ఎత్తిపొడుపుగా) ఓహో! అల్లాగా!

వర్వారా:- నువ్వే చూస్తావు, వుండవోయ్!

(పాలోవ్ హడావిడిగా వేదికమీంచి దిగి క్లోక్ రూమ్‌లోకి పోతాడు. చాల మంది ఆయన్ను వెంబడించి చుట్టూ మూగుతారు. జనాన్ని మోచేతులతో తప్పిస్తూ పిత్రిశ్ఛేవ్ పాలోవ్‌ను సమీపిస్తాడు.)

పిత్రిశ్ఛేవ్:- హృదయపూర్వకాభివందనాలు, ఇవాన్! (అంటూ పాలోవ్‌ను మూడుసార్లు ముద్దెట్టుకుంటాడు) మిత్రమా! చాల సంతోషంగా వుంది. ఇదిగో! (సెరాఫిమా వైపు తిరిగి) సెరాఫిమా వాసిలియేవ్నా! ఎంత సుదినం! (ఆమె చేతిపై వంగి ముద్దెట్టుకుంటాడు.) ఓహో! వొలోద్యా గాదూ? (విద్యార్థి దుస్తుల్లో వున్న వ్లాడిమిర్‌ని సమ్మోదసూచకంగా యెగాదిగా చూస్తూ) భేష్! ఎంత వాడైనాడు!

పాలోవ్:- (సాలోచనగా) ఔనౌను!......

పిత్రిశ్ఛేవ్:- (విచారాశ్చర్యాల్ని నటిస్తూ) వాన్యా! మిత్రమా! మనం విద్యార్థులంగా వున్న దివాలు తిరిగి రావుగదా? నిన్ననే అయినట్లుగా వుందనుకోండి! సీమా! గుర్తుందా నన్ను మీరందరూ పరిహాసం చేసేవాళ్లు! గవర్నమెంటు వుద్యోగం, కడుపులో చల్ల కదలకండా వెచ్చగా కూర్చుని సుఖించడం అదో తప్పా అంటూ? చూడు, యిప్పుడు యివాన్ మాత్రం సౌఖ్య మార్గంలో...

పాలోవ్:- (హఠాత్తుగా గుర గుర లాడుతూ కోపంతో) ఔను! ఇంక లోటేమిటి? బళ్ళకొద్దీ కట్టెలు మంట బెట్టు

కున్నా నిన్నడిగే వాడు లేడు! అదేపని, యింక నీకు! నన్నెందుకు నీతో చేర్చుకుంటావు లే? నీ పుణ్యమాయుని...

(సెరాఫిమాకు కైదండ యిచ్చి వెలుపలికి నడుస్తాడు. అంతా భక్తి గౌరవ పూర్వకంగా పాయవిడి దారి యిస్తారు. పిత్రిశ్చేవ్ ముఖం మాడి పోతుంది. ఆతడు ఆందోళనతో, పోతున్న జ్వాన్ట్సేవ్ జబ్బ పట్టుకుని నిలుపుతాడు.)

పిత్రిశ్చేవ్:- (మెల్లగా) మిత్రమా! జ్వాన్ట్సేవ్! ఈ వేళ అతడేమి మాట్లాడేడు? అతగాడనే దేమిటి? ఏదైనా కొత్త పని తలపెట్టే రేమిటి?

(చాలమంది వీరిద్దరిచుట్టూ చేరుతారు.)

జ్వాన్ట్సేవ్:- ఆయన ముందు ప్లానుల్ని గూర్చి నాకేమీ తెలియదండీ. కావాలంటే మీరే ఆయన నడగండి.

పిత్రిశ్చేవ్:- (జ్వాన్ట్సేవ్ భుజంతట్టుతూ) ఓ సోస్సి! ఏమీ యెరగనట్లు. మీ రాతనితో యెన్నేళ్ళుగా పనిచేస్తున్నారో యెవరూ యెరగరనుకుంటున్నారా?

జ్వాన్ట్సేవ్:- (చుట్టూ చూస్తూ) అయ్యో! నేను చెప్పగలిగిందేమీ లేదు... అంటే ఆశాజనకమైనదీ, ఉత్సాహాన్నిచ్చేదీ విషయం యేమీ లేదనుకోండి...... డాక్టర్ పావ్లోవ్ చెప్పింది విన్నారు గదూ?...ఆయనకి కావాల్సిందల్లా విశ్రాంతి రహితమైన జీవితమే!...

(వెళ్ళి పోతాడు. నిరుత్సాహంతో నిశ్శబ్దంగా ఒకరి మొగా లొకరు చూసుకుంటారు.)

---

# తొమ్మిదో రంగం

(సభా భవనంబైట జోడు గుర్రాల బండిలోకి సెరాఫిమాను చేయూత యిచ్చి యెక్కిస్తుంటాడు, పాలోవ్. దగ్గరలోనే కుమారుడు వ్లాడిమిర్, బండి వాడు, యితరులు వుంటారు.)

పాలోవ్:- (కుమారునితో) నువ్వుకూడా యెక్కు! వొలోడ్యా!

సెరాఫిమా:- మీరో? మీ మాటేమిటి?

పాలోవ్:- (వినిపించుకోనట్లు) వొలోడ్యా! అమ్మని యింటికి తీసుకు పోతావుగదూ? భద్రం.

సెరాఫిమా:- మిమ్మల్నే. మీరు రావడం లేదా?

పాలోవ్:- మీతో రాజాలనందుకు క్షమించాలి, సీమా! ఇన్‌స్టిట్యూట్‌లో ముఖ్యమైన పనుంది. ఇప్పుడు రాను! (కుమారునితో) వొలోడ్యా! పండుగోనే లోపున అమ్మ కాఫీ త్రాగకండా చూడు. అది ఆమె హృదయానికి అద నపు రుని కలిగిస్తుంది.

వ్లాడిమిర్:- అల్లాగే! నాన్నా! (తల్లితో) అమ్మా! మనం బైలుదేరుదమా?

(పాలోవ్ చేతిబెత్తం వూపుతుంటూ, వాళ్ళకి వీడ్కోలిస్తాడు. ఆయన ముఖంలో ఆనందోత్సాహాలు వెల్లివిరుస్తుంటాయి. తొందరగా పెద్ద పెద్ద అంగలతో నడిచి పోతూంటాడు. వెనక కొంత దూరంలో వర్వారా; మరి కొందరు విద్యార్థులు నడుస్తుంటారు.)

వర్వారా:- డాక్టర్ పాలోవ్‌తో మాట్లాడాలి!

ఒక విద్యార్థి:- (పరిహాసంగా) తగ్గు, తగ్గు! వార్యా!

మరొకరు:- నీకంత సాహసం కూడా వుందీ?

వర్వారా:- సాహసమా? సరే, ఐతే మీరే చూస్తారుగా?

(పరుగెత్తి పోయి పౌలోవ్‌ను కలుసుకుంటుంది. విద్యార్థులంతా ముళ్ళమీదున్నట్లుంటారు)

వర్వారా:- ప్రొఫెసర్! క్షమించాలి. నాపేరు వర్వారా ఆంటోనోవ్నా ఇవానోవా. మీతో కలిసి, మీ క్రింద పని చెయ్యాలని వుంది, నాకు.

పౌలోవ్:- నా దగ్గర పనిచేస్తా నంటావా? చిత్రంగానే వుందే! ఏం చేయగలవు?

వర్వారా:- నేను మెడికల్ గ్రాడ్యుయేటును.

పౌలోవ్:- ఓహో! అల్లాగా!

(నడుస్తూ యిద్దరూ ఒక పార్కులో ప్రవేశిస్తారు.)

పౌలోవ్:- ఐతే, దేన్ని అభిమానవిషయంగా తీసుకుందామనుకుంటున్నావు?

వర్వారా:- జీర్ణ క్రియను గూర్చి ఏదైనా సరే.

పౌలోవ్:- (నిరుత్సాహంగా) నే నిప్పుడు జీర్ణక్రియా పరిశోధనలు తగ్గించేసేను. వాటి మీద నాకింక ఆసక్తి లేదే!

వర్వారా:- (ఆశ్చర్యచకితురాలై) నిజంగానే? వేళాకోళం చేయడం లేదుగదా? ప్రొఫెసర్!

పౌలోవ్:- ఎంతమాత్రం గాదు... నోరూరటాన్ని గురించిన పాతసామెత తెలుసుగా? నోరెందుకు వూరుతుందో తెలుసుకోడానికి విచిత్రంగానే వుంటుంది.

(తనకు తాటాకులు కడుతున్నా డనుకుని వర్వారా ఆందోళనగా పౌలోవ్ వైపు చూస్తూంటుంది.)

వర్వారా:- ప్రొఫెసర్ ! నాకు జీర్ణక్రియావిషయిక పరిశోధనలో చేయూలసివుంది. నా అభిమానవిషయం శోధనవిజ్ఞానం.

పొలోవ్:- నేను చేయగలిగిందేమీ లేదు, క్షమించాలి !

(అంటూ వేగంగా నడుస్తాడు. వెంటబడి వేధించుకుతినే మనిషిని వదల్చుకునేందుకు ప్రయత్నిస్తున్నట్లు. ఐనా వదలక వర్వారా ఆయన్ను వెంబడిస్తూంటే, పొలోవ్ ఆశ్చర్యంగా ఆమెను చూస్తూ యింకా గమనవేగం హెచ్చిస్తాడు. విద్యార్థులు వీరివైపు చిత్రంగా చూస్తూంటారు.)

పొలోవ్:- (ఘూంకారంగా) ఏ మమ్మా ! ఎందుకింకా వస్తున్నావ్ ? నువ్వు కన్యవనుకుంటానేం ! క్షమించు, అడిగినందుకు ! కాని, శుద్ధ పెంకిఘటానివని చెప్పక తప్పదు ! పైగా డాక్టరువి ! ఇంకేం ?

వర్వారా:- (అంత పెంకితనంగానే) ఔను, ప్రొఫెసర్ ! ఈ కన్నె డాక్టర్ జీర్ణక్రియను గూర్చి పరిశోధన సాగించాలనుకుంటూాందండీ. తన పట్టుదల నెగ్గించుకుని తీరుతుంది కూడాను . . .

పొలోవ్:- కావచ్చు. దాని కభ్యంతరమేమిటి ? కాని, నా దగ్గరమాత్రం గాదు ! శోచనీయమైన విషయమే అనుకో. అబ్బా ! నువ్వు మగాడిలా నడుస్తావే !

(వర్వారా నిరసన సూచకంగా తల పంకిస్తుంది; స్త్రీకి యిది పొగడ్త అనడంకంటె నింద అనే చెప్పాలి. పొలోవ్ నిలబడి తొందరగా ఆమె చేతిని చాలనచేసి సెలవు తీసుకుని వెళ్ళిపోతాడు. వర్వారాకి కళ్ళు చీకట్లు గ్రమ్మినట్ల

వుతుంది. వెనకనుంచి విద్యార్థుల గప్పాలు వినవస్తాయి. ఆమె ఆత్మసంయమనం చేసుకుని గిరుక్కున వెనుక తిరిగి, వాళ్ళవైపు వస్తుంది.)

వర్వారా:- మిత్రులారా! నే నాయనవద్ద పనిచేసే తీరుతా... చేయలేకపోతే అడుగుడుగుగాని!

(స్పష్టంగా విడమర్చి, నొక్కి పలుకుతుంది.)

---

## పదో రంగం.

(వసంత ఋతువులో ఒకనాటి ప్రాతఃసమయం. రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ద్వారంలో వర్వారా పావ్లోవ్ కొరకై వేచివుంటుంది. అక్కడ అంతా గడబిడగా వుంటుంది. ద్వారాలన్నీ బార్లాతెరిచి వున్నాయి. స్టాండ్లు, టేబిలు, గాజు పరికరాలు, బీరువాలు మొదలైన సామగ్రిని చాలమంది పనివాళ్ళు అటు నిటు మోసుకుపోతున్నారు. జ్వాన్‌ట్సేవ్ నిరుత్సాహంగా, నిర్విణ్ణుడై యీ గడబిడలో నిలిచివుంటాడు స్టాఫ్ మెంబర్లు అతనిచుట్టూ మూగివుంటారు. అక్కడి ప్రశాంత వాతావరణం పోయి గందరగోళంగావుంది.)

ఒక అసిస్టెంటు:- డాక్టర్ జ్వాన్‌ట్సేవ్! జీర్ణక్రియాపరిశోధనలింకా పూర్తిగానిదే యిదేమిటి మధ్యలో?

మరొకడు:- దీని కర్థమేమిటండీ?

వేరొకడు:- అన్నీ సగం సగం పనులే! ఎవరికేనా మతిపోయి వుండాలి!

జ్వాన్‌ట్సేవ్:- నాకూ యేమీ తెలీదండీ, అయ్యా! నేను ఒక్కప్రశ్నకీ జవాబీయలేను. క్షమించండి!

(పావ్లోవ్ గబగబా ఓగదినుంచి మరో దానిలోకిపోతూ గానవస్తాడు. జ్వాన్‌ట్సేవ్ గమ్మున ఆయనవైపు పోతాడు.)

జ్వాక్ శ్నేవ్:- ఏమండీ! డాక్టర్ పౌలోవ్! నేనూ, యింకా చాలమంది అసిస్టెంట్లూ మారీసెర్చి పనిపూర్తిచేయనిదే...

పౌలోవ్:- (ఉత్సాహంగా) నన్నేం చెయ్యమంటారు? ఇంకొక్క క్షణంకూడా వృథా చెయ్యలేము. మన చేతుల్లో యిప్పుడిల్లాంటి ఆధారాలున్నాయి! మనకొక మహదవకాశమిది! అబ్బే! లాభంలేదు. ఇంకనుంచి జీర్ణక్రియాపరిశోధనలకి స్వస్తి చెప్పినట్లే!

(అక్కడ నిలబడకండా మేడమెట్లెక్కిపోతూ కూనిరాగంతో ఒక ప్రస్థాన గీతిక నాలాపిస్తూంటాడు. 'యోధులం యువకులం సాహసుల-మనం, పం పా రా రిం పం....')

జ్వాక్ శ్నేవ్:- (నిర్విణ్ణుడై) లాభంలేదింక! ఈయనకి మతిపోయింది. పూరుషంటే నాకూ మతిపోయేటట్లుంది!...

(ఎలక్ట్రిషియన్ వంటినిండా తీగచుట్టలు, యితరపరికరాలు వ్రేలాడవైచుకుని ప్రవేశిస్తాడు. శ్లేష్మతత్వంగల మందుడులా కనబడతాడు. పన్నుపోటువల్లనేమో ముఖానికి కట్టుతోవున్నాడు.)

ఎలక్ట్రిషియన్:- ఏమండీ! ఏ గంటలు యెక్కడ అమర్చమంటారో చెప్పండి?

జ్వాక్ శ్నేవ్:- (చిరాకుగా) నాకు తెలియదు, ఆయన్నే అడుగు, వెళ్ళి!

(పౌలోవ్ మళ్ళీ తన ఆఫీసుగదిలోకి పోడానికివస్తూ గుమ్మంలో నిల్చునివున్న వర్వారాకి అతి సమీపంలోకివచ్చి, ఆశ్చర్యంతో నిలబడిపోతాడు.)

పౌలోవ్:- ఇదేమిటి? మళ్ళీ వచ్చేవెందుకు?

వర్వారా:- ఔనండీ, ప్రొఫెసర్! మళ్ళీ నేనే...

పావ్లోవ్:- (ఆమెవైపు పరిశీలనగా చూస్తూ ఉల్లాసంగా) పెంకితనం, పట్టుదల గలవాళ్లు మాకు కావాలి! వాళ్ళే కావాలి!

జ్వాన్ శ్చేవ్:-(సమీపిస్తూ, నిరుత్సాహంగా) డాక్టర్ పావ్లోవ్! మీతో కొంచెం మాట్లాడాలి.

పావ్లోవ్:- (అతనివైపు ఆశ్చర్యంగాచూస్తూ) తప్పకండా! (తన గదితలుపు తెరుస్తూ) ఎప్పుడైనా సంసిద్ధుడనే. రాండి, లోనికి. దయచేసి... (వర్వారా విషయం మరిచి, లోనికి పోతాడు.)

(జవేలిన్ లోన చదువుకుంటూంటాడు. పావ్లోవ్ అతనికి వందనమనిచెప్పి పడకకుర్చీలో కూర్చుంటాడు. జ్వాన్ శ్చేవ్ అక్కడే అటు నిటు పచారు చేస్తూంటే, జవేలిన్ తలెత్తి అతనివైపు ప్రశ్నార్థకంగా చూస్తాడు.)

జ్వాన్ శ్చేవ్:- (నీళ్ళు నములుతూ) ఎన్నేళ్లుగానో మీతో పనిచేస్తున్నా. మీయందు నాకెంతో విశ్వాసంవుంది. ఇప్పటిదాకా మారుమాటాడకండా మీతో వస్తూన్నా. కాని, యింకొక్క అడుగుకూడా ముందుకు వేసే వుద్దేశ్యం లేదునాకు. దేనికైనా పరిమితమంటూవుంది చూసేరూ...

పావ్లోవ్:- ఓహో! అల్లాగా? ఎందువల్లనో...

జ్వాన్ శ్చేవ్:-మనం యింతవరకూచేస్తూన్న పరిశోధనలనువదలి మీరిప్పుడు మెదడునుగూర్చి పరిశోధన సాగించాలనుకుంటున్నారు. మెదడులోని గ్రంథినీ, గ్రంధికనీ వేరుచేయ గలిగినంత మాత్రాన్నే మనోమయకోశాన్ని చూడగల

మనుకోడం పిచ్చిభ్రమ! ... దివ్యలోకాల్ని బైనాకు లర్స్‌తో చూడ యత్నించినట్లుందీ ప్రయత్నం!

పౌలోవ్:- (లేచి జ్వాక్‌ట్సేవ్ దగ్గరకివెళ్ళి నిదానంగా) ఏమి టంటారు? బైనాకులర్సా? అబ్బే! గాదండి, అయ్యా! టెలిస్కోపు అనండి, బాగుంటుంది. దివ్యలోకాలంటారా? భేష్! నిజమే, మరి. మెదడంటే కోటానుకోట్ల సెల్సు (కణములు)తో గూడిన దన్నమాట! బ్రహ్మాండభాండమే, నిజంగా!

(కిటికీ దగ్గరికిపోయి. బార్లా తెరుస్తాడు. కిటికీలోంచి అనంతాకాశం. మబ్బులూ కనిపిస్తాయి. సూర్యకిరణాలు పౌలోవ్‌నూ, గదినీ కాంతిలో ముంచెత్తుతాయి. అతడు చేయిచాచి, ఆకాశంవైపు విశాలంగా చూపిస్తూ)

పౌలోవ్:- (గాఢమైన వుద్రేకంతో) డాక్టర్ జ్వాక్‌ట్సేవ్! అదిగో! దయచేసి చూడండి! మానవుడు భూమికీ, సూర్యునికీ, నక్షత్రాలకీ మధ్యగల దూరాల్ని కొలిచేడు! అంతర్నక్షత్రాంతరాళాలలో తుపానుల్లోకి కాంతి కిరణాలతో బాటు జొచ్చుకుపోయేడు! కాని, (నుదుటిమీద చూపుడువ్రేలితో తట్టుకుంటూ) యిందులో యేం జరుగుతూందా? అనేది యింతవరకూ యిదమిత్థమని చెప్పలేక పోయేడు! ఎంత సిగ్గుచేటు! (జ్వాన్‌ట్సేవ్ దగ్గిరికివచ్చి) మానవుడు తన మెదడు యెల్లా పనిచేస్తూందా? అనేది విస్పష్టంగా తెలుసుకునే వరకూ సుఖిగాలేడు! మనస్సును శాసించ గలిగేవరకూ మానవునికి శాంతి లేదు! శరీరశాస్త్రం యొక్క ప్రత్యక్షకర్తవ్యమయిదే. నాను సంబంధించి

నంతవరకు యితర పనులన్నీ అప్రాముఖ్యములైనవే, దీనితో పోల్చిచూస్తే.

జ్వాన్ ట్సేవ్:- (నిరసనతో) డాక్టర్! మీకు మతిభ్రమణం కలిగింది. రండి, దారికిరండి. నిదానించండి! అది ఆలోచనా ప్రపంచం! భావనాలోకం! ఆత్మ...అనుభూతి...

పాలోవ్:- (వ్యంగ్యంగా) ఆత్మట! ఆత్మ! నేను శరీరశాస్త్రజ్ఞణి. స్వయంగా పరిశోధించిగాని, చూచి స్పృశించిగాని దేనినీ నమ్మను! కాకమ్మ కథలు కట్టిపెట్టండి!...కాని, యిప్పటివరకూ విచిత్రమైన యీ 'ఆత్మ' పదార్థాన్ని గూర్చి తెలుసుకోజాలకనే పోయేను! ఎందువల్లనో?

జ్వాన్ ట్సేవ్:- ఎందువల్లనా? అది అజ్ఞేయమైనదిగనక! ఆత్మ అవాఙ్మానసగోచరమైనది! మీరు మీరే! నేను నేనే! మన శరీరాలు అనేక దశలను, బాల్య కౌమార యౌవన వార్ధక్యాలను దాటిపోతూన్నాయి. మన తలలు నెరసి, అవయవ పటుత్వం క్షీణిస్తూంది. కాని, మనం మనంగానే వుంటున్నాము. ఈ 'నేను' అనేది సూక్ష్మన కతీతం! పరిశోధనలకూ, ప్రయోగాలకు లొంగేదిగాదు 'ఆత్మవస్తువు'! నా 'అహం' కొలిచేటందుకు మీకు కొలతబద్ద యేది? నేను నేనే! ఎప్పటికీ!

పాలోవ్:- ఫూత్! చెత్త! బుర్ర పారేసుకుని మాట్లాడుతున్నారు. నువ్వెవరవు? (నోట మాటలేక నిశ్చేష్టుడైవున్న జ్వాన్ ట్సేవ్ మీదకిపోయి) నీ కెంతవయసు వచ్చినప్పటి నుంచీ నీలో 'నేను' అనే భావంకలిగింది? చెప్పు?

జ్వార్ట్సేవ్:- (త్రేరుకుని) బాగుంది. రాండి-అల్లా అడగండి... నాలుగేళ్ళు వచ్చినప్పటినుంచీ అని చెప్పచ్చు...

పౌలోవ్:- అంతకుముందు నువ్వెవరవు? ఎక్కడ వున్నావు? నీ 'అహం' యెక్కడుంది? చెప్పు, ఊఁ!...

జ్వార్ట్సేవ్:- కాని,... డాక్టర్ పౌలోవ్! నేను చెప్పేది...

(ద్వారందగ్గరే వేచియున్న వర్వారా యీ సంభాషణ వింటూ తెల్లబోతూ వుంది.)

పౌలోవ్:- మీరు చెప్పేదేముంది! కాకమ్మ కథలు! వినండి... కేవలం క్షేత్రం మాత్రమే ఆనువంశికంగా, వారసత్వంగా సంక్రమిస్తూంది. అంతే. నీలోని అహమంతా తర్వాత తర్వాత క్రమంగా రూపొందుతూ వచ్చింది. పరిసరాల ప్రభావంవల్ల ప్రభవించినదే అది...(గదిలో అటు నిటు గబగబ పచారుచేస్తూ) ఆత్మట! సింగినాదం జీలకర్ర!... విజ్ఞానశాస్త్ర ధేనువు మెడలో గుదిబండ లాంటిది, యిది! దీన్నంత త్వరలో త్రెంచి పారవేయగలిగితే అంత మేలు. విషయాల్ని కలియద్రొక్కి కలగాపులగం చెయ్యకూడదు. నిజమే. ఇప్పుడు మనం మానవుణ్ణిగూర్చి అన్వేషించబోవడం లేదు. ఆ ఘట్టం యింకా చాలదూరంలో వుందిలే. అది యిప్పుడు కేవలం ధ్యేయం, పారం మాత్రమే. ప్రస్తుతం వివిధ జంతువుల స్వభావరీతుల్ని గూర్చిన పరిశోధనల్ని మాత్రమే మనం సాగిస్తాం. పరిశీలనచేస్తూనే వుంటాం. ఎంత సేపూ పరిశీలన, పరిశీలన! అనావిష్కృతమైన ఆ అద్భుత

గ్రంథి (గ్లాండు) విశేషంవుండే మెదడు,-దానిమీదనే మన ఆయుధాలన్నిటినీ భారుచేయాలి. అదే చేయబోతున్నాం. ఆ పనినుంచి మనల్ని నివృత్తిచేసే శక్తియేదీ లేదు!

జ్యాక్ట్సేవ్: (ఉద్రేకంతో గభుక్కున లేస్తాడు) డాక్టర్ పాలోవ్! గురూజీ! మీరొక అగాధపు టంచున నిలబడి వున్నారు. కదిలితే పతనం, సర్వనాశనం, తప్పదు! ఇంక యిప్పుడు నేను మౌనం వహించి వూరుకోలేను. ఆగండి, గురూజీ! ఆగండి! అంతా మించిపోకముందే, యింకా అవకాశం వుండగానే ఆగండి. ఈ సృష్టిలో ఆత్మ, చైతన్యం లేని పదార్థం, జీవి ఒక్కటీ లేదు! ఎవరెన్ని విధాలుగా చెప్పనీండి, అంతా అదే! ఆత్మ, ప్రాణం, శక్తి, చైతన్యం, పేరు భేదమే గాని అంతా అదే!...ప్రపంచం మీ సిద్ధాంతాల్ని నిరాకరిస్తుంది. యావత్ప్రపంచానికీ వ్యతిరేకంగా వెళ్ళదలిచేరా, మీరు?

పాలోవ్: (క్రోధోద్రేకాలతో మండిపడుతూ చరచర బోయి జ్యాక్ట్సేవ్ కళ్లలోకి తీక్ష్ణంగాచూస్తూ) నువ్వు...నువ్వు పిరికివాడివి! అదీ నీ బండారం. శాస్త్రజ్ఞుడివేనా? అబ్బే! కాదు, కాదు. శాస్త్రజ్ఞు డెప్పుడూ యిల్లా మాట్లాడడు. జబేలిన్ రాత్రిం బగళ్ళు పరిశోధనల్లో గడుపుతున్నాడు. (జబేలిన్‌కి వంగి వందనంచేస్తూ) మరినువ్వో? మనం కలసి మెలసి యెన్నో సంవత్సరాలు గడిపేం. అత్యంతసన్నిహితులంగా వుండీకూడ మనం యెంతో దూరంగా వున్నాం.

అదెందుచేత ? నీ బుద్ధి మూఢ విశ్వాసాలతో పరివృతమై వుంది. మానవుని మెదడే శాస్త్రజ్ఞానాన్ని సృష్టించింది; ఇప్పుడా మెదడే శాస్త్ర పరిశోధనకు పాత్ర మవుతూంది ! మానవ గాంభీర్యోదాత్తతలు యింకులోనే చూడాలి ! మనం !......అన్నీ అన్నీ వదిలిపెట్టి నువ్వు నన్ను ఆగ మంటున్నావు ! ...... నన్ను లోకమంతా విమర్శించ వచ్చు, యెదురొక్క వచ్చు. కానీ !......నేనేం లెక్క చేయను. వాళ్ళంతా జేరినా మన కుక్కలకంటె హెచ్చుగోల చేయలేరులే !......(దూరంగాబోయి నిరీహుడై, విషా దావనతుడై నిలుచుని) నీ గురించి యేమనాలో, యేం చెయ్యాలో తెలియడంలేదు...నిజంగా !

జ్వాక్ ట్సేవ్:- మీకు తెలియకపోయినా, యేం చెయ్యాలో నాకు తెలుసులెండి ! నేను యిక్కడనుంచి వెళ్ళిపోతా.

పాలోవ్:- నువ్వెక్కడికీ వెళ్ళలేవు ! వెళ్ళవు! నేనూ వెళ్ళేది... కాని, నువ్వో ? ఉన్న చోటే వుంటావు ! యెక్కడున్నా వే గొంగళీ అంటే వేసికచోటే అనే సామెతలా !

(జ్వాన్ట్సేవ్ సమాధానం చెప్పకండా, వెలుపలికి దూకుడుగా పోతాడు. అతని వెనకనే జబేలిన్ కూడా వెడతాడు. పాలోవ్ ద్వారంవైపు అడుగిడి, మళ్ళా యేం తోచిందో వెనుదిరిగి మెల్లగా కిటికీదగ్గరికి పోతాడు. భారంగా. అక్కడే పడకకుర్చీలో కూలబడిపోతాడు. ప్రక్కగదిలో జ్వాన్ట్సేవ్, జబే లిన్ల మాటలు అస్పష్టంగా వినవస్తుంటాయి.)

జ్వాన్ట్సేవ్:- (కోటు తొడుక్కోబోతూ చెయ్యి దూర్చలేక) ఛీ ! దిక్కుమాలిన కోటు ! చెయ్యి దూరదేం ?

జబేలిన్:- (సాయంచేస్తూ) మిత్రమా ! ఏమిటీ విపరీతం ?

జ్వాక్ ఓస్నేవ్:- (గురగురలాడుతూ) వందనాలు !

జబేలిన్:-(సకరుణంగా) మిత్రమా! ఆయనకి యిదెంతకష్టంగా వుంటుంది ! నాకు తెలుసు. నామట్టుకు నేను...

జ్వాక్ ఓస్నేవ్:- (మాట కడ్డొచ్చి, తీవ్రంగా) ఆయనేమనుకుంటాడో అని మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే నీ జీవితాన్ని నాశం చేసుకుంటావు ! పిచ్చి అభిప్రాయాలమీద పిష్టపేషణం చేస్తూంటే బ్రతుకు బండలై పోదూ ?...

(పౌలోవ్ యింకా అక్కడే మొగంమూడ్చుకుని, అస్తవ్యస్తంగా కూర్చుని వుంటాడు. కొద్ది నిముషాల్లోనే యెన్నో యేళ్ళు పైబడ్డట్టు కానవస్తాడు. వర్వారా లోనికి ప్రవేశిస్తుంది.)

వర్వారా:- (కంఠం రుద్ధమై, వణుకుతూండగా.) డాక్టర్ పౌలోవ్ ! క్షమించండి. నేనిక్కడికి కొత్తదానను. ఏం చేయగలనో నాకే తెలియదు. కాని ఒక్కటిమాత్రం చెప్పగలను. అవసరమైతే యేకటాకీని పదిహేను గంటలుకూడ లేబొరేటరీలో కూర్చుని పని చేయగలను.

పౌలోవ్:- (ప్రకృతానికివస్తూ) ఓహో ! ఔనౌను ! బాగుంది. వందనాలు.

(జబేలిన్ ప్రవేశిస్తాడు. వర్వారాను ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుంటాడు.)

పౌలోవ్:- కుక్కలు తయారుగా వున్నాయా ? మనం యింక లేబొరేటరీకిపోదాం. దివ్యలోకాలనీ, దిబ్బాదిరుగుండమనీ,- అదంతా వదిలెయ్ ! (లేచి కిటికీతలుపులు మూస్తాడు.) కాలం వృథాచేస్తున్నాం. అయ్యో ! నా మతిమరుపు ! మీకిద్దరికీ పరిచయం చేయనేలేదు ! (వర్వారాను చూపుతూ)

ఈమె మన కొత్త అసిస్టెంటు, వర్వారా అంటొనోవ్నా ఇవానోవా. డాక్టర్ ఆఫ్ మెడిసిన్. (జబేలిన్‌ను చూపుతూ) డాక్టర్ లెవ్ జఖారోవిచ్ జబేలిన్. రీసెర్చి అసిస్టెంట్...... (వర్వారాతో) డాక్టర్! (కనబడీ కనబడని చిరునవ్వుతో) మన పని తెలుసా? కుక్కల లాలాజలాన్ని చుక్కల లెక్కని కట్టాల్సివస్తుంది! రోజులు, వారాలు, యేళ్ళు! అవసరమైతే పదీ, యిరవై యేళ్ళు కూడా! జ్వాక్ ప్రొసెస్ సంగతే! మనం గ్రహించాల్సింది యీ సంఘటనవల్ల యెంతేనావుంది...ఈ ప్రయత్నంలో మనం యేకాకులం కాకతప్పదు. లోకనిందకి గురికావచ్చు. కానీ. లోకం యెప్పటికేనా మనల్ని అర్థం చేసుకుని తీరుతుంది!

( నేపథ్యాన గీతాలాపన )

సత్యాన్వేషణలో సదమలమతులైనా
వారల కిడుములు తప్పవుగా
లోకనిందలుగా మిత్రవిరోధమున్
యెదురుకోవలె యదార్థవాదులు
వారిసూత్రముల్ లోకామోదము గాంచునంతనే
ఏ లోకాలోకములో నుందురో యెవరికెరుక?

# మూడో అంకం
## ఒకటో రంగం.

(1912 సంవత్సరం. ఇంగ్లాండులో కేంబ్రిడ్జి నగరం యూనివర్సిటీ ప్రాంతో ద్యానంలో ఊరేగింపు సాగుతూంటుంది. అల్లంతదవ్వులో ప్రాచీన శిల్పకళాశోభితమైన యూనివర్సిటీ భవనగోపురాలు గానవస్తున్నాయి. ఘంటానాదాలు గంభీరంగా, శ్రావ్యంగా వినిపిస్తున్నాయి. ఊరేగింపు ముందుభాగంలో వేత్రహస్తుడు వంది, ముగ్గురు పరిచారులతోను పరివేష్ఠితుడై ఛాన్సలర్ నడుస్తున్నాడు ఆ తర్వాత కొంతదూరంలో పౌలోవ్ యూనివర్సిటీ గౌను, టోపీ ధరించి, సహజమైన గమనవైఖరిలో విసవిస నడుస్తూంటాడు. సాంప్రదాయికంగా అతిమెల్లగా సాగేవూరేగింపుకూ, పౌలోవ్ నడకకూ లంగ రందడంలేదు. ఛాన్సలర్ మాటి మాటికీ వెనుదిరిగిచూస్తూ, తన గమనవేగాన్ని కూడ హెచ్చించాల్సివచ్చింది. వీరితోబాటు ఊరేగింపు పశ్చాద్భాగంకూడ వేగంతో సాగుతూంది. ఇట్టి వూరేగింపులు బహు మందగంభీర గమనంతో సాగడంమాత్రమే చూసిన ప్రొఫెసర్లు పండితులు, విద్యార్థులు ఆశ్చర్యపడుతూ, యెబ్బెట్టుగా నడుస్తూన్నారు. ఊరేగింపు సాగిపోయి సభాభవనంలో ప్రవేశిస్తుంది.

సభాంగణంలో గోథిక్ శిల్పదృశ్యాలు, ఛాన్సలర్ వాలుకుర్చీ కెదురుగా ప్రత్యేక వేదికమీద పౌలోవ్ నిల్చునివుంటాడు. ఒక డాక్టర్ లాటిన్ భాషలో, జీర్ణక్రియమీద పౌలోవ్ పరిశోధనలనూ, ఆయన ప్రతిభా పాండిత్యాలనూ పొగడుతూ అలంకారయుక్తంగా వుపన్యాసాన్ని చదువుతున్నాడు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం పౌలోవ్‌కు గౌరవ డాక్టరేట్ బిరుదప్రదానంచేసే సందర్భంలో యీ వుత్సవం జరుగుతూంది, పౌలోవ్ ఆందోళితుడైనట్లుంటాడు. సెరాఫిమా, వ్లాడిమిర్‌లు సభలో ముందువరసలో కూర్చుని వుంటారు.)

సెరాఫిమా:- (ఆతురతగా) వొలోద్యా! నాన్న అల్లావున్నారేమిట్రా ?

వ్లాడిమిర్:- (మెల్లగానే) అమ్మా! ఏమీ లేదులే. తన్ను పొగడటం ఆయన కిష్టంవుండదు. అంతకన్న మరేమీ వుండదు.

సెరాఫిమా:- ఏమోరా, నాయనా! తన వొంటిని గూర్చిన శ్రద్ధే లేదాయనకి. నాకదే భయంరా, బాబూ!

వ్లాడిమిర్:- ఫర్వాలేదమ్మా, ఆయనేం పిచ్చివాడనుకున్నావా?

(సభా కార్యక్రమం సక్రమంగానే సాగిపోతూంటుంది. ఉపన్యాసం పూర్తయేక ఛాన్సలర్ లేచి పాలోవ్ కరచాలనంచేస్తాడు. గౌరవ సూచకమైన చిరునవ్వుతో పాలోవ్ ప్రతి లాంఛనం చూపుతాడు. ఆయన కండ్లలోమాత్రం నిగూఢమైన హాసం తొంగిచూస్తూంది.

గ్యాలరీలమీద విద్యార్థులు క్రిక్కిరిసి వుంటారు. పాలోవ్ వేదిక దిగుతూండగా పైనుంచి తీగమీద ఒక బొచ్చుకుక్క బొమ్మ ఆయన ముందుకు దింపబడుతుంది దాని శరీరాన్నుంచి యెన్నోచోట్ల గాజుగొట్టాలు పొడుచుకు వచ్చి వుంటాయి. ఒకప్పుడు డార్విన్‌కి యీ విధంగానే కోతి బొమ్మని బహూకరించేరు. హర్షధ్వానాలమధ్య పాలోవ్ కుక్కను స్వీకరించి, విద్యార్థుల గ్యాలరీలవైపు కృతజ్ఞతాసూచకంగా హస్తచాలనం చేస్తాడు. పరిహాసపూర్వక హాసంతో, మౌనంగానే సంజ్ఞచేసి, కుక్క దౌడలోని లాలాగ్రంధిని మరిచేరని సూచించి, బైటికి నడుస్తాడు.

సెరాఫిమా, వ్లాడిమిర్‌లు బహు ప్రయాసతో గుంపులోంచి బైటపడతారు.

పాలోవ్ బస. యూనివర్సిటీకి చెందిన బహు ప్రాచీన భవనం అది. శిల్ప సౌందర్య దీపితమైన సున్నపుకట్టుబడి. ఏరెండు శతాబ్దాలక్రిందనో నిర్మించబడినదది. యూనివర్సిటీ ప్రదత్తమైన మొఖమల్‌గౌను, టోపీతోనే గదిలో అటునిటు పచారు చేస్తుంటాడు.

వ్లాడిమిర్:- నాన్నా! ఎందుకు నవ్వేరో చెప్పరూ?

పాలోవ్:- (చటుక్కున గుర్తొచ్చి, ఆదుస్తులు విప్పేస్తూ) ఎందుకంటావా? వాళ్లు లాలాగ్రంధినిగూర్చే మరిచి పోయేరు! (చకులిస్తూ) దాన్నిగూర్చి ఒక్కరికీ గుర్తున్నట్లు లేదు. ఒక్కమాట! కుక్క బొమ్మలోకూడా అది లేనేలేదు!

(విద్యార్థులిచ్చిన బొమ్మను వ్రేలితో చూపుతాడు.)

(తలుపుతట్టిన శబ్దం. అనుమతి తీసుకుని ముగ్గురు వృద్ధ ప్రొఫెసర్లు లోనికి ప్రవేశిస్తారు. ఎత్తైన మెడపట్టీలుధరించి, ఎత్తుటోపీలుతీసి చేతపట్టుకుని పండిత దర్శనార్థమై వచ్చిన వాళ్ళు శ్రద్ధాసక్తులతో గూడిన గౌరవపూర్వక వందనా లర్పిస్తారు.)

ఒక ప్రొఫెసర్:- మా హృదయపూర్వక అభివందనాలను స్వీకరించండి, మహాశయా! కేంబ్రిడ్జి భవనాలు న్యూయార్క్, డార్విన్ లకు సందర్శించి పునీతములైనాయి. ఇప్పుడీగౌరవం తమకు లభించింది. మీరు జీర్ణక్రియపై గావించిన...

పొలోవ్:- ప్రశంస అనవసరం, అయ్యా! కృతజ్ఞుణ్ణి...(టోపీ తీయ మరుస్తాడు. దైనందిన దుస్తుల్లో, డాక్టర్ టోపీలో విడ్డూరంగా కనబడతాడు.) జీర్ణక్రియనుగూర్చి నేనిప్పుడు పరాకునైనా ఆలోచించడమే లేదు! (భుజాలు కుంచించు కుంటూ) గత పదేళ్ళనుంచీ నేను మనోవ్యాపారాల్ని గూర్చే పని చేస్తున్నాను, తమ దయవల్ల!

( ఆ ప్రొఫెసర్లు ముఖముఖాలు చూచుకుంటారు. )

మొదటి ప్రొఫెసర్:- ఓ! రిఫ్లెక్సులా?...నిజం చెప్పాలంటే ఆ విషయాలు మా దేశంలో అంతగా ప్రజామోదాన్ని పొందుతా యనుకోను. భౌతికవాదం, చూచేరూ... (జాలిగా నవ్వుతాడు.)

(పాపం! అన్నట్లు యింకో ప్రొఫెసరూ నవ్వుతాడు. గాని మూడవ వ్యక్తి మర్యాదగా మౌనంగా వుంటాడు. ఇతడు ప్రొఫెసర్ బాయింగ్టన్.)

పొలోవ్:- (మర్యాదతో) ఔనౌను! కావచ్చులెండి. తప్పకండా మీ రనేది వాస్తవం కావచ్చు. (టోపీసంగతి

గుర్తొచ్చి, దాన్ని రెండువేళ్ళతో భద్రంగా తీసి, టేబిలు మీద గాజుకాయలా మెల్లగా వుంచుతాడు. టోపీమీద యేదో చిన్న నూలుపోగునుచూసి చిరునవ్వుతూ తీసేస్తాడు.)

( తలుపుతీసిన శబ్దం. రాజదూత ప్రవేశిస్తాడు. )

రాజదూత:- హీజ్ మెజస్టీ కింగ్ జార్జి మిమ్ములను బకింగ్‌హాం రాజప్రాసాదానికి రమ్మని ఆహ్వానిస్తూన్నారు.

పొలోవ్:- ఔనౌను! మరిచేపోయేను! (కుమారునితో మెల్లగా) ఆయన మనల్నెందుకాహ్వానిస్తూన్నారో బుర్ర బద్దలు కొట్టుకున్నా నాకేమీ అర్థంగావడమే లేదు! (అద్దం ముందు టై సరిచేసుకుంటూ ప్రొఫెసర్లతో) మీ రాజు గారికి శరీరశాస్త్రంలో ఆసక్తివుందా ?

( ఆంగ్లేయ ప్రొఫెసర్లు యీ ప్రశ్న విని, ఆయన వేషం చూసీలావుంది, అచ్చెరుబాటుతో చూస్తుంటారు. )

పొలోవ్:- మీ రాజుగారికి...ఏమిటి అల్లా చూస్తున్నారు ? నా వేషంలో యేమేనా పొరబాటుందా ?

ఆంగ్లప్రొఫెసర్లు:- (ఏకకంఠంగా) ఎత్తుటోపీ !

పొలోవ్:- (సంతోషంగా) ఓ ! అదా ! (చేతులుచాచి అభినయిస్తూ) నిజం చెప్పాలంటే నాకు యింకో టోపీయే లేదు ! నాకు అవేవీ అలవాటు లేదండీ.

ఒకటో ప్రొఫెసర్:- రాజుగారి దర్శనానికి బోయేవారు ప్రత్యేక దుస్తుల్లో బోవాలని నియమం వుంది.

పొలోవ్:- అలవాటైన వస్త్రధారణే నా నియమంలెండి. ఒకరి

కోసం వేషం మార్చడం... (టోపీధరించి, ద్వారందగ్గిరికి వెడుతూ కుమారుని చెవులో అంటాడు.) ఈ టోపీ ఐతే జీర్ణక్రియకి సరిపోదా? (పాలోవ్‌తోబాటు ఆంగ్లప్రొఫెసర్లు వెలుపలికివస్తారు. ఆయనకోసం వేచియున్న జోడుగుర్రాల బగ్గీవద్దకుపోయి, హఠాత్తుగా వెనుదిరిగి అడుగుతాడు.) ఏమండీ, మీ రేమంటారు? ప్రొఫెసర్ బూయింగ్టన్! నిబద్ధ మనోవ్యాపారాలున్నాయే, వాటివిషయంలో మీ అభిప్రాయం నాకు ముఖ్యంగా కావాలి. ఏమంటారు, మీరు!

ప్రొ. బూయింగ్టన్:- (ప్రశాంత స్వరంతో మెల్లగా ఆచి ఆచి మాట్లాడుతాడు.) మీ ప్రయోగాలు చాల కుతూహల జనకంగా వున్నాయి. ప్రస్తుతంమట్టుకు నా అభిప్రాయం యేమీ యివ్వజాలను. మౌనంగా వుండడమే నా అభిమతం.

పాలోవ్:- భేష్! బాగుంది!...'మాట బంతి మౌనం చామంతి' అన్నారు గదండీ! కాని, శాస్త్రవిజ్ఞాన విషయాల్లో యీ సామెతను అన్ని సందర్భాల్లోనూ వర్తింపజేయడం మంచిదీ గాదు, సరియైనదీగాదు. ప్రొఫెసర్ బూయింగ్టన్! మనం, శాస్త్రజ్ఞులం మౌనాన్ని హర్షించం గదండీ. (బగ్గీలోని కెక్కుతూ) మనం యే సిద్ధాంతాలనైనా ఆధారాల సహాయంతో ఋజువుచేస్తాం.

(బండివాడు చెబుకు ఝుళిపిస్తాడు. గుర్రాలు కదులుతూంటే పాలోవ్ బండి వెలుపలకు తలపెట్టి అరుస్తాడు.)

పాలోవ్:- ఆధారాలు! ఋజువులు! ఆధారాలు, ఋజువులు.

(ఆంగ్లరాజు ప్రక్కనే పౌలోవ్ టోపీతో నిలుచున్నట్లున్న ఫొటో పత్రికల్లో పడుతుంది. పిట్రోగ్రాడ్‌లో పత్రికలన్నీ దీన్ని ముద్రిస్తాయి. ఆ ఫొటోనే లేబొరేటరీ స్టాఫ్ గుంపులుగూడి చూస్తుంటారు. వాళ్ళ ముఖాలమీద చిరునవ్వులు. పౌలోవ్ హఠాత్తుగా అప్పుడే ప్రవేశిస్తాడు.)

పౌలోవ్:- ఏమిటండీ విశేషం? అయ్యా!

(పంతులును చూసిన బడిపిల్లల్లాగ అసిస్టెంట్లు కంగారు పడతారు. పౌలోవ్ టేబిల్‌దగ్గరికిబోయి ఫొటోనుతీసి జేబులో పెట్టుకుంటాడు.)

పౌలోవ్:- దీంట్లో నవ్వుకోడాని కేముందయ్యా? ముసలాడు యేవోటోపీ పెట్టుకుంటాడు, దానికేం?...(అంటూంటే కళ్ళలో కులాసా ద్యోతకమవుతుంది.)

---

## రెండో రంగం

(పిట్రోగ్రాడ్‌లోని ఓల్డెన్‌బర్గ్ యిన్‌స్టిట్యూట్ తాలూకు ఫిజియలాజికల్ లేబొరేటరీలో. కుక్క బోనులోవుంటుంది. వర్వారా యేదో ప్రయోగాన్ని గావిస్తూంటే యిద్దరు విద్యార్థులు గమనిస్తూంటారు. గోడగడియారం మెల్లగా టిక్ టిక్ మంటూంది. కుక్క కునికిపాట్లుపడ నారంభించుతుంది. హఠాత్తుగా ప్రక్కగదిలో కఠోరమైన బూరవూదినశబ్దం. కుక్క ఉలిక్కిపడి లేస్తుంది.)

వర్వారా:- డాక్టర్ జబేలిన్! ఇల్లాగైతే మా చెడ్డకష్టం సుమండీ. చచ్చిచెడి నిద్ర తెప్పించగలిగే సరికి తలప్రాణం తోకకివస్తూంది. అంతలో మీరా బూరవూదడం, అంతా మళ్ళా మొదటికి రావడం! బూడిదపోసిన పన్నీరనుకోండి.

డా. జబేలిన్:- (ఆకర్షణీయమైన చిరునవ్వుతో) నిర్మొగమాటంగా మాట్లాడ్డాన్ని నేను మెచ్చుకుంటానుగాని నా

పరిశోధనల్ని మానుకోలేనుగదా ? శోచనీయమైన పరిస్థితు లనుకోండి...

డా. వర్వారా:- అందర్నీ మీ బూరాధ్వనితో బెదరగొట్టక పోతే క్రిందమాళిగలో మీ ప్రయోగాలు సాగించరాదండీ?

జబేలిన్:- అదిమాత్రం ఖాళీగావుందా ?

వర్వారా:- ఇల్లాటి పరిస్థితుల్లో ప్రయోగాలు చేయడంఅసాధ్యం. డాక్టర్ పావ్లోవ్‌తో చెప్పేస్తాను...

( పావ్లోవ్ ప్రవేశిస్తాడు )

పావ్లోవ్:- ఏమని చెపుతావు, ఆయనతో ?

వర్వారా:- శబ్దరహితగోపురాలు లేనిదే మన ప్రయోగాలు సాగవని...

జబేలిన్:- (భుజాలు కుంచిస్తూ) పునాదు లేమో పడి చాలకాల మైంది. కాని డబ్బులేక పని నిలిచిపోయింది. చందా లివ్వ డానికి వర్తకులు వాయిదాలు వేస్తున్నారు, మంత్రివర్గం మూగనోము పట్టింది.

( నికోడిమ్ కర్రకాలుమీద కుంటుతూ, రెండు కుక్కల్ని గొలుసుతో తీసుకు వస్తుంటాడు. అతని గుండెలమీద సెంట్ జార్జిక్రాస్, మరికొన్ని మిలి టరీ పతకాలూ వుంటాయి. కొయ్యకాలూ, పతకాలూకూడ జపాన్ యుద్ధంలో నికోడిమ్‌కి లభించినవే. )

పావ్లోవ్:- (చిరాకుతో) ఇక నేనే వెళ్ళాలి ! వివిధదేశాల విద్యాలయాల సన్మానపరంపరలు పొంది సంతోషించనా ? శాస్త్ర పరిశోధనకై చందాలకాగితం పుచ్చుకుని ముష్టికి బైలుదేరాల్సి వచ్చినందుకు యేడవనా? రీసెర్చిట, రీసెర్చి!

( తలుపు దడాలునవేసి, బైటకి పోతాడు. )

# మూడో రంగం

( ఆరోగ్యశాఖా మంత్రి భవనాలు. ఇక్కడ ప్రధానాధికారి ప్రొఫెసర్ ఇవాన్ పిత్రిశ్చేవ్, పాలోవ్ సహపాఠి, మిత్రుడు. పాలోవ్ ఆఫీసులోకి విసవిస నడుస్తూ వస్తాడు. ఆయనముందు బంట్రోతు నడుస్తూంటాడు. పొడుగునా ఫైల్సులో మునిగివున్న గుమాస్తాలు, కార్యదర్శులు గమ్మున లేచి, ప్రశ్నార్థకంగా చూడడం బంట్రోతు జవాబివ్వడం జరుగుతూంటుంది.)

బంట్రోతు:- పెద్దదొరవారి దగ్గిరికి!

ఒక గుమాస్తా:- ఓహో!

*　　　*　　　*　　　*

బంట్రోతు:- పెద్దదొరవారి దగ్గిరికి.

మరో గుమాస్తా:- అల్లాగా!

( పాలోవ్ పెద్ద పెద్ద అంగలేస్తూ బంట్రోతు వెనకేనడుస్తూ, చివరకి పెద్ద దొరవారి ప్రైవేటు ఆఫీసుదగ్గరికి వస్తాడు. ఇక్కడ పెద్దదొర యెవరో గాదు. ప్రొఫెసర్ పిత్రిశ్చేవ్. పరిపుష్టమైన శరీరంమీద బిగుతైనకోటు, భుజకీర్తులు, పతకాలు ధరించివుంటాడు. పిత్రిశ్చేవ్‌ను చూసి ఆశ్చర్యంతో పాలోవ్ లోని కడుగిడతాడు. పిత్రిశ్చేవ్ సంతోష వికసితవదనుడై లేచివచ్చి పాలోవ్ కర స్పర్శచేసి వాలకుర్చీలో జబ్బలు పట్టుకుని ప్రీతితో కూలవేస్తాడు. )

పిత్రిశ్చేవ్:- ఇవాన్! చాల సంతోషంగావుంది నిన్ను చూడ్డానికి. నేనిక్కడికి వచ్చేనని నువ్వెరగవ్? నిజంగానే!... చూసేవుగా, యీ రోజుల్లో వుద్యోగమంటే ఖాతరే లేదనుకో! కాని, యేం జేస్తాం, చెప్పు... దానికేంగాని నిన్ను నేను మనఃపూర్వకంగా అభినందిస్తున్నా. మనవాళ్ళల్లోకి నువ్వే పైకిపోయింది! అకడమీషియన్! నోబెల్

లారేట్ ! కేంబ్రిడ్జి గౌరవ డాక్టరు ! ఇంకా యెన్నెన్నో ! ఓహోహో !

పావ్లోవ్:- (వెగటుగా చిరునవ్వుతూ) శబ్దరహిత గోపురాల నిర్మాణాన్ని గూర్చి, ధనసాహాయ్యాన్ని గూర్చి మంత్రివర్గానికి మెమోరాండం దాఖలుచేసి నేటి పై చిలుక అయింది. కాని

మిత్రిశ్చేవ్:- (అసమ్మతి సూచిస్తూ) ఏమిటి ? సరాసరి వ్యవహారమే ! వచ్చేవో లేదో అప్పుడే ? ఇవాన్ ! నిజంగా యిదేం బాగులేదుసుమా !...కాని, మాస్కో వర్తకులు మీకు డబ్బు పంపేరుగదూ ? లీడెన్‌టోస్నేవ్ సొసైటీ యిచ్చిన సబ్సిడీమాట నేననేది ?

పావ్లోవ్:- నేనడిగేది, మంత్రివర్గం యీ విషయమై మౌనంగా యెందుకుంది ? అనే. (తిరస్కారంగా) రష్యన్ సామ్రాజ్యంలో శాస్త్రవిజ్ఞానం వర్తకుల దగ్గరికి ముష్టికోసం దేబిరిస్తూ యెందుకు పోవాలి ?

మిత్రిశ్చేవ్:- (బెదురుతో కంగారుపడుతూ చేతులు త్రిప్పుతూ) ష్!...ఇవాన్ ! నువ్వెప్పటిలాగే వున్నావు!...అంత ఓరిమి లేకపోతే యెల్లాగ ? (చేతులు గుంజెల కదుముకుంటూ మృదువుగా చిరునవ్వుతూ). నా చేతులోవుంటే నీకోసం యేదైనా చేస్తాననుకో. కాని, యిప్పుడేం లాభంలేదు. సాధ్యం గాదనే చెప్పాలి. (అంతా అయిపోయిందన్నట్లు చేతులు త్రిప్పుతూ) ప్రతివాడూ నీకు వ్యతిరేకమే ఐతే !

పౌలోవ్:- ప్రతివాడూ అంటే ?

పిత్రిశ్చేవ్:- (వ్రేళ్లుమడిచి లెక్కిస్తూ) యుద్ధశాఖ- మిలిటరీ మెడికల్ అకాడమీ డైరక్టరుకి నీపేరేగిట్టదు !...విద్యా శాఖ-రెండు ! మంత్రికే పేర్లుపెట్టేవుట ! నీకు స్వంత అభిప్రాయా లున్నాయట !... జీవకారుణ్యసంఘం—మూడు ! జంతువులపట్ల క్రూరత్వాన్ని నిరోధించే యీ సంఘానికి రాజకుటుంబంతో సన్నిహితసంబంధం వుందని అందరూ యెరిగినదేగదా ?...ఆఖరికి, మెడికల్ అసోసియేషన్‌కూడా నీకు పచ్చి వ్యతిరేకం ! అందులో నీగురించి త్వరలో నే చర్చ వస్తుందనుకుంటున్నారు...స్నేహితుణ్ణి గనక ముందే చెపుతూన్నా. జాగ్రత ! తుపానులో తెరచాపయెత్తి పోతూన్నావు సుమా ! ఏ క్షణంలోనైనా బుడుంగు మన వచ్చును...ఔననుకో, నువ్వు అకడమీషియన్‌వే ! డాక్టర్ నోబెల్ లారెయేట్,-యింకా యేన్నో వున్నాయే అను... కాని, నీకుమాత్రం తెలియందేముంది ? వాళ్ళందరికీ వ్యతిరేకంగా నే నేమీ చేయలేను !

పౌలోవ్:- ఇన్నిమాట లెందుకు ? ప్రభుత్వం డబ్బేమీ యివ్వబోవడం లేదని చెప్పరాదూ ? ఈ ముఖ మిచ్చకపుమాట లెందుకు ? దయచేసి వూరుకోండి !

పిత్రిశ్చేవ్:- నీపద్ధతి నాకేం బాగులేదు, ఇవాన్ ! నాకు చాలా అన్యాయం చేస్తున్నావు. నువ్వింత అమాయికుడివేమిటి ?

ఈ రోజుల్లో మనోవ్యాపారాలూ, శబ్దరహిత గోపురాలూ యెవరిక్కావాలంటా? దేశాన్నంతనీ కొత్తకెరటాలు వూపేస్తున్నాయి! 1905 విప్లవం జ్ఞాపకం వస్తూంది. ఎక్కడ చూసినా వాతావరణం గందరగోళంగా వుంది! ఇల్లాంటి సమయంలో నువ్వేమో గుళ్లూ గోపురాలూ అంటావు!

పావ్లోవ్:- నీవనే దేమిటో నాకర్థంగావటంలేదు. నేనేం విప్లవకారుణ్ణి కాదే!

పిత్రిశ్చేవ్:- అంతకన్నా అధ్వాన్నం! నీ పరిశోధనలూ, సిద్ధాంతాలూ సమాజపు పునాదుల్నే కూలద్రోసేవని అందరూ అనుకుంటున్నారు! శచినోవ్‌కి యేగతిపట్టిందో తెలుసునుగాదూ? నీకూ దాదాపు ఆ మహోత్సవమే జరుగుతుందని గుర్తుంచుకో. నీమేలు కోరినవాణ్ణిగనక చెపుతున్నా, విను. ఇప్పుడు యెటువంటి గందరగోళాలూ లేవదీయకు! ఇంగ్లాండులోకూడా నీపెంకితనం చూపించకండా రాలేదుటగా?... నీకు సత్యమేగదూ కావాల్సింది? బాగుంది, దానికేం? సత్యాన్నే ఆరాధించు! ఒక్కడవూ వున్నప్పుడు 'సత్యం'తో నేస్తంకట్టు! ఇది బహిరంగంగా 'సత్యం'తో ఊరేగాల్సినకాలం గాదనుకో! నీకు తెలియందేముంది? నీ సత్యాన్ని నీతో జేబులోపెట్టుకుని తిరుగుతూండవోయ్, ఎవరొద్దన్నారు?

(పావ్లోవ్ కళ్ళు నిప్పులుకురుస్తూంటే, ఒక్క వురుకున లేచి నిలుచుంటాడు. పిడికిళ్ళుబిగించి, బొడుగరచి, భీకరంగా వుంటాడు. యువకుడుగా వున్నపుడే

అతని నీవైఖరిలో చూసేం. పాలోవ్‌నుచూస్తూ పిత్రిశ్చేవ్ గ్లాసునిండా నీళ్ళు పోసుకుని గడగడా త్రాగేస్తాడు.)

పౌలోవ్:- నా ప్రయోగాల్ని బహిరంగంగా ప్రదర్శిస్తాను. తమరు దయచేసి, అక్కడికివచ్చి కాదనమని సవాలు చేస్తున్నాను!

(పిత్రిశ్చేవ్ శూన్యదృష్టితో, మౌనంగావుంటాడు. పాలోవ్ బైటికిపోతూ నెగడిదగ్గరి కట్టెలప్రోగునుచూసి ఆగుతాడు.)

పౌలోవ్:- (జుగుప్సతో) నీయిష్టం వచ్చినట్లు పొయిలోకి కట్టెలు త్రోసెయ్! నీ కలలన్నీ నిజాలైనాయి!

(తలుపు దడాలునవేసి వెళ్ళిపోతాడు. ఆఫీసు వుద్యోగులు రిచ్చపోయి, నోట మాట లేకండా, ఒకరిముఖాలొకరు చూచుకుంటారు.)

---

## నాలుగో రంగం

(నీవానదీతీరాన్నే ఒక వీధిలో పాలోవ్ నడుస్తూంటాడు. ఆవలిగట్టున ఒక పెద్ద ఫాక్టరీ. గేటువద్ద వేలాదిగా కూలీలు గుంపులు గుంపులుగావుంటారు. ఫాక్టరీ బిగ్గరగా ఈలలు వేస్తుంది. నది వంతెనమీంచి అశ్వారూఢులైన కోసక్కులు దౌడుతీస్తూ పోతూన్నారు. సాయంతన దీపకాంతుల్లో నీవానదీనీరములు మిలమిల మెరుస్తూ ప్రవహిస్తూన్నాయి. టక టక టక మంటూన్న రింఖాధ్వనులువిని, పాలోవ్ వెనుదిరిగి వాళ్ళవైపు చూస్తాడు.)

పౌలోవ్:- ఎక్కడికి పోతున్నారు కోసక్కులు ?

వీధిపోవువాడు:-అల్లదిగో! ఆవలిగట్టున ఫాక్టరీలేదూ? దాంట్లో కూలీలు సమ్మె చేస్తున్నారు, అక్కడికి.

పావ్లోవ్ మళ్ళీ నాలుగడుగులువేసి, ఒక గోడమీద అంటించిన పోస్టరు చదువుతాడు. ప్రొఫెసర్ జ్వాన్ ట్సేవ్ 'ఆత్మ-శక్తి' అను విషయాన్నిగూర్చి మాట్లాడుతారు. కవిపుంగవులు ఎఫ్. సొలోగుబ్, డి. మెరిఝొవ్‌స్కీ, జడ్. గిప్పియస్ లు కావ్యపఠనం గావిస్తారు. రాసియిచ్చిన ప్రశ్నలకు జవాబు లీయబడును... ప్రవేశరుసుం మూడు రూబుళ్ళు. పావ్లోవ్ తలెత్తి చూస్తాడు. జ్వాన్ ట్సేవ్ నీటైన దుస్తులు ధరించి, చుట్టూ సీతాకోక చిలుకలవంటి తరుణులు పరివేష్టించిరా ఒక భవనంలో ప్రవేశిస్తూంటాడు. అభవనద్వారంమీద 'సాహిత్య, తాత్త్వికసమాజం' అని రాసివుంది.)

పావ్లోవ్ :- (బిగ్గరగా) భేష్ ! ప్రొఫెసర్ జ్వాన్ ట్సేవ్ !

(జ్వాన్ ట్సేవ్ మాటాడకండా, మొగం చాటువేసుకుని లోపకిపోతాడు. పావ్లోవ్ పోస్టరును మళ్ళీ చూస్తూ నిల్చుని, తలపంకించి, చిరునవ్వుతో భవన ద్వారంలోంచి లోనికి పోతాడు. హాలులో జనం క్రిక్కిరిసి వుంటారు. బలిసిన పురుషులు, ఆకు చిలుకల్లాంటి తరుణులు. వేదికమీద బొద్దుగా, పొట్టిగావున్న సొలోగుబ్ కావ్యపఠనం చేస్తుంటాడు.)

సొలోగుబ్ :—

మనం మరణించేం, యేనాడో మరణించేం,
మృత్యుదేవత విశ్వమంతటా మసలుతూంది,
రెండుచేతులా దుఃఖదురదృష్టాల్ని చల్లుతూ,
వలలూ వాగురలూ నిరంతరం విసురుతూ,
మానవమస్తిష్కాలచుట్టూ మసలక అలియక.

(ద్వారంలో నిలబడి పావ్లోవ్ చేతులు జేబుల్లోపెట్టుకుని వుంటాడు. అతని ముఖంలో కుతూహల జుగుప్సలు సమ్మిళితమై వుంటాయి. సభలో హర్షధ్వానాలు. కాస్త సద్దడగగనే పావ్లోవ్ గొంతు స్పష్టంగా వినబడుతుంది.)

పావ్లోవ్ :- ఎందుకూ ? ఇదంతా వట్టిచెత్త ! వాగుడు ! సంధి ప్రలాపాలు ! ప్రయోజన ప్రవృత్తి (Purposive reflex)

పూరాగా లోపించింది. నీకు చికిత్స అవసరం! (భుజాలు కుంచిస్తూ) అబ్బే! కుక్కలే నయం! ఎప్పుడైనా సరే!

(అక్కడక్కడ సభికులు లేచి నిలుచుంటారు.)

చాల కంఠాలు:- ఎవరది?...ఎవరది?...

ఎవరో:- పౌలోవ్!...అకడమీషియన్ పౌలోవ్!

(కాని, పౌలోవ్ అప్పటికే వెళ్ళిపోయేడు.)

---

## ఐదో రంగం

(పిత్రోగ్రాడ్‌లో మెడికల్ అసోసియేషన్ హాలు కిక్కిరిసి వుంటుంది. విద్యార్థులు గ్యాలరీమీద వుంటారు. ఒకప్రక్క జ్యాన్‌చ్చేవ్. అతని ప్రక్కన అమూల్యవసనాల్లో ఒక విలాసిని; వారిచుట్టూ ఆత్మవాదులైన పెద్దమనుష్యులు కొందరూ కూర్చునివుంటారు. వేదికపై ప్రయోగసాధనాలు.)

పౌలోవ్:- (వేదికమీదించి) మనో వ్యాపారాల్నిగూర్చి పరిశోధనలు ప్రారంభించినపుడే, మాడ్రిడ్ సైన్సు కాంగ్రెస్ రోజుల్లోనే మేము చెప్పేము, భౌతికములైన నరముల కదలికల వల్లనే మనోవ్యాపారాలనబడేవన్నీ జరుగుతున్నాయని. అది ఆచరణలో, దిక్కులావచ్ఛిన్నంగా యెల్లా వుంటుందో మీ యెదుట ప్రదర్శిస్తున్నాము.

(సభలో కలకలం. గ్యాలరీలోని విద్యార్థులెవరో అరుస్తారు: "నిశ్శబ్దం! దయచేసి నిశ్శబ్దంగా వుండండి. ఇదేం నాటకంగాను!" మొదటి వరుసలో కూర్చున్న ప్రొఫెసర్ పిత్రిశ్చేవ్ చెవిలో ప్రక్కనుంచి యెవరో మెల్లగా అంటారు: "ఇక సహించబోమండీ, అయ్యా! చాలు, యిదే అవధి! తిమిర్యజేవ్ మొక్కలకి ఆత్మలేదని నిరాకరించేడు. సరే పోనీ, అది సహించి వూరు

కున్నా మనుకోండి! కొంచెం బాధకలిగినా!....కాని, యిప్పుడో, యీ యన గారు తగుదునమ్మా యని బైలుదేరి జంతువులకే ఆత్మ లేదని త్రోసిపుచ్చుతూ న్నాడు!....అయ్యయ్యో! ఖర్మ! మానవజాతికేమి దుర్గతి పడుతూందండీ, బాబూ! మనం యెక్కడికి బోతున్నామో, దేవుడా!" పిత్రిశ్చేవ్ తల పంకిస్తాడు. సవిచారంగా.)

విలాసిని:- (జ్వాన్ శ్చేవ్‌తో మెల్లగా) ఏం దిక్కుమాలిన సిద్ధాంతాలో, బాబూ, యివి! ఆలోచించిచూస్తే మనం మాత్రం జంతువులం గాదూ? ఆయనగారు చెప్పిందిచూస్తే, నాకూ ఆత్మ లేదంటున్నట్లే, మరి! ఏమండీ! మీరూ అల్లాగే అంటారుటండీ?

జ్వాన్‌శ్చేవ్:- (పొడిచేసేట్లు చూస్తూ) ఊరుకోలేవూ, త్రైలి యకపోతే!

విలాసిని:- (సణుగుతూ) జ్వాన్‌శ్చేవ్! కోపం దేనికి? మీరూ ఆత్మ వుందనేగా చెపుతూంటారు, మీ వుపన్యాసాల్లో? (కిమ్మనడు.)

(నికోడిమ్ కుంటుతూ, కుక్కబోనును త్రోసుకుంటూ వేదిక మీదకు వస్తాడు. కుక్క ప్రశాంతంగా సభను చూస్తుంటుంది.)

పాలోవ్:- (వేదికమీద బిగ్గరగా) ప్రశాంత ప్రకృతిగల యీ ప్రాణిని చూసేరుగదా! 'ప్రచోదితప్రవృత్తి' Conditioned reflex అంటే యేమిటో మీరు యిప్పుడు స్పష్టంగా చూడగలరు. ఈ కుక్క మనసులో భావాలు అద్దంలోకి వలె స్పష్టంగా కనిపిస్తాయి.

(ఆత్మవాదులైన పెద్దమనుష్యులు కూర్చున్న ప్రాంతాన్నుంచి యెవరో వ్యంగ్యంగా,- 'అలౌకిక విశేషాలేవో యివాళ చూస్తామన్నమాట!' అంటారు.)

పాలోవ్:- పెద్దలు ! కావాలంటే మీరట్లాగే అనండి! డాక్టర్ వర్వ్యారా ఇవానోవా యిప్పుడీ ప్రయోగాన్ని ప్రారంభిస్తారు.

(పారోవ్ వేదిక దిగుతాడు. క్రింద జబేలిన్, వర్వ్యారా, మరికొందరు అసిస్టెంట్లు వుంటారు.)

వర్వ్యారా:- (పాలోవ్‌తో) ఏమండీ, డాక్టర్ జబేలిన్ చేస్తేనేం? (జబేలిన్‌వైపు తల వూపుతుంది.)

పాలోవ్:- దయచేసి, చెప్పినట్లు చెయ్యి!

వర్వ్యారా:- (మారుమాటాడక వేదిక నెక్కుతూ) ఈ ప్రయోగ సందర్భంలో మనం కుక్క యొక్క మెదడు యెంత సున్నితమైందో చూస్తాం. కుక్కలచర్మం అతి సున్నితమైన ఫొటో తెరలాంటిది. చర్మంమీది ప్రతి సూక్ష్మస్థానమూ నరముల మూలంగా మెదడుతో అనుబంధించబడి వుంటుంది. చర్మం మీద యెక్కడ, యెంతటి సూక్ష్మతరమైన తాకిడి తగిలినా, అది తక్షణమే మెదడుకి గొంపోబడుతుంది. దానికి జవాబుగా అవసరమైన ప్రతిక్రియ (reaction) వెంటనే జరుగుతుంది...ఇదిగో! ఇక్కడ స్పర్శాసాధనాలు మూడిటిని అమర్చేము. మీటు నొక్కితే యిందులో యేదైనా కుక్క మెడమకాలిని స్పృశిస్తుంది...(వాటిని అమరుస్తుంది.) పైదీ మధ్యదీకూడ కుక్కకి తిండిబెట్టేటపుడు తాకించడం మామూలు. అంటే వాటిని తాకించడం, తిండిబెట్టడం అలవాటు చేసేము. అందుచే అవి లాలాగ్రంధికి వుద్రేకాన్ని, స్రావాన్ని కలిగిస్తాయి. యిప్పుడు మీరే చూస్తారు.

(వర్వారా స్పర్శాసాధనాల్లో పైదాన్ని కుక్కకాలిని తాకునట్లు చేస్తుంది. వెంటనే కుక్క నోటినుంచి లాలాజలంపూరి, ప్రవహించ నారంభిస్తుంది)

వర్వారా:- మధ్య సాధనంకూడ యిదే ఫలితాన్ని యిస్తుంది.
(తాకిస్తుంది. అదే ఫలితం కనబడుతుంది.)

(సభికులంతా శ్రద్ధతో నిశ్శబ్దంగా నిరీక్షిస్తుంటారు.)

వర్వారా:- కాని, మూడోదివుండే, క్రింది స్పర్శాసాధనంవుండే, దీనిని మే మెప్పుడూ తిండిబెట్టడంతో అనుబంధించి వుపయోగించి వుండలేదు. పై పెచ్చు తిండి బెట్టకపోడంతో దీనికి సంబంధంవుంది. అందుచే లాలాజలోత్పాదకమైన ప్రతిక్రియలకి యిది నిషేధకంగా కూడవుంది...

(సభలో సనాతనులు కూర్చున్నచోట గుసగుసలు.)

మొకటి ఆత్మవాది:- దీంట్లో విశేషమేముందంటా? ఆహారం కోసం వేచియున్నకుక్క యీ గుర్తుల్ని గుర్తుచుకుని, సహజ జ్ఞానంతో నోట నీరూరజేస్తుంది. అట్లాగే క్రింది స్పర్శాసాధనం తాకితే తిండి వుండదని దానికిగుర్తే. అందు చేత లాలాజలం వూరదు. సర్వసాధారణంగా అందరికీ తెలిసిన దీనికి పెద్ద పెద్ద పేర్లూ, ప్రయోగాలూ, ప్రదర్శనలూ యెందుకు? ప్రచోదిత ప్రవృత్తిట! పుట్టుప్రవృత్తిక! ఈ కండిషన్డ్ రిఫ్లెక్సులూ గట్రాతో ప్రమేయం లేకండానే యెవడికైనా యీ విషయం తెలుస్తుంది గాదుటండీ?

రెండో పెద్దమనిషి:- భేష్! బాగా సెలవిచ్చేరు. అరటిపండొలిచి చేతబెట్టినట్లే చెప్పేరండీ, మీారు. జంతుస్వభావజ్ఞులకి యిది సువిదితమే గదండీ!

పాలోవ్:- (ఆ పెద్దమనుష్యుల సంభాషణవిని ఎగిరిగంతేస్తాడు.) బాగా చెప్పేరండీ, అయ్యా, మీరు! కాని, యిది మీ రనుకున్నంత సులభంగాదు. చూస్తారుగా? ఇదిగో! యిప్పుడీ...(వర్వారాతో) దయచేసి యీ ప్రయోగాన్ని పూర్తిగా కొనసాగించు...

వర్వారా:- ఈ మూడో స్పర్శాసాధనాన్ని తాకిస్తే, కుక్క నోట్లోంచి ఒక్కచుక్క లాలాజలంకూడా రాదు. ఇప్పుడు మీరే చూసేరుగా? కాని, యిక్కడ యింకోచిత్రం వుంది. ఈ మధ్య సాధనాన్నికూడా పనిచేయకండా చేయగలం, చూడండి!

(మధ్య స్పర్శాసాధనాన్ని తాకిస్తుంది. ఒక్కచుక్క లాలాజలంకూడ రాదు. సభలో అచ్చెరుపాటు.)

వర్వారా:- కాని, యీ పై సాధనంమాత్ర మింకా పనిచేస్తుంది. (పై స్పర్శకాను తాకిస్తుంది. లాలాజలం పుష్కలంగా ప్రవహించ నారంభిస్తుంది.)

పాలోవ్:- పదిహేను సెకండ్లలో యీ పై సాధనంకూడా కార్యకారి గాకుండపోతుంది. చూడండయ్యా! గడియారాలు చూస్తుండండి!

(సభికులు చాలమంది గడియారాలు చూస్తూ, చిరునవ్వు నవ్వుతూంటారు. సెకండ్లు గడుస్తూన్నాయి.)

పాలోవ్:- పై సాధనాన్ని తాకించు!

(వర్వారా పై స్పర్శకును తాకించుతుంది. ఒక్కచుక్క లాలాజలంకూడ వూరదు. ఆమె సభవైపు చిరునవ్వుతో చూస్తూంటుంది.)

పౌలోవ్:- అంతేగాదు. మళ్ళీ యిరవై సెకండ్లలోనే లాలా గ్రంథిని పనిచేయిస్తా. చూస్తుండండి.

(చాలమంది ఆశ్చర్యంతో లేచి, వేదికచుట్టూ మూగుతారు. ఇరవై సెకండ్లు గడుస్తాయి.)

పౌలోవ్:- (గడియారంచూస్తూ) తాకించు !

(పౌలోవ్ వశ్యవాక్కు ! ఆయన ఆజ్ఞాబద్ధమైనట్లు లాలాజలం వెంటనే ప్రవహిస్తుంది. అచ్చెరుబాటుతో సభికులు నిశ్చేష్టులౌతారు. ఆత్మవాదుల్లో గడబిడ బైలుదేరుతుంది. పౌలోవ్ వేదికమీదికెక్కి వర్వారా చేతిని చాలనచేస్తాడు, అభినందిస్తూ.)

పౌలోవ్:- (విజయసూచకంగా) ఏం ? బాగుందాండి? మీరు దీని కేమంటారో చెప్పండి ? అయ్యలారా !

(కనుకట్టు గట్టినట్లుగా హాలంతా నిశ్శబ్దం.)

పౌలోవ్:- (ఆత్మవాదులవైపు మొగమై) ఏమండయ్యా! కథానాయకులు మీరూ వూరుకున్నారేమిటి ?

ఒక ఆత్మవాది:- ఆఁ! దీంట్లో యేముంది ? సింగినాదం జీలకర్రాను !

పౌలోవ్: బోలెడంత వుందండీ! శరీరశాస్త్రజ్ఞులు మాత్రం యీ సంఘటననంత తేలికగా చూడలేరు. దీనికి వ్యాఖ్యానాన్ని యివ్వగలం, మేము. మెదడుయొక్క వ్యాపారాల్లో ముఖ్యమైన, పరస్పర విరుద్ధమైన భాగాలున్నాయి. అవే మంటే ఉద్రేకం, ఉపశమనం; లేదా ప్రవృత్తి, నివృత్తి, అనచ్చు. ఇవి రెండూ నిరంతరం సంఘర్షిస్తూంటాయి. మెదడుయొక్క వెలుపలిభాగమంతా సూక్ష్మాతి సూక్ష్మ

మైన కణములతో (cells) నిండివుంటుంది. ఇదే మేధోత్వచ లేక కార్టెక్స్, ఇదే మనోవ్యాపారాలన్నిటికీ స్థానం. ఈ మేధోత్వక్‌లోని కణములను కదలించడం ద్వారానే ప్రతి బహిః ప్రేరణా కూడా ప్రవృత్తి-నివృత్తులలో దేన్నో ఒక దాన్ని కలిగిస్తూంది. పై రెండు స్పృక్కులవల్లా కలిగిన ఆహార ప్రతీక్షోద్రేకాన్ని మూడో స్పృక్కు నుపయోగించడం ద్వారా వుపశమనంగావించ యత్నించేము. ఆ భావం మేధోత్వచ మీదికి వ్యాపించడానికి కొంతవ్యవధి అవసరం. ఈ నివృత్తి, ఉపశమనం మేధోత్వచను ఆసీమాంతం ఆక్రమించుతుంది. అప్పుడు ఆహారప్రవృత్తిని కలిగించే యేస్పృక్కూ పనిచేయదు. అదే జరిగిందికూడాను. వుద్రేకం కలగలేదు. కాని, క్షణికములలెక్కను ఉపశమన తరంగం వెనక తగ్గుతుంది. అప్పుడు మళ్ళీ వుద్రేకతరంగానికి అవకాశం కలిగింది. మీాది స్పృక్కులు తిరిగీ ఉద్రేకాన్ని ప్రేరేపించగలిగినాయి...మహాజనులంతా యీా మనోవ్యాపారాల ఉద్రేకోపశమనాల్ని ప్రత్యక్షంగా చూసివున్నారు. ఉపశమన తరంగంచేత గ్రసించబడిన ఉద్రేక వ్యాపకప్రాంతాలు తిరిగి విడుదలైనతోడనే పై స్పృక్కులు ఆహారోద్రేకాన్నీ, దానితో బాటు లాలాజలోత్సర్గాన్నీ ప్రేరేపించగలిగినాయి. దీనిలో అందరికీస్పష్టంగా తెలుస్తూన్నాయిగదా! బహిః ప్రేరేపణలు జ్ఞానేంద్రియములద్వారా మేధోత్వచమీాద ఉద్రేకోపశమనాల్ని కలిగించి, ప్రాణుల నాయాపనులు,

కర్మలు చేసేట్లు ప్రేరేపించుతున్నాయని... దీనిలో ఆత్మ, దైవాంశ, అదృష్టం మొదలైనవేవీ లేవు! దీనికేమంటారు, పెద్దలు ?

(సభలో హర్షం. విద్యార్థుల గ్యాలరీలనుంచి మరింత పెద్దపెట్టున కరతాళ ధ్వనులు వస్తాయి. ముందువరుసలోని ముగ్గురు మరీను. వారిలో ఒకడు రేగిన జుట్టుతో, బాల్కనీ మీదికివంగి, వుద్రేకంగా సంతోషధ్వానాలు గావిస్తూంటాడు.)

ఒక ఆత్మవాది:- అబ్బే! నమ్మేటందుకు వీలుగాలేదు. (తన తర్కంలోని బలహీనతను గ్రహించినవాసివలె దృఢంగా పునరుద్ఘాటిస్తూ) హేతుబద్ధంగా లేదు, యిదంతా!

మరొకడు:- ఏమో? మీరు కొరడా నుపయోగించలేదని మాకు నమ్మకమేమిటి? రోజూ అభ్యాసంచేయిస్తే సరిపోతుందంతే!

ఇంకో పెద్దమనిషి:- (కోపావహాస్యలతో) ఓసోస్సి! బైలుదేరే రండీ, మొనగాళ్లు! సిగ్గూ శరమూ లేకపోతేసరి. అత్యద్భుతమైన పరిశీలన, ప్రయోగాలుయిస్తే గ్రహించే తెలివి వుండొద్దూ? ఎద్దుకేం తెలుస్తుంది అటుకులరుచి!

జ్వాశ్చేన్స్:- (శివమూగుతూ) ఐతే యేమిటి? ఏమిటంటా? (క్రోధావేశంతో) వీటివల్ల ఋజువయేదేమిటి? చెప్పండీ, చూద్దాం. మామూలు సాంకేతికమేనా! ఇంకేమేనా వుందా? అందులోనూ శునకసాంకేతికాలు! ఇక యిందులో మనోతత్త్వమనేదే లేదనీ, యిదంతా కేవలం భౌతిక కార్యక్రమమనీ నిశ్చయించేందుకు మీరెవరంటా? బుద్ధిహీను

లంతా చేరితే యింతకంటె మంచిఫలితా లేంవస్తాయి ? జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందట ! విజ్ఞాన శాస్త్రజ్ఞులకు అవమానం, తలవంపు !

పాలోవ్:- మనోవ్యాపారాల్ని ఆనవెట్టగల సాధనాన్ని కనిపెట్టడం అవమానకరమా ? ఈ సాధనాల సాయంతో. మనం త్వరలోనే అలసట, శ్రమ, నిద్ర,-యివంటే యేమిటో కూడా తెలుసుకో బోతున్నాం ! మానవుని బుద్ధివికాసానికి, పరిశీలనకి నూతన రంగాల్లో విజయం సాధించడం, తత్ప్రయత్నంచేయడం అవమానకరమా ? మానవుకు తన ప్రకృతినీ, స్వభావప్రవర్తనలనీ, వాటి మూలకారణ-చోదకశక్తుల్నీ అన్వేషణా విషయంగా గ్రహించడం అవమానమా ? కాదు, కాదు. మనోకేంద్రం ద్వారానే మానవుల రోగాల్ని నివారణచేసే దినం దగ్గరలోనే వుందని నేను చెప్పగలను ! ఈ విసృష్టి యంతట్లోకీ మహోన్నతమూ, క్లిష్టతరమూ యైన మానవ మస్తిష్కమును విచక్షణాయుతంగా వుపయోగించడంద్వారా రోగాల్నీ, దుఃఖాన్నీ, శ్రమనూ తొలగించుకోగల మార్గం మానవుని యెదుట తెరిచివుంది ! అహో ! ఎట్టి ఉజ్వలభవిష్యత్తు ! దీన్నేనా మీరు అవమానకరమని అంటున్నది ? అబ్బే ! కాదండయ్యా ! అదిగాదు అవమానకరమైనది ! మీలాంటివాళ్లు విజ్ఞానశాస్త్ర పరిశోధనారంగానికి చెందినవాళ్ళనేదే అసలు అవమాన కరమైనది !...

(తుపానులా హర్షధ్వానాలు.)

జ్వాన్ట్సేవ్:- అసమ్మతిగా మేము యీ సభనుంచి వెళ్ళిపోతున్నాం. (చుట్టూ వున్నవాళ్ళతో) లేవండి! మనం బైటికి పోదాం!

తలనెరసిన ఆత్మవాది:- ఈశ్వరదత్తమైన బుద్ధిని పెడమార్గాల్లో పెట్టినవాళ్ళకి నరకమేగతి! మనం యిక్కడుండకూడదు. రాండి!

(జ్వాన్ట్సేవ్, పిత్రిశ్చేవ్‌లు కొందరు అనుయాయులతోసహా దర్పంగా నడుస్తూ, బైటికిపోతారు. మిగిలినజనం లేచి వేదికచుట్టూ మూగుతారు. విద్యార్థులూ, గడ్డాలుపండిన వృద్ధ శాస్త్రజ్ఞులూ పావ్లోవ్‌ను పరివేష్టించి అభినందిస్తూంటారు.)

---

## ఆరో రంగం

(పిత్రోగ్రాడ్ నగరంలో ఫిజియలాజికల్ ఇన్‌స్టిట్యూట్ ముందరి పూలతోట. 1912 సంవత్సరం వసంతఋతువు. పావ్లోవ్ ప్రదర్శనానికి వచ్చిన ముగ్గురు విద్యార్థులూ భవనంవైపు నడుస్తుంటారు. చింపిరిజుట్టూ, పొడుగ్గా సన్నగా వంగిన శరీరంగల విద్యార్థి ముందున్నాడు. అతని దుస్తులుకూడ సాదావే.)

మొదటి విద్యార్థి:- (ముందున్న చింపిరిజుట్టువానితో) ఇల్లా చూడు! సెమ్యోనోవ్! పావ్లోవ్‌కి యీ అవమానం యెంత బాధగావుంటుందో?

సెమ్యోనోవ్:- వినాశోన్ముఖంగా పోతూన్న సమాజంలోని ప్రతీపశక్తులింకేమిచేస్తాయి! విజ్ఞానులమని విర్రవీగేవాళ్ళే

యీ విధంగా ప్రవర్తించడం లజ్జాకరం. అకడమీషియన్ పౌలోవ్‌నే అవమానించిన వీళ్ళు యింకేమిచేయరంటా?

రెండో విద్యార్థి:- మెడికల్ అసోసియేషన్‌కు పన్నిండేళ్ళుగా యీయనేటగా అధ్యక్షుడు! యావత్ రష్యాలోనూ అత్యుత్తమ శ్రేణికిచెందిన...

మొదటి విద్యార్థి:- రష్యాలోనే అన్నమాటేమిటి? ప్రపంచమంతా పౌలోవ్ ప్రతిభ గుర్తించింది! జీర్ణక్రియాపరిశోధనకే యీయనకి నోబెల్ బహుమతినిచ్చి అప్పుడే యెనిమిదేళ్ళుగావచ్చింది! మనోవ్యాపారాలమీద యీయన పరిశోధనలు అశ్రుత పూర్వములూ, అనన్యములూను!

సెమ్యోనోవ్:- మిత్రులారా! రష్యన్ యువకులు, మేధావులు దీన్ని సహించరని మనం చాటాలి. విజ్ఞానరంగంలో ప్రతీప శక్తులు యెన్నటికీ విజయం పొందలేవు. ఆయనకి మన భావాలు తెలియజేసి...

మొదటి విద్యార్థి:- కామ్రేడ్ సెమ్యోనోవ్! ఆయన స్వభావం నువ్వెరుగుదువుగా? నాకు భయంగానే వుందిసుమా...

సెమ్యోనోవ్:- ఏం ఫర్వాలేదులేవోయ్! ఆలోచించి మనమందరం ఒకనిశ్చయానికి రానేవచ్చేంగదా. దీన్ని ఆఖరుకంటా చూడాల్సిందే, యింక!

(లోనికి ప్రవేశిస్తాడు. హాలులో అసిస్టెంట్లు గుమిగూడి వుంటారు. వాళ్ళ చేతుల్లో నాటి దినపత్రిక 'యూస్కి యీవిసో మోస్తీ' చేతులు మారుతూంది.)

ఒక అసిస్టెంటు:- వీళ్ళ వరసయేమీ బాగాలేదు. పావ్లోవ్‌నే! లోకమంతా మెచ్చేవరకూ మనవాళ్ళకు మెలుకువ రానే రాదు, అసలు. ఇప్పుడు లోకమంతా మెచ్చిన విజ్ఞానినే అవమానం చేసేరు! మన దేశానికేమిగతి పట్టనుందోయ్, భగవంతుడా!

జబేలిన్:- (ప్రవేశిస్తూ, వర్వారాతో) ఎవరో విద్యార్థులు వచ్చేరు. పావ్లోవ్‌ను సందర్శించాలంటున్నారు. ఇప్పుడు అవకాశం వుంటుందంటావా? డెలిగేషనుగా వచ్చేరట!

అసిస్టెంటు:- (లాభంలేదన్నట్లు చేతులెగరేస్తూ) చస్తూంటే సంధిమంత్రంలావుంది! మధ్యలో యిదొకటా? పానకంలో పుడకలా! ఇప్పుడేమీ వీలుండదని చెప్పండి, జబేలిన్!

జబేలిన్:- వాళ్ళు వినడంలేదండీ, యెంతచెప్పినా. తమ సానుభూతిని చూపితేగాని యిక్కణ్ణుంచి కదలమంటున్నారు.

అసిస్టెంటు:- ఆయనిప్పుడు ఆఫీసులో వున్నారు. కళ్ళజోడు తీసేరుకూడాను. దానిలో విశేషం మీకు తెలుసుగా? కళ్ళద్దాలు తుడుస్తూ పక్కా అరగంటవరకూ...

వర్వారా:- (ఏదో వుపాయంతట్టి) ఇదిగో! నే చెపుతానుండండి ఒక సాసరు కావాలి!

(టీ టేబిల్‌మీంచి ఒక సాసరు తీసుకుని, గబగబ పావ్లోవ్ గది దగ్గరికి పోయి, తాళం సందులోంచి చూస్తుంది. అసిస్టెంట్లందరూ ఆమెను వెంబడిస్తారు. వర్వారా దృఢనిశ్చయంతో తలుపు తెరుస్తుంది. పావ్లోవ్ చిరచిరలాడుతూ ధూమ్రమాక్షుడై కుర్చీలో కూలబడి, కళ్ళజోడు తుడుస్తూ పరధ్యానంగా వుంటాడు.)

పౌలోవ్: (వర్వారాను చూచి కోపం, చిరాకుతో) నన్ను కదిలించవద్దని చెప్పలేదూ ?

(వర్వారా వున్నట్టుండి సాసరును విసిరిపుచ్చుకుని నేలమీద కొడుతుంది. సాసరు భళ్ళుమని తునాతునకలై పోతుంది.)

పౌలోవ్:- ఏమిటి ? ఏమిటది ? మతి పోయిందా?...

వర్వారా:- (ధైర్యంతో) మీరు నివృత్త మనోప్రవృత్తి క్రమం వల్ల వ్యగ్రులై వున్నారు. హఠాత్తుగా వుద్రేక కారణాన్ని కల్పించేందుకే నేనీ పని చేసేను !

(వర్వారా సాసరు ముక్కలను సూచిస్తుంది. పౌలోవ్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూస్తూ, ఒక్కమాటుండి నవ్వ నారంభిస్తాడు. కళ్ళనీళ్ళు వచ్చేలా ఆదేపనిగా నవ్వుతూ, చేతు లెగిరేస్తూ)

పౌలోవ్:- హ్హాఁ ! హ్హాఁ ! హ్హాఁ ! ఏం పిచ్చిమనిషయ్యా !

వర్వారా:- డాక్టర్ పౌలోవ్ ! విద్యార్థి డెలిగేషన్ మీ దర్శనం కోరుతున్నారు. అనుమతికై నిరీక్షిస్తున్నారు.

పౌలోవ్:- ఎవరు రమ్మన్నారు ? వెళ్ళు, అవకాశం లేదు ! నేను లేనని...

వర్వారా:- మీరున్నారని వాళ్ళతో చెప్పేస్తేనే !

పౌలోవ్:- (కోపంగా) ఎవరా చెప్పింది ? ఎవరు?...

వర్వారా:- నేనేనండీ. అనుకున్నాను గదా...

పౌలోవ్:- (శాంతిస్తూ) నువ్వెప్పుడూ యేదో ఒకటి అనుకుంటూనే వుంటావు... నడు, వస్తున్నా.

(హాలులోకి వచ్చి విద్యార్థుల్ని సమీపించి పలకరిస్తాడు)

పావ్లోవ్:- (కటువుగా) ఏమండీ! అయ్యా! ఏమిటి సంగతి? ఎందుకు వచ్చేరు?

(ఈ ధోరణి చూసి విద్యార్థులు కంగారుపడతారు. దీన్ని స్వాగతమనడానికి వీల్లేదు గదా!)

సెమ్యోనోవ్:- (సంబాళించుకుని) డాక్టర్ పావ్లోవ్! పిట్రో గ్రాడ్ విద్యార్థి సంస్థల తరఫున వచ్చేము. మీరు లేబొరే టరీ నిర్మిస్తున్నారని విన్నాం. మరేమో మీకు... ఆఁ! అదేమిటంటే... ధధధ... ధనలోపం ఆటంకంగా వుందని తెలిసింది.

పావ్లోవ్:- తెలిస్తే యేమిటి? (కనుబొమలు ముడేస్తాడు.)

సెమ్యోనోవ్:- మే మందరం చందాలు వేయించేమండీ... ఇదిగో! చందా పట్టీ. ఇదిగో... (జేబులోంచి ఓ కవరు తీసి చాచుతాడు. కాని 'డబ్బు' అనేందుకు మాత్రం తట పటాయిస్తాడు.)

పావ్లోవ్:- (బెదరింపుగా) చందా వేయించారా? మీరు? అల్లాగేం? ఓయిబాబో! ఎవరిచ్చేరండీ, అయ్యా! మీకీ అధికారం?

సెమ్యోనోవ్:- (లజ్జిస్తూన్నట్లు) మీకు కోపం వస్తుందనుకో లేదు. అధికారం యెవరూ యివ్వలేదు. మా అంతట మేమే చేసేం. మీకు ధనం లేదనీ, ప్రభుత్వం సాయంచెయ్యడం లేదనీ, అందరూ వ్యతిరేకంగా వున్నారనీ విన్నాం. పరిస్థితు

లన్నీ మాకు అర్థం అయినాయి. దయచేసి తీసుకోండి! డాక్టర్ పౌలోవ్! (కవరు జాచుతాడు.)

పౌలోవ్:- వందనాలు. కృతజ్ఞుణ్ణి. (కంఠం డగ్గుత్తిక పడగా సవరించుకుంటూ) నా హృదయపూర్వకంగా మిమ్మల్ని అభినందిస్తున్నా. కాని, మీ డబ్బు తీసికోజాలను. క్షమించాలి! విద్యార్థుల డబ్బంటే యేమిటో నాకూ తెలుసు! ...చందా పట్టీని మాత్రం యిల్లా యివ్వండి. అది కావాలి నాకు! పెన్నిధిగా భద్రపరుచుకోదగిందది! ఛాత్రవాళ్ళ యెప్పుడూ అభ్యుదయ...

సెమ్యోనోవ్:-(ఈ పొగడ్తకు మొగ మోడుతూ) మేమందరం మీకు అండగా నిలవాలని... యెంతో వాంఛిస్తూన్నాము. మీ రొక్కరూ లోకంయొక్క ఔదాసీన్యాన్నీ, తిరస్కారాన్నీ కూడా లెక్కజేయకండా గావిస్తూన్న...

పౌలోవ్:- (చిరునవ్వు నవ్వుతూ) అబ్బెబ్బే! అదేం లేదు. మీరేమిటి? మెడికల్ విద్యార్థా?

సెమ్యోనోవ్:- ఔను!

పౌలోవ్:- బాగుంది! విద్య పూర్తిగావించేక రాండి. మా లేబొరేటరీ తలుపులు తెరుచుకుని వుంటాయి, మీవంటి యువకులకోసం. మీ కప్పుడు తోడ్పడేందుకు నాకు చాల సంతోషంగా వుంటుంది. తప్పక వస్తారు గదూ?

(కరచాలనం చేసి, సెలవిచ్చి పంపుతాడు. వెళ్ళిపోతున్న విద్యార్థులవైపు చూస్తూంటే ఆ మహావిజ్ఞాని ముఖంమీద మార్దవ ప్రేమభావాలు ముప్పిరిగొంటాయి. వర్వారా ఆయనవైపు చిరునవ్వుతో చూస్తూ నిల్చుంటుంది.)

పావ్లోవ్:- (తనలో మాట్లాడుకుంటున్నట్లు) పిత్రిశ్చేవ్ యిప్పు డుంటే బాగుండేది! రష్యా! రష్యా జీవించి వున్నది, వీళ్ళ ల్లోనే! మెడికల్ అసోసియేషన్ట! సిగ్గు సిగ్గు!

(వర్వారా తానక్కడున్నట్లు సూచిస్తూ కొంచెం దగ్గుతుంది.)

పావ్లోవ్:- వర్వారా! చూసేవా? మనం యేకాకులమనీ, వ్యతి రేక ప్రపంచంలో మన లేబొరేటరీ చిన్న లంకవంటిదనీ అనిపించి, ఒకక్కప్పుడు నిస్పృహ కలుగుతూంటుంది. మన దేశంలో యిప్పుడు స్వేచ్ఛగా వూపిరి పీల్చేందుకే లేదు! నాలుగు గోడలమధ్య పారేసినట్లుగా, కదల వీలు లేనట్లుగా వుంటూంది. పావ్లోవ్‌ని మెడికల్ అసోసియేషన్ నుంచి వెళ్ళగొట్టి, అవమానించేరు! భేష్! ఇంకేంగావాలి! ఇది చాలదన్నట్లు యే ఘనతాలేని అబ్రహామన్, దూడూ బస వన్నవంటి ఇవాణాలు దినమంతా చూడవచ్చే ప్రేక్షకులతో, పెద్దమనుష్యులతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు! యథా రాజా తథాప్రజా! ఆహా! ఏమిలోకం! అంతా గతాను గతికం కదా!... కాని, యీ కుర్రాళ్ళున్నారే, యిప్పుడు వచ్చినవాళ్లు!... వాళ్ళని తీసుకురావడం చాల మంచిదే అయిందిలే. యువశక్తి పురోగామిగా వుండితీరుతుంది! మానవజాతి ఆశలన్నీ ముందుతరంమీదే వుంటాయి... (సాలోచనగా) ఏమో, ఎంతకాలమని నువ్వుమాత్రం యీ వ్యతిరేకత నెదుర్కొంటూ యిక్కడుంటావ్? బహుశా,

దానివల్ల నీ భవిష్యత్తు అంధకారమయ మవుతుందేమో? ఎవరు చెప్పగలరు? మేఘాల్ని నమ్ముకుని చెరువుకట్ట తెగ్గొట్టుకునే మందబుద్ధి యెక్కడా వుండడు. నువ్వుకూడా నన్నూ, నా లేబొరేటరీనీ వదలిపెట్టి వెళ్ళిపోయే దినం దగ్గర లోనే వుందేమో? ఈ చెత్త పత్రికల్లో అకడమీషియన్ పౌలోవ్ వట్టి మూర్ఖుడనీ, ముసలితనంతో మతిచెడ్డవాడనీ, ఆయన సిద్ధాంతాలు రాద్ధాంతాలనీ రాసి, ప్రకటిస్తావేమో నువ్వుకూడా !!...

వర్వారా:- డాక్టర్ పౌలోవ్! (నిష్ఠురంగా) ఎందుకల్లా అనుకుంటున్నారు? అన్యాయంగా...

(ఆమె స్వరంలో అమాయిక ఆవేదన, హృదయపూర్వకమైన సానుభూతి ధ్వనిస్తాయి. పౌలోవ్ చకితుడై ఆమెవైపు చూస్తూ విస్తుపోతాడు. వర్వారా కూడ కంగారు పడుతుంది.)

పౌలోవ్:- పొరబాటేనేమో? కాని, ఏమో, అంతనిశ్చయంగా యేదీ చెప్పద్దు!

వర్వారా:- నాలో యే దౌర్బల్యాన్ని చూచి యిల్లా అంటున్నారు? మీరింత కఠినంగా మాట్లాడ్డం...

(నికోడిమ్ లోపలికి ప్రవేశిస్తాడు.)

నికోడిమ్:- ప్రొఫెసర్ జ్వాన్ ట్సేవ్ మిమ్మల్ని చూడాలంటున్నారు.

పౌలోవ్:- (ఆశ్చర్యంతో) ఏమిటీ, నికోడిమ్! జ్వాన్ ట్సేవా? ఏం కావాలంటాడు? ఎందుకొచ్చేడు?

నికోడిమ్:-అవన్నీ నేను చెప్పలేను. కాని, వచ్చినవారు ఆయనే అని మాత్రం చెప్పగలను.

పావ్లోవ్:- (కౌతూహలంతో) బాగుంది. ఔనులే. ఆయన్ని లోనికి పంపించు. వెళ్ళు.

(నికోడిమ్ నిష్క్రమిస్తాడు. ఆ వెంటనే జ్వాన్ ట్స్ వ్ ప్రవేశిస్తాడు. వర్వారాను చూచి విస్తుబోతాడు.)

జ్వాన్ ట్స్ వ్:- నేను మిమ్మల్ని యేకాంతంగా కలిసికొని, మాట్లాడాలనుకున్నా. క్షమించండి.

(పావ్లోవ్ గతుక్కుమని భుజాలు కుంచించుకుంటాడు. వర్వారా బైటికి వెడుతుంది. జ్వాన్ ట్స్ వ్ టేబిలు దగ్గర కుర్చీలో కూర్చుని యెదురుగా శూన్య దృష్టితో చూస్తుంటాడు.)

పావ్లోవ్:- (ఆశ్చర్యంతో అతన్నిచూస్తూ) క్షమించండి, నేను కొంచెం తొందర పనిలో...

జ్వాన్ ట్స్ వ్:- (మైకంనుంచి బైట పడుతూన్నట్లు) ఔనౌను! మిమ్మల్ని యిబ్బంది బెట్టకపోయేవాణ్ణే! కాని, మీతో మాట్లాడ్డం అత్యవసరమని తోచింది... మీకు తెలియదు గాని నేను మిమ్మల్ని వదలిపోయినప్పటినుంచీకూడా మీ వైపే నా మనసు ఆకర్షించబడి పోతూంది... మీ సిద్ధాంతాలు, బోధనలు, ప్రయోగాలు! అవే నా కళ్ళకి గట్టినట్లూ, మనసులో మెదులుతూన్నట్లూ! నా జీవితం ఒక పెద్ద కలలా వుందనుకోండి!... మీరు నన్ను ఆకర్షించి...

పావ్లోవ్:- నాకేం అర్ధంగావడం లేదు, మీ ధోరణి!... నేను

అగాధపు టంచున నిలబడ్డానసీ, నా కోసం మీ జీవితాన్ని పాడుచేసుకోసనీ మీరు అని యెంతో కాలం కాలేదే! ఇంత లోకే రాగం మారడానికి...

జ్వాన్ ట్స్వెవ్:- అబ్బే! అందులో యేముంది? (ఏం లేదన్నట్లు చేతితో అభినయిస్తూ చిరునవ్వుతో) అది నాలో చిరకాలంగా చెలరేగుతూన్న రెండు భావాలమధ్య కడపటి వివాదం లెండి! నేనో భ్రమలో మునిగి కొట్టుకుంటుండేవాణ్ణి. దాన్ని మీ వాదనలు యిప్పుడు పటాపంచలు చేసేసేయి. మీదే పై చెయ్యి అయింది! మీ మహాపాండిత్యం, విజ్ఞానం ముందు ప్రణమిల్లుతున్నా, మహాత్మా! గలిలియోను తలదన్నిన వారు, మీరు.

పాలోవ్:- ఏమిటీ ధోరణి? ఏమిటంటా?

జ్వాన్ ట్స్వెవ్:- విశ్వమంతా ఓ బ్రహ్మాండమైన గందరగోళం! అందులో మానవుడున్నాడే, అతడు కేవలం కొన్ని కణాల ప్రోగు. అంతేగాదూ! అటువంటప్పుడు యిక మంచీ చెడ్డా, పాపం పుణ్యం అనేదేముంది? మహా వేదాంతియేగానీ, చెంబులు దొంగిలించేవాడే గానీ,- యిద్దరికీ భేదంఏముంది? కాని, చిరకాలంనుంచీ అలవాటుపడి, శల్యగతమై వున్న భావాలున్నాయే వాటినుంచి విముక్తిపొందడం మాటలు గాదు! మానవుడు! మానవత్వం! ప్రేమ, ఆత్మ! ఎల్లాంటి గంభీరమైన ఉదాత్తమైన మాటలు! వాటి నన్నిటినీ దులి

వేసేను. ఆ సిద్ధాంతాలన్నీ పెంటపోగుమీద పారేయాలి! మీ భావాలు బాగా అర్థం అయినాయి. మనిషి మరేమీ గాదు, రెండుకాళ్ళ జంతువు. కేవలం యంత్రం, కణాల ప్రోగు! అంతేనా? అంగీకరించడం కష్టమే అనుకోండి. ఐనా, నేను మీ వాదనల నర్థంచేసుకోగలిగేను.

పావ్లోవ్:- (విస్మితుడై, తిరస్కారంగా) నీకేమీ అర్థంగానే లేదని చెప్పగలను! జ్వాక్ఞేస్సన్! ఈ అనంత ప్రకృతిలో అనన్యమూ, అసదృశమూ నైన ప్రాణి మానవుడు! జీవ పరిణామంలో మహోన్నత శిఖరాగ్రవర్తి మానవుడు! ఆత డమరుడు! జీవం అమృతం! జీవంలాగే జీవికూడా ఆద్యంత రహితుడు! ప్రతిజీవి తన జాతిలోనే అనండి, మృత్యు వినాశరహితమైనది!... మీ రేమనుకున్నా నాకేం అభ్యంతరం లేదు! మీరు చెంబులు దొంగిలిస్తూనే వుండచ్చు! దానికేం? అది మీ యిష్టం!...

జ్వాన్స్సన్:- (అదాటుగా లేస్తూ) ఏమిటి మీరనేది? మానవుడు అమరుడా? అర్థంలేని చెత్త! ఆద్యంతరహితంట! భోషాణంగాదూ? ఎవడో మతిచెడి వాగినమాటలు పట్టుకుని మానవజాతి యిప్పటిదాకా ఊరేగుతూంది! ఎవడబ్బా, యీ మతిలేని మాటలు కనిపెట్టింది? ఆశ్చర్యంవేస్తుంది, అంతా చిలకల్లా యీ పలుకులే వల్లెవేస్తుంటే! ఎవరి దాకానో యెందుకు? మీ తిన్న మీరే ఆ మాటలు నమ్మ

రుగా ?... నా దగ్గర ఆవిషయం అంగీకరించేందుకు మొగ మోంటుతున్నారంతే! కదూ, డాక్టర్ పౌలోవ్ ! మానవ జాతీ, మానవత్వం,- ఎక్కడున్నాయి? ఏదైనా వుందీఅంటే అది ఒక్క మానవ వ్యక్తి! అంతే. మానవు డెప్పుడూ యేకాకి! పురిటింటినుంచి కాటివరకూ! సుఖం అనేది కేవలం ఆభాస మాత్రమే! మీవంటి మహా విజ్ఞానవేత్తను అందరూ చేరి అవమానపరిచి యింకా యెన్నోదినాలు కానిదే? అప్పుడే మరిచేరా? ఇంకా మానవత్వం అంటూ యెక్కడుందంటూ? (అట్టహాసం చేస్తాడు.) ... మీరే మానవత్వాన్నిగూర్చి మెచ్చుకోవడం? ఛూ! అంతా వట్టి కాకుల మూక! నూటా నాటా ఒక్కొక్క కోకిల!... కాకులన్నీ చేరి కోకిలని గోలచేస్తాయి. మీరుమాత్రం సుఖ సున్నానని చెప్పగలరా? అబ్బే! వట్టిది!... అయ్యో! మీరు నా దగ్గర దాపరికమా? ఏకాకి మేధావులూ - అసంఖ్యాకమైన మడ్డి మూక,- యిదే లోకమంటే!... మిమ్మల్ని నాకు గురుతుల్యులుగా అభినందిస్తున్నా. ఇదిగో నా చేయి! (జాచుతాడు.)

పౌలోవ్:- (రెండుచేతులూం వెనక్కి పెట్టేసుకుంటూం) జ్యాన్ క్రేన్! ఎంత విచారకరం! మీరెల్లా పతనమయేరో, యెంత అధోగతికి వచ్చేరో అనూహ్యంగా వుంది!... మీరు పడిపోతూ, మీతో బాటు లోకాన్ని కూడా అధో

గతికి లాక్కుపోవాలని చూస్తున్నట్లుంది! కాకుల్లో కోకిలట! సింగినాదం జీలకర్రా!... ప్రపంచమంతా కళ్ళకి గట్టినట్లు కనిపిస్తూంటే! మీకు మనోవైకల్యం యేర్పడింది. అంతే. వేర్వేరు ఆలోచనలనీ, విషయాలనీ సమీకరణ చేసుకోలేని మానసికవ్యాధి, యిది! పైగా మానవాతీతుడుగా నటించడమా? ఛీఛీ!. ఇందులోనా మీకు మనసు బుట్టింది! చవట తర్జుమాచేసుకున్న చచ్చు సాహిత్యం లాంటి పేలవమైనదిది!...

జ్వాక్ ల్సేవ్:- పేలవమైనదా? మరేది ఉదాత్తమైనదని అడుగుతున్నా?... మీరు పిరికిబారేరు! స్వేచ్ఛా యిచ్ఛ అనేది వుందని మీకు నేను ఋజువుచేస్తా? తెలిసిందా? అప్పుడు గాని మీకు నమ్మకం కలగదు! మేధలోనే స్వేచ్ఛా యిచ్ఛ వుంది! మూకలో అదీ లేదు- యిదీ లేదు!...

(ఉద్రుతంగా బైటికిపోతాడు. ఇంతసేపటినుంచీ జ్వాన్ ల్సేవ్ సిగరెట్టు కాలుస్తూండడంవల్ల గదంతా పొగతో నిండివుంటుంది. పావ్లోవ్ లేచి వెళ్ళి కిటికీ తలుపుల బార్లాతెరుస్తాడు. తోటలోని చెట్లన్నీ వసంతాగమనంతో చిగిర్చి, రొట్ట దొడిగి, సూర్యరశ్మిలో తానమాడుతున్నాయి. ప్రకృతిఅంతా ఉబికివచ్చే జీవోల్బణంతో సచైతన్యమై వుంటుంది. ఇంతసేపటినుంచీ ఉక్కిరిబిక్కిరి అవుతూన్నట్లున్న పావ్లోవ్ ముఖం యీ దృశ్యం చూచి వికసిస్తుంది. ఆ క్షణంలోనే తోటలో రివాల్వరు ప్రేలిన శబ్దం. పావ్లోవ్ ముఖంమీద విషాదాశ్చర్యాలు. దూరంలో కొందరు పొదరింటివైపు పరుగెత్తుతూంటారు. తలుపు తెరుచుకుని నికోడిమ్ ప్రవేశిస్తాడు.)

నికోడిమ్:- డాక్టర్ పావ్లోవ్! భయంకరమైన ఆత్మహత్య జరిగిపోయింది! దారుణం! అయ్యయ్యో! జ్వాక్ ల్సేవ్...

పాలోవ్:- ఏమిటీ? అనుకుంటూనే వున్నా! అతనికి మతి భ్రమణం... (అకస్మాత్తుగా ఆయన ముఖంలో కాఠిన్యం, నిష్ఠురతా గానవస్తాయి.)

(వర్వారా, అసిస్టెంట్లు ప్రవేశిస్తారు. అందరిదృష్టులూ పాలోవ్‌మీదే వుంటాయి.)

వర్వారా:- (సంభ్రమంతో) డాక్టర్ పాలోవ్! స్వేచ్ఛాయిచ్ఛ (Free-will) వుందని ఋజువుచేసేందుకే, మానవులమీద ప్రతీకారం తీసుకొనేందుకే ఆయన...

పాలోవ్:- (కటువుగా) అఖ్ఖర్లేదు! నాకంతా తెలుసు. మూర్ఖుడు! దౌర్భాగ్యుడు! అవాచ్యుడు! ప్రతీకారం యెవరిమీద? ఎందుకోసం?... మానవజాతి యెవరికోసం ఆగదు! ముందుకే సాగిపోతుంది. జీవిత సూత్రం అదే. గుండె తాళనివాళ్ళు, మతి భ్రమసినవాళ్లూ పోతే పోనీ!... (ప్రశాంతంగా) మనం ప్రారంభిద్దాం. అంతా సిద్ధంగావుందా?

వర్వారా:- ఆc! అంతా సిద్ధంచేసేను. లాలాగ్రంధికి రబ్బరు బల్బు, సిరెంజి అమర్చేను.

పాలోవ్:- (వర్వారాలో యేమైనా బలహీనత గానవస్తుందా అని పరిశీలనగా చూస్తూ) ఊc!

వర్వారా:- (ఆయన భావం గ్రహించినట్లు) మనం ప్రారంభించుదాం. నడవండి!

పాలోవ్:- (మనోభారం తొలగినట్లు) నడు!

(వర్వారా వెనకే పాలోవ్ నిష్క్రమిస్తాడు.)

---

## ఏడో రంగం

(1918 సం. నవంబరు నెల. పిట్రోగ్రాడ్ నగరంలో వాసిలేవ్‌స్కీ లంక మీద పొలోవ్ గృహం. దూరంలో నీవానదీ, అటునిటు పోవు స్టీమర్లూ గాన వస్తుంటాయి. గదిలో టేబిల్ దగ్గర పొలోవ్, సెరాఫిమాలు కూర్చుని వుంటారు. పొలోవ్ పేషెన్స్ ఆడుతూంటాడు.)

సెరాఫిమా:- వాన్యా! మళ్ళీ తప్పుముక్కే వేసేరు!

పొలోవ్:- ఛేస్! ఇంక ఆడను. (ముక్కలు కలిపేసి, ప్రక్కకి త్రోసేస్తాడు.)

సెరాఫిమా :- ఏం? మానేసేరేమి?

పొలోవ్:- (అలసిపోయినట్లు) అబ్బే! ఏం లేదు, సీమా! ప్రియతమా!...

సెరాఫిమా:- మీ మనసు నాకు తెలుసు, వాన్యా!

పొలోవ్:- జ్వానోవ్ వక్తి గందరగోళం మనిషి! నిశ్చితాభిప్రాయాలూ, నిలకడా లేవు. తెలివితేటలూ, వివేచనాశక్తీ గలిగివున్న మానవుణ్ణి యేకాకిగా వదలడంలో చాల ప్రమాదం వుందనుకో అతనికీ, యితరులకీ కూడా! అతడందుకనే విరక్తుడై, తెగించేడు. ఈ ప్రపంచంలో సమాజంలో నాఅంతవాడు లేడనుకొని, తన అహంభావమునే ఆరాధించుకుంటూన్నవాడికి, యింతకంటె భయంకరమైన దేముంది? తనను యెవరూ ఖాతరుచేయడమే లేదనీ, తన భావాలకి అసలు విలువే లేదనీ గ్రహించడంతోనే పిడుగు మొత్తినట్లై విమూఢుడైపోతాడు!... అదే ఆత్మహత్యకి

పాల్పడేట్లు చేసింది. ఇదీ మానసిక వ్యాధే అంటా......
అక్కడేవుంది కిటుకు !...

(లేచి కిటికీలోంచి బైటికిచూస్తూ పరధ్యానంగా నిల్చుంటాడు. సెరాఫిమా వెనకాలే వెళ్ళి అతణ్ణి కాగలించుకుంటుంది.)

సెరాఫిమా:- వాన్యా! ప్రియతమా! మీవంటి దయాశీలురు, నిష్కపటులు, క్షమాశీలురు అరుకు! అందరూ సుఖులై వుండాలనేదే మీ రేప్పుడూ త్రికరణయా వాంఛిస్తుంటారు. నాకు తెలుసు...

పౌలోవ్:- గ్రహించేవో లేదోగాని, సీమా! ఆతనిమనసులో యితరులంటే యెంతమాత్రం సానుభూతి లేదు. పాపభీతి... ఎవరెల్లా పోతేనేం, నేను బాగావుండాలి అనే చూసేను. వేదాంతికీ, దొంగకీ భేదమేమిటి ? అనే ఆధ్యాత్మికవాది ! కాని... సీమా! మనం మానవులం... అటువంటి శుష్క వాదనలని గాని, అవి వుపదేశించే శుష్క వేదాంతులను గాని వీసమెత్తుకూడ లక్ష్యపెట్టం !

(వాలుకుర్చీ దగ్గిరికివెళ్ళి కూర్చుని, యేవో కాగితాలు తీసి చూస్తూంటాడు. సెరాఫిమా అతని వెనకవైపున నిల్చుంటుంది, కాని అతడు వెనకదిరిగి చూడకండా, పనిచూసుకుంటూంటాడు.)

సెరాఫిమా:- మీలో ఎంత దయవుందో అంత కాఠిన్యంకూడా వుంది ! ఎంత నిష్ఠురులు !... (వెళ్ళిపోతుంది.)

పౌలోవ్:- సీమా !... సీమా !...

(కాని సెరాఫిమా అప్పటికే గుమ్మందాటి, తలుపు మూసేసింది. పౌలోవ్ యాంత్రికంగా కాగితాలు చూస్తుంటాడు.)

పొలోవ్:- (పొలోచనుడై, సణుగుతూ) సత్యం అతి కఠిన మైంది. అది బలహీనుల్ని చంపేస్తుంది! అప్పుడింక సత్యం, విజ్ఞానం కావాల్సినవాళ్లెక్కడుంటారో? విజ్ఞాన ప్రయోజన మెవరికో?...

(బైట ఫిరంగి కాల్పులు వినవస్తాయి. దూరంలో కాల్పుల వెలుతురులో నీవానదిలోని యుద్ధనౌకలూ, శరత్ప్రాసాదపు (winter-palace) గోపురాలూ నీడబొమ్మల్లా కనిపిస్తూంటాయి. అంతలో జబేలిన్ ప్రవేశిస్తాడు.)

జబేలిన్:- (వందనంచేస్తూ) డాక్టర్ పొలోవ్! ఇవేళటి ప్రయోగం విఫలమైపోయింది! మన కుక్కల్లో శ్రేష్ఠమై నది అదే!... ఏం జరుగుతూందో విన్నారా?... (మళ్ళీ ఫిరంగుల ధ్వనులు)

పొలోవ్:- (బొమలు ముడేసి) చెడ్డకాపరానికింకా ముప్పేముం దంటారు!...

(వర్వారా ఆయాసపడుతూ కంగారుగా ప్రవేశిస్తుంది.)

వర్వారా:- నగరంలో తిరుగుబాటు వచ్చేసిందిట! ఈసారి బోల్షివిక్కులు... (తొందరలో టోపీతీయడం మరిచిపోతుంది.)

పొలోవ్:- (కలువుగా, మందలింపుస్వరంతో) టోపీతియ్యి! మర్యాదాతిక్రమణ ఏ పరిస్థితుల్లోనూ క్షంతవ్యంగాదు!

వర్వారా:- (టోపీతీసి చేతబట్టుకుంటూ) క్షమించండి, డాక్టర్ పొలోవ్!

(పొలోవ్ నిల్చుని, దూరాన్నుంచి వినవచ్చే ఫిరంగుల ధ్వనులు వింటూం టాడు. కిటికీల అద్దాలు అదురుతూంటాయి. ధ్వనికి.)

పౌలోవ్:- (ఆలోచనగా, ఒత్తిఒత్తి పలుకుతూ) మనకి సంబంధించినంతవరకు యివన్నీ ప్రయోగాలకు అడ్డువచ్చే యాదృచ్ఛిక సంఘటనలు! (చేతులు కట్టుకుని నిల్చుంటాడు. వున్నట్లుండి కోపంగా, ప్రవాహంగా మాట్లాడనారంభిస్తాడు.) తిరుగుబాటా? కెరెన్స్కీ మీదేనా? పోనీలే, పీడ వదులుతుందిలే. ఇతగాడు చేసిందేముంది? యుద్ధరంగమంతా కుక్కలు చింపిన విస్తరిలా చేసేసేడు! గంట్లుకొట్టిన తిరగలిలా మొహం వీడూ! ఈ ప్లీడరు చేయగలిగిందేముందంటా? ఇదేం పార్టీల దగ్గర డబ్బు గుంజడమా ఏమిటి? జర్మన్‌లు త్రోసుకువస్తూనే వున్నారు! వాళ్ళు తోడేళ్ళు! రష్యాను ముక్కలు చేసేస్తారు!... ఎవరుచెప్తా యీ బోల్షివిక్కులు? నాకు తెలియదు. విననేలేదు. ...వీళ్ళెక్కడివాళ్ళో? రష్యాను విడిచిన పౌలోవ్ లేడు! దేశ కాల పాత్రాది పరిస్థితుల నుంచి విడదీస్తే యెవరూ లేరు! నేనూ, మీరూ, మనో కరూ, యెవరూ లేరు!... పోనీండి! అవన్నీ మనకి తెలియనివి గాని, నడవండి, మన ప్రయోగాన్ని మళ్ళీ ప్రారంభిద్దాం!...

[వీధిలోంచి కదంత్రొక్కుతూ, పదం పాడుతూ పోతూంటుంది. విప్లవదళం ఒకటి. వీధిలోని బురదలో బూటుకాళ్ళతో త్రొక్కుతూన్నప్పుడయే 'కసపిస' ధ్వనులు.]

ముందునడూ వేగనడూ । మృత్యుభీతి వదలవోయ్ ।
సోవియట్లు కూలిరాజ్యం। సాధింతుదాం రారండోయ్ ॥

[పాట మేఘ నిర్ఘోషంలా వినవస్తుంది. దళం సాగిపోతుంటుంది. దళం పశ్చాద్భాగంలో యెవరో సంభాషిస్తారు.]

ఒకడు:- సెమ్యోనోవ్! ఏమిటి ఆ యింటివైపు అదేపనిగా చూస్తున్నావు?

సెమ్యోనోవ్:- కామ్రేడ్! అందులో యెవరున్నారో నీకు తెలియదు!

ఒకడు:- ఎవరిదేమిటి? నీ ప్రియురాలు కాదుకదా, కొంపదీసి!

సెమ్యోనోవ్:- (చిరునవ్వుతూ) ప్రియురాలికంటె ప్రియమైన వారే! పొవ్లోవ్ పండితునిదా గృహం, కామ్రేడ్!

ఒకడు:- ఎవరేమిటాయన?

సెమ్యోనోవ్:- మానవజాతికోసం తన మార్గాన అద్వితీయ కృషి గావించే మహాత్ముడాయన!

---

## ఎనిమిదో రంగం

[1919 సంవత్సర ప్రారంభం. శీతకాలం. ఇన్‌స్టిట్యూట్‌లో జబేలిన్, వర్వారాలు పెద్దకోట్లు తొడుక్కుని కుక్కలబోనులదగ్గర నిల్చుని వుంటారు. పొవ్లోవ్ టేబిల్‌దగ్గర కూర్చుని రాస్తుంటాడు. బోనుల్లో కుక్కలు కుశించి, చలికి గడగడలాడుతూ కునికిపాట్లు పడుతూన్నాయి. ప్రయోగాలకి అనుకూలపరిస్థితులు లేవిప్పుడు. కాని, లేబొరేటరీలో పని ఆపకండా కేవలం పట్టుదలకోసం ప్రయోగాలు సాగిస్తున్నారు.]

పొవ్లోవ్:- (తలెత్తి) ఏం, కుక్కలెల్లావున్నాయ్?

వర్వారా:- మళ్ళీ కునికిపాట్లు పడుతున్నాయి.

(పాలోవ్ లేచి, బోనుదగ్గిరికి వస్తాడు. కుక్క బోనులోనే కునుకుతూ కుంటిగా నిల్చుని వుంటుంది, తినుబండారాలుంచే గడంచీలవైపు చూస్తూ.)

పాలోవ్:- మాంసం లేనట్లుందే?

జబేలిన్:- లేనట్లే, డాక్టర్ పాలోవ్! ఒక్క బిస్కట్లు మాత్రమే యిస్తున్నాం.

పాలోవ్:- కుక్కలు కునికిపాట్లు పడుతున్నాయంటే ఆశ్చర్యమేముంది? ఈ చలిలో తగిన పుష్టినిచ్చే తిండి లేకపోతే యింకేమవుతుంది? మెదడు బలహీనమై, నీరసిస్తుంది. తత్ఫలితమే నిద్ర. ప్రాణిరక్షణకి యిదొక్కటే దారి! దీనినే మనం 'రక్షక నివృత్తి' (protective inhibition) అంటాం. ప్రాణి ఆత్మరక్షణకై యింద్రియవ్యాపారాల్ని చాలించుకుని, నిద్రద్వారా వున్న శక్తినంతనీ కూడబెట్టుకుని, అతి పొదుపుగా వాడుకొంటుందన్న మాట! తెలిసిందా?

(బైట గంట గణగణ మ్రోగుతుంది.)

నికోడిమ్:- (ప్రవేశిస్తూ) మీకోసం యెవరో వచ్చేరు.

పాలోవ్:- (చిరాకుగా) సమయాసమయాల్లేవూ? ఎవరా వచ్చింది?

నికోడిమ్:- (చిరునవ్వు నవ్వుతూ) మీరేచూస్తారుగా? రాండి.

(వెయిటింగ్‌రూమ్ తలుపుతెరచి పట్టుకుంటాడు, నికోడిమ్. పాలోవ్ అతిథుల గదిలోకి ప్రవేశించి, మబ్బుగావున్న నూనిదీపపు వెలుతురులో కూర్చున్న పిత్రిశ్చేవ్‌ను చూస్తాడు. అతడిప్పుడు గుర్తుపట్టజాలనంతగా చిక్కిపోయి వున్నాడు. పాలోవ్ అతణ్ణి వెంటనే గుర్తుపట్టలేక పోతాడు.)

పాలోవ్:- (గుర్తుపట్టి ఆశ్చర్యంతో) పిత్రిశ్చేవ్! పిత్రిశ్చేవే?

ఇక్కడ!...... మీ కిక్కడ యేం కావాలండీ, అయ్యా! అమాత్యవర్యా!

పిత్రిశ్చేవ్:- (బెదురుతూ అటునిటుచూస్తూ) ఇవాళ!... ఇది కతులకీ, కావేషీలకీ సమయం గాదనుకుంటూ... నువ్వు గతాన్ని మరిచిపో. ఇప్పుడు నీ దగ్గరికి మిత్రుడుగా వచ్చేను, నేను. అదీగాక నాతో యింకొక మిత్రుడు వచ్చివున్నారు. అన్నట్లు మరిచేపోయేను చెప్పడం...

(పెద్దకోటు, చేతిలో టోపీ, బెత్తం పట్టుకున్న ఒక విదేశీయుడు ముందుకు వచ్చి, పౌలోవ్‌కు సగౌరవంగా వంగి వందనంచేసి, విజిటింగ్ కార్డును అంది స్తాడు. ఆయన అక్కడున్నట్లు అంతవరకూ పౌలోవ్ చూడనేలేదు. నూతన వ్యక్తి ఆత్మపరిచయపూర్వకంగా.-)

నూతన వ్యక్తి:- జార్జి హిక్స్. యునైటెడ్ స్టేట్సు మెడికల్ అసోసియేషన్ ప్రతినిధిని.

పౌలోవ్:- తాము స్వయంగా దయచేసి, నా గృహాన్ని పావనం చేయడానికి కారణం సెలవిస్తే కృతజ్ఞుణ్ణి.

జార్జి హిక్స్:- తమ అఖండ విజ్ఞానం, మేధాశక్తి వినని వాళ్లుండరు. నాకు మీయందుగల పూజ్యభావమే నన్నిటా తీసుకొనివచ్చిందే కాని వేరుగాదు.

పౌలోవ్:- మీ అవ్యాజగౌరవానికి అనేక వందనములు. కాని...

హిక్స్:- మీ దేశాన్ని నే నెంతో ప్రేమిస్తాను. కాని, మీ దేశ చరిత్రతో నాకుగల పరిచయం మాత్రం కొద్దిపాటిదే...నా

ఉద్దేశ్యం... తార్తారుల దండయాత్రల కంటెనూ భయానకమైన దురదృష్టం మీ దేశానికి పట్టబోతూంది. ప్రాచీనమైన రష్యను నాగరికత, సాంప్రదాయాలు మట్టిపాలవుతున్నాయి. మేము, పాశ్చాత్య ప్రజాస్వామ్యవాదులం; మీ సుదీర్ఘ నాగరికతకు చిహ్నాలైన పెన్నిధుల్ని వినాశాన్నుంచి రక్షించడం మా విధిగా భావిస్తున్నాము. ...మానవజాతి శ్రేయస్సుకోసం తమరిని యీ గందరగోళంనుంచి తప్పించగలిగితే మే మెంతో ధన్యులమని...

పాలోవ్:- అల్లాచెప్పండి! ఓసోస్సీ! అదా సంగతి! రష్యాలోని అపురూపవస్తువుల్ని మెరమెచ్చుమాటలతో కొనేయాలనుకుంటున్నారా? అంతటితో పోనీకండా రష్యన్ వైజ్ఞానికుల్ని, పండితుల్ని కూడ ఆ బేరంలోని కీడ్వాలని మీఆశ! (పిత్రిశ్చేవ్ మీాదికి పోతాడు.) ఐతే నువ్వు యీ వ్యాపారంలోకి యెప్పుడు దిగేవు? దేశాన్నే అమ్మజూపుతున్నావన్న మాట! ఔనా?

పిత్రిశ్చేవ్:- దేశాన్నా? నాకూ దేశంవుండేది. కాని, యిప్పుడు నా దేశాన్ని తోడేళ్ళు నాశనంచేసి, రూపుమాపినాయి! ఇవాన్! యథార్థాన్ని కాదనుకుంటే ప్రయోజనమేమిటి?

పాలోవ్:- (హిక్స్‌తో) ఇంతవరకు యేమేమి ఖరీదుచేసేరు? సెయింట్ ఇసాక్స్ కథిడ్రల్, పీటర్ మహాచక్రవర్తి విగ్రహం - యిల్లాంటివేనా మీరు కోనేది? చౌకగానే దొరకచ్చు!

హిక్స్:- మీరు మమ్మల్ని అపార్థం చేసుకున్నారని చెప్పవలసి వచ్చినందుకు చాల విచారిస్తున్నాను. ప్రపంచంలో యే ప్రాంతంలోనైనా, యే యిన్స్టిట్యూట్‌లోనైనా మీరుండి పనిచేయ వచ్చును. మీకున్న ఒకేఒక అవకాశం యిది!

సిత్రిశ్చేవ్:- సమయం మించిపోకముందే మనం బైలుదేరాలి!

హిక్స్:- నేను చెప్పింది తాము గ్రహించేరని తలుస్తా. నేను కార్యవాదిని. దేన్నైనా సాధించడమే నా పని! మీరెక్కడ పనిచేసినా ఒకటేకదా? మానవజాతికి, విశ్వ సమిష్టి దృష్ట్యా...

(నికోడిమ్ ప్రక్కగా నిల్చుని యీ సంభాషణను వింటూ, మానసికాందోళనను ముఖవైఖరిలో వ్యక్తీకరిస్తూంటాడు.)

పౌలోవ్: ఎక్కడుండిపనిచేసినా ఒకటేనా? కాదండి, అయ్యా! నా మటుకి నాకు అంతా భేదంగానే కనిపిస్తూందండి! శాస్త్రానికి, విజ్ఞానానికి దేశభేదం లేదుగాని శాస్త్రజ్ఞునికి, విజ్ఞానానికి యెప్పుడూ దేశం వుండేతీరుతుంది! నేను రష్యన్‌ని! తెలిసిందీ? అయ్యా! నా దేశం, నా భూమి, నా గాలి, నా నీరు, యివి! ఇదిగో ఇదే పౌలోవ్ పుట్టి, పెరిగి, వర్ధిల్లిన వాతావరణం! మంచి గానీండి, చెడు గానీండి, ఇది నా దేశం. రష్యాకి బిడ్డడు పౌలోవ్! నేను పక్షినిగాను, ఆశ్రయ వృక్షం తగులబడిపోతూంటే యెగిరిపోవడానికి! పడవ మునిగిపోతూంటే దూకి పారిపోవడానికి యెలక నంత

కంటే గాదు! అబ్బే! మీరు చెప్పేవాటిని నేను విశ్వసించను. తెలిసిందీ?...

(నికోడిమ్ ముఖంలో సంతోషం కనిపిస్తుంది.)

హిక్స్ :- మీరు బాగా ఆలోచించుకోగోరుతాను.

పిత్రిశ్చేవ్ :- సర్వనాశం! మిగిలేది శ్మశానం! కరువు, రోగాలు, దారిద్ర్యం మిగులుతాయి. అంతే. ఈగలు, దోమలు, నల్లులు, పేలు,- వీటికాహారంగా దౌర్భాగ్యమానవులు!...

హిక్స్:-(కోటుబొత్తాములు సవరించుకుంటూ) తర్వాత మీరు విచారిస్తారు. కాని అప్పటికి అవకాశాలు చెయిదాటిపోతాయి! మానవజాతి శ్రేయస్సుకోసం, మీ శ్రేయస్సుకోసం...

పాలోవ్ :- నికోడిమ్! ఈ శ్రేయోభిలాషులకు బైటికి దారి చూపించు. ఏం? చూపిస్తావుగదూ?

నికోడిమ్:- అయ్యా! దారి యిల్లాగండి! రాండి, అయ్యా!

(తలుపు తెరిచి, ఓ చేత్తో దారిమాపుతూంటే అతనిముఖం సంతోషంతో వికసిస్తుంది. గుమ్మం దాటిపోతూ హిక్స్, నికోడిమ్ చేతిలో ఒక డాలరునోటు వుంచుతాడు, బహూకరణగా. నికోడిమ్ దాని స్పర్శకి వులిక్కిపడి, దానిని వెనకే విసిరేస్తాడు బైటికి.)

నికోడిమ్:- (నిరసనభావంతో) డబ్బుతో మనుష్యుల్ని కొనాలనుకొనే యీ అమెరికన్లు...

పాలోవ్ :- మూర్ఖులు! నికోడిమ్! మానవత్వం గోల్పోయిన నీచులు!...... సరే. నేను ఆస్పత్రికి బోవాలి. సైకిలు బైట పెట్టు.

నికోడిమ్:- పదిమైళ్లుంటుంది, డాక్టర్ పావ్లోవ్! చలి, మంచు! నగరమంతా గందరగోళంగా వుంది. మీరు...

పావ్లోవ్:- నికోడిమ్! చెప్పినట్లు చెయ్యి! నాకు పాఠాలు చెప్పకు!...

(నికోడిమ్, పావ్లోవ్‌లు వెలుపలికి పోతారు. సైకిలుగంట మ్రోగుతుంది. నికోడిమ్ కంఠం: "జాగ్రత్త! బాబూ! వీధులన్నీ అల్లకల్లోలంగా వున్నాయి. భద్రంగా పోయిరండి!" ఒక్కమాటుండి నికోడిమ్ లోనికి ప్రవేశిస్తాడు, సెమ్యోనోవ్‌తో. సెమ్యోనోవ్ పటాలపు కోటూ, మాసిన పటాలపు టోపీ ధరించి, చేతికి కట్టుతో వుంటాడు.)

సెమ్యోనోవ్:- (పరిచితునిలాగ) డాక్టరు పావ్లోవ్‌ను కలును కోవాల్సి వుంది, అర్జంటుగా.

నికోడిమ్:- (చాలనగా చూస్తూ, మందలిస్తూన్నట్లు) డాక్టరు పావ్లోవ్ మీ స్నేహితులులా వుంది? ఓహో! అకడమీషియన్ పావ్లోవ్ యిక్కడ లేరండీ, అయ్యో! ఆయన వెళ్ళిపోయేరు!

సెమ్యోనోవ్:- (నిశ్చేష్టుడై) ఏమిటి? వెళ్ళిపోయేరా? ఎక్కడికి? ఎప్పుడు?

నికోడిమ్:- ఇంకెక్కడికి? పిచ్చాసుపత్రికి!

సెమ్యోనోవ్:- (వ్యంగమని గ్రహించి బతికేననుకుంటూ) అమ్మయ్యా! అదా సంగతి! ఓహో! ఆయనమాట ఎల్లావున్నా నువ్వుమాత్రం పిచ్చాసుపత్రిలో వుండదగిన వాడివిలాగే వున్నావు!

నికోడిమ్:- (అనుమానిస్తూన్నట్లు) ఎవరు పిచ్చాసుపత్రిలో

వుండాలో చూద్దాం! కాని, మీరు యెప్పటినుంచి ఆయ న్నెరుగుదురు ?

సెమ్యోనోవ్:- అల్లా చారికిరా, మరి. నేను యిక్కడికి వచ్చి చాలకాలమైంది. 1912 లో.

నికోడిమ్:- (ముందు జాగ్రత్తకోసం) నేను మిమ్మల్ని గుర్తుపట్ట లేకండా వున్నా.

సెమ్యోనోవ్:-(చిరునవ్వుతో) ముగ్గురు విద్యార్థులుండా లేమూ? అప్పుడు గోపురాలు కడుతున్నారు. చందాపట్టీ, డబ్బూ తెచ్చేం!

నికోడిమ్:-(జ్ఞాపకాన్నభినయిస్తూ) ఔనౌను? డాక్టర్ పొలోవ్ నాతో చెప్పేరు, ఒకసారి. తెలుసా? ఆ గోపురాలింకా యిప్పటికీ పూర్తిగానే లేదు!

సెమ్యోనోవ్:- ఇప్పుడు మనం వాటిని పూర్తిచేసేస్తాం. ఈ సారి తప్పదు!

నికోడిమ్:- (మర్యాదగా) మీరు యిక్కడే నిలుచున్నారేటిమి? అయ్యో! నా యిల్లు బంగారంగానూ! అతిథుల్ని నిలుచో బెట్టే మాట్లాడుతున్నా! రాండి, లోనికి రాండి.

(ఇద్దరూ లోపలికివెళ్ళి కూర్చుంటారు.)

సెమ్యోనోవ్:- పొగ త్రాగచ్చా, యిక్కడ? (పొగాకు పైకి తీస్తూ) ఇది మఖోర్కా, తాతా!

నికోడిమ్:- (దర్జాగా) దానికేం? అది పటాలపు సరుకు! నిషే

పంలా! దాని మజా నాకూ తెలుసు. నేనూ పటాలంలో పనిచేసినవాణ్ణే. బాబూ! (తన కర్రకాలుమీద తట్టుతూ) యీను లియావో-యాంగ్ యుద్ధంలో జపాన్ ఫిరంగి గుళ్ళకి యెగిరిపోయేడు లేండి!...

(చుట్ట త్రాగి, సెమ్యోనోవ్ బైటికి వెడతాడు. అంతలో పౌలోవ్ ప్రవేశిస్తాడు.)

పౌలోవ్:- (నికోడిమ్‌తో) ఎవరు పొగ త్రాగింది?

నికోడిమ్:- మీకోసం యెవరో వచ్చేరు. మంచివాడులా వున్నాడు. చూ స్తేసరి, యెవరెల్లాంటివాళ్ళో యిట్టే పోలుస్తాను. నా అంచనా యెన్నడూ తప్పలేదు...

పౌలోవ్:- అంత ఖండితంగా చెప్పకోయ్!

(సెమ్యోనోవ్ ప్రవేశిస్తాడు, తిరిగి. పౌలోవ్ అతణ్ణి గుర్తుపట్టడు. సెమ్యోనోవ్ మిలిటరీ యూనిఫారం చూసేసరికి ఆయనకి చిరాకు గలుగుతుంది.)

పౌలోవ్:- (కటువుగా) మీకు నావల్ల గావలసిన పనేమైనా వుందా?

సెమ్యోనోవ్:- నేనోక డాక్టరును. గాయాలవల్ల సెలవిచ్చి పంపేరులెండి. మీ లేబొరేటరీలో పనిచెయ్యాలని వుంది, నాకు. డిస్-హెల్-డిప్* వారు నన్ను మీదగ్గరకు పంపించేరు. (ఒక పత్రంతీసి చూపుతాడు.)

పౌలోవ్:- ఎవరు? ఎవరాపంపినవారు? (విరసంగా) నా కా పక్షి భాష లేం అర్థం గావు! మహాశయా!

---

* డిస్ట్రిక్టు హెల్త్ డిపార్టుమెంటుకు సంక్షిప్తం.

సెమ్యోనోవ్:- (చిరునవ్వు నవ్వుతూ) డిస్ట్రిక్టు హెల్తు డిపార్టు మెంటు నన్ను మీవద్దకు పంపించింది.

పౌలోవ్:- హెల్తు డిపార్టుమెంటా ? నిజంగా ? పంపించేరూ ! ఓహో ! ఎవరి అనుమతిమీదో ? వాళ్ళకి హక్కేముందీ అంటా ! (మండిపడతాడు.)

సెమ్యోనోవ్:- (ఇంకా చిరునవ్వు నవ్వుతూనే) నాకు యిక్కడికి రావటానికి హక్కుందండీ, డాక్టర్ పౌలోవ్ ! నా కెవరి అనుమతీ అవసరం లేదు !

పౌలోవ్:- (ఉగ్రుడై) ఏమిటీ ? అల్లాగేం ? ఇక్కడ యజమానిని నేను ! డీస్ డిస్పో ఏదో అన్నారే దాని కిక్కడేం పెత్తనం లేదు!... బాగుంది ! ఇకనేం ? ఆ సంగతేదో తేల్చుకోవాల్సిందే ! పైకి రాస్తా, యిదేమిటో ? ఈ శిష భిషలేం నాదగ్గర పనికిరావు !...

సెమ్యోనోవ్ :-డాక్టర్ పౌలోవ్ ! ఇదివరకే నాకు మీ అనుమతి వుంది.గనుకనే యిప్పుడింకెవరి అనుమతీ అక్కర్లేదన్నా.

పౌలోవ్:-(ఆశ్చర్యంతో) తలమీద గుండుదెబ్బగాని తగల్లేదు గదా! కొంపదీసి ! మతిభ్రమ గాదని నిశ్చయమేనా ?

సెమ్యోనోవ్:-మీరు కొంచెం విచారించాలి, డాక్టర్ పౌలోవ్! 1912లో మీరు నిశ్శబ్ద గోపురాలు కట్టేదినాల్లో చందా పట్టీ తీసుకుని ముగ్గురు విద్యార్థులు వచ్చేరు, గుర్తుందా ? డబ్బు మీరు తీసుకోలేదు. కాని, మీ సంతోషాన్ని వెలి

బుచ్చి, మీ దగ్గర పని చేసేందుకు యెప్పుడైనా రావచ్చు నన్నారు. మీ లేబొరేటరీ తలుపు లెప్పుడూ మా కోసం తెరిచే వుంటాయన్నారు, జ్ఞాపకం లేదూ? అందుకనే యిప్పుడు మీ వద్దకు వచ్చేరు...

పావ్లోవ్:-ఔనౌను. నాకు గుర్తొచ్చింది. ఇంత కాలంనుంచీ మీరేం చేస్తున్నారు? మీరు కమ్యూనిస్టా?

సెమ్యోనోవ్:-ఔనండీ, డాక్టర్!

పావ్లోవ్:-(గంభీరంగా) మిమ్మల్ని యిక్కడికి మేనేజరుగా పంపినట్లున్నారు. నాకు మీ అవసరం యేమీ వుండదు. మీరు లేకండానే యిక్కడ పనులన్నీ నేను సరిదిద్దుకో గలను. నాకు మేనేజర్లు యెవరూ అక్కర్లేదండీ, అయ్యా!

సెమ్యోనోవ్:- (నిశ్చలంగా) డాక్టర్ పావ్లోవ్! నా అభి ప్రాయాలు దాచుకుని వుండాల్సిందనుకుంటా! నాకు తెలిసి నంతవరకు అకడమీషియన్ పావ్లోవ్ యే పరిస్థితు ల్లోనూ తన భావాలు గోప్యంగా వుంచుకోలేదు! అటువంటి పిరికిపని యితరులను చెయ్యమని ఆయన అంటారనుకోను!

పావ్లోవ్:- (వాదనలో వోడిపోయి సణుగుతాడు.) హుఁ! గట్టివాడే! అసాధ్యుడిలావున్నాడే!

---

# నాలుగో అంకం

## ఒకటో రంగం.

(1920 సంవత్సర శీతాకాలం పిట్రోగ్రాడ్ నగరం. రష్యా అంతటా అంతర్యుద్ధం తీవ్రంగా చెలరేగుతూన్న దినాలు. రాత్రి వీధిదీపాలు వెలగడంలేదు. మంచుతుపానులు వీస్తున్నాయి. లేబొరేటరీలో ఆపరేషన్ పూర్తిగావించి అప్పుడే పౌలోవ్, అసిస్టెంట్లూ హాలులోకి వస్తారు. చలిమూలంగా అందరి నోళ్ళమ్మటా ఆవిరులు వస్తుంటాయి. పెద్ద పెద్ద బొచ్చుకోట్లమీదే తెల్లని ఆపరేషన్ గౌనులు కట్టుకుని వాళ్ళందరూ పీపాల్లా గానవస్తుంటారు. సెమ్యోనోవ్, మరొక అసిస్టెంటూ కొవ్వొత్తులు చేతులో పట్టుకుని వుంటారు. కుర్చీమీద కూర్చుని కాగితం చూస్తున్న పౌలోవ్‌కు దగ్గరగా కొవ్వొత్తి చూపుతూంటాడు, సెమ్యోనోవ్.)

పౌలోవ్:-(చిరునవ్వుతో) జాగ్రత్తయ్యా! బోల్షివిక్! నా గడ్డం కాస్తా కాల్చేవుగనక!

(సెమ్యోనోవ్ చిరునవ్వుతో దీపాన్ని కొంచెం దూరంగా వుంచుతాడు. నికోడిమ్ నెగడిలో కట్టెలు పడేసి, యేదో తట్టి, వంకీనున్న పెద్ద కోటుని జేబుల్లో తడుముతాడు. తలపంకించి పౌలోవ్‌ను సమీపించి క్రీగంట చూస్తూ)

నికోడిమ్:-ఈ వేళటి రొట్టె రేషనంతా మీ జేబులో పెట్టేను.

పౌలోవ్:-సరే, సరే! నికోడిమ్. మంచిది.

నికోడిమ్:-కాని, అదేదీఅంటా? (వెళ్ళి కోటుజేబులు తిరగేసి చూపుతాడు.)

పౌలోవ్:-అఁహాఁ! ఐతే తినేసివుంటానులే!

నికోడిమ్:-(కటువుగా) అబ్బే! ఇంతమాత్రానికి బొంకడం యెందుకు? రొట్టె కుక్కలికి యిచ్చేసేరు, మళ్ళీ! నా దగ్గరా దాపరికం?

పావ్లోవ్:-(సంకోచంతో) పాపం! ఆ కుక్కలేం పాపం చేసుకున్నాయి, నికోడిమ్?

నికోడిమ్:-మరి, మీరు వస్తుంటారా?

(బైటగంట మ్రోగిన శబ్దం. తలుపు తెరిచి పట్టుకుని, చిరునవ్వుతో నిల్చుని వుంటాడు, నెమ్యోనోవ్. టోపీ, కోటు, ఆపాదమస్తకం హిండిమంచుతో కప్పబడిన సమున్నత విగ్రహం. చేతికర్ర పట్టుకుని, చిరుదగ్గుతో వస్తూంటాడు, అలెక్జీమాగ్జిమోవిచ్ పెష్కోవ్. ఇతడే మహాకవి గోర్కీ. పావ్లోవ్ లేచి, కొవ్వొత్తి పట్టుకుని గుమ్మందగ్గిరికి పోతాడు. ఆగంతుకుణ్ణి బాగా చూడగలగడానికి దీపాన్ని పావ్లోవ్ అంతకంతకి పైకి యెత్తాల్సి వస్తుంది.)

గోర్కీ:- (చిరునవ్వుతో, మీసాల్లోంచి గొణుగుతున్నట్లు) తుపాను! మహాప్రభంజనం లేచింది! విశాలప్రపంచమంతనూ ఉర్రూతలూపేస్తూంది! ఓ హో హో!

పావ్లోవ్:-(ససంభ్రమంగా) ఎవరు? అలెక్జ్ మాగ్జిమిచ్?

గోర్కీ:-(మృదువుగా) ఆఁ! ఔను! వాడేవీడు!

పావ్లోవ్:-రాండి, దయచెయ్యండి! కోటు తియ్యండి. అయ్యో! మందమతా! మరిచేపోయేను.........(తన కోటువైపు చూపుతూ) చలి యిక్కడికీ వచ్చింది. అది తొడుక్కోండి.

(పావ్లోవ్ చేతివూపుకి కొవ్వొత్తి ఆరిపోతుంది.)

పావ్లోవ్:-(చీకట్లోనే) దిక్కుమాలిన దీపం గాని!

(గోర్కీ చటుక్కున అగ్గిపుల్ల గీస్తాడు. వెలుతురులో గోర్కీ నవ్వుమొగం దీప్తివంతమవుతుంది. నికోడిమ్ పడకకుర్చీని నెగడి దగ్గిరికి లాగుతాడు. నెగడిలో రెండు కట్టెలు పడేసి, మెల్లగా మునివ్రేళ్ళమీద నడుస్తూ, బైటికి వెడతాడు. గోర్కీ, పావ్లోవ్‌లు నెగడిదగ్గర వాలుకుర్చీల్లో ఆసీనులవుతారు. తడి

కట్టెలు మంటల్లో చిటపట మంటున్నాయి. మంటల నీడలు గోడలమీద తైతక్కలాడుతున్నాయి. గోర్కీ చేతులు కాచుకొంటుంటాడు. ఒక్కమాటు నిశ్శబ్దం.)

గోర్కీ:-వ్లాడిమిర్ ఇలిచ్ మిమ్మల్ని చూచిరమ్మని నాతో చెప్పేడు.

పాలోవ్:-(స్మృతినభినయిస్తూ) ఎవరూ? వ్లాడిమిర్ ఇలిచ్? గుర్తురావడంలేదు. ఎవరన్నారూ?

గోర్కీ:-(చిరునవ్వుతో) లెనిన్. కామ్రేడ్ లెనిన్.

పాలోవ్:-ఓ! అల్లాగా! కృతజ్ఞుణ్ణి....నేనాయనకి యేవిధంగా సాయపడగలను!

గోర్కీ:-(చిరునవ్వుతో తలపంకిస్తూ) అకడమీషియన్ పాలోవ్‌కి తానేవిధంగా సాయపడగలనో తెలుసుకురమ్మని వ్లాడిమిర్ ఇలిచ్ నాతో చెప్పేరు!

పాలోవ్:-అల్లాగా!...ఓఁ! ఐతే కుక్కలు కావాలి! అత్యవసరంగా కుక్కలు కావాలి. ఇంకో కొన్నిరోజులు పోతే నేనే వీథుల్లోకిపోయి ఊరకుక్కల్ని పట్టుకుని తెచ్చుకోవల్సి వచ్చేట్లు వుంది! ఇప్పటికే నా అసిస్టెంట్లు ఆ పని చేస్తున్నారేమోనని నాకు గట్టి అనుమానమే వుంది, చెప్పొద్దూ!

గోర్కీ:-కట్టెలు కూడా అవసరమనుకుంటాను? (నెగడివైపు చూస్తూ అంటాడు.)

పాలోవ్:-ఆఁ! అవసరమేలెండి. ఈ చలిలో, చేతులు కొంకర్లు పోతూంటే ఆపరేషన్లు చెయ్యడం కష్టంగానే వుంది!

గోర్కీ:-రొట్టె విషయమో? శాస్త్రజ్ఞులకీ, రచయితలకీ అదనపు రేషన్లు ప్రవేశపెట్టబోతూంది, ప్రభుత్వం.

పాలోవ్:-అదంతా అనవసరం, రష్యాదేశం మలమల మాడిపోతూంటే... మేమూ అందరితోబాటే! నాకేం ప్రత్యేక మర్యాదలు అవసరం లేదు. అందరం ఓ పడవే యెక్కేం. కానీండి...ఐనా...కుక్కలకి యేమైనా యిస్తే వద్దనలేను. అవి మాడిపోతునాయి, యిప్పటికే. ఆకలి మనోవ్యాపారాల్నీ, బుద్ధి తీక్ష్ణతనూ మందగింపజేస్తుంది.

గోర్కీ:-తప్పకుండా! మీకేం కావాలో మాకు తెలుసు, డాక్టర్ పాలోవ్!

పాలోవ్:-మహాకవీ? మీరు కూడా యిప్పుడు బోల్షివిక్కులా?

గోర్కీ:-అంత పెద్ద బిరుదుకు తగ్గ అర్హత నాలో నిజంగా లేదు; కాని, నా శక్తి వంచన లేకుండా బోల్షివిక్కులకి సాయం చేస్తూంటాను.

పాలోవ్:-పెద్ద బిరుదా? 1917 లో మీరు బోల్షివిక్కుల్ని తూర్పారబడుతూ రాసేరనుకుంటానే? నాకు మీ వ్యాసం బాగా జ్ఞాపకం!

గోర్కీ:-(సాలోచనగా) ఔను! నిజమే. అప్పుడు కొన్ని సమస్యలమీద రాసేననుకోండి. అందుకు నిజంగా విచారిస్తున్నాను, డాక్టర్ పాలోవ్! శాస్త్రీయపద్ధతులమీద ఆలోచించే శక్తి నాలో కొరతపడి వుందని ఒప్పుకుంటా.

పావ్లోవ్:-భేష్! బాగుందండీ. మీకు మతమిచ్చిన వారెవరు? రష్యాదేశపు మహాకవులైన మిమ్మల్ని......

గోర్కీ:-లెనిన్! కామ్రేడ్ లెనిన్ నన్ను మార్చేసేడు! నా దృక్పథంలో యెక్కడ లోపముందో ఆయనే చూపేడు.

పావ్లోవ్:-ఈ రోజుల్లో యెవరైనా తిట్టాలంటే బూర్జువాలని పిలవడం మామూలైంది. కాని, ఒక్కటిమాత్రం మనం మరువరాదంటాను. పాతదంతా చెడుగుకాదు. పాతదైనంత మాత్రాన దేన్నీ చెడుగుగా నిరసించరాదు.

గోర్కీ:-పాతదంతా మంచిదిగాదు! కొత్తదైనంత మాత్రాన త్రోసిపుచ్చదగినదీ గాజాలదు! విమర్శించని దే దేసనీ ప్రామాణికంగా ప్రాజ్ఞులు తీసికోరుగదా. *

పావ్లోవ్:-మహాకవీ! నా చదువు అంతాకూడా కష్టార్జితంతోనే సాగింది. నా కంతగా రాజకీయాలు తెలియవు. కాని, చిన్నతనాన్నుంచీ నేనెల్లా మానవసేవలో, విజ్ఞానాన్వేషణలో నా శక్తినీ, కాలాన్నీ వినియోగించగలనా? అనే ఆలోచించేవాణ్ణి. అదే నా ధ్యేయం, యిప్పటికీ. కాని, నాకు చాలా భయంగావుంది, రష్యా భవిష్యత్తు యెల్లా వుంటుందోనని!

గోర్కీ:-కొన్ని తరాలుగా మన ప్రజలు విప్లవాన్ని గూర్చి కలలుగంటూ వచ్చేరు......అది యిప్పుడు తీరా వచ్చే

---

* శ్లో॥ పురాణమిత్యేవనసాధుసర్వం । నచాపి కావ్యం నవమిత్యవద్యం
సంతఃపరీక్షాన్యతరం భజంతే । మూఢఃపరప్రత్యయనేయబుద్ధిః.

టప్పటికి మనం దాన్ని పోల్చుకోలేకండా వున్నాం! (లేచి గదిలో అటునిటు పచారు చేస్తూ, చటుక్కున పాలోవ్ ముందాగి) ఎందుచేత నంటారా? విప్లవం యేదో తళుకు బెళుకు వేషంలో వుంటుందనీ, అప్పుడింక అరచేతిలో వైకుంఠమేననీ అనుకున్నాం. తీరా చూస్తే, కరువు, దారిద్ర్యం, యుద్ధం, సర్వనాశనం,-అన్నీ కష్టాలే! మృత్యుదేవత, క్షామం యెక్కడపడితే అక్కడ కరాళనృత్యం చేస్తున్నాయి. ఇది చూసేసరికి గుండె తాళక, దీనికంతకూ విప్లవమే కారణం అనుకున్నాం. చూసేరూ? కేవలం భావాల శక్తినీ, పవిత్రతనూ మాత్రమే గాక యదార్ధ పరిస్థితులను గూడ చూడగలిగి వుండాలి, డాక్టర్ పాలోవ్!

పాలోవ్:- భావాలెంతవున్నతమైనవైనా ఫలితం యేమిటో చూడొద్దూ? నిర్మాణమే పరిపూర్ణంగా విచ్ఛిన్నం చేయడమా? దేశపు ఆయువుపట్లు, నాడీకేంద్రాలు స్థంభించి పోవడమా? అది అపస్మారమవుతుంది, మహాకవీ! ఆత్మ విశ్వాసం మంచిదే, అవసరమేగాని దానికి అతివ్యాప్తిదోషం పట్టిందంటే యెంత అనర్థం కలుగుతుంది? మీరేమనండి కాని, దేశ కట్టడమంతా మొత్తంగా బీటలుతీసి, మూలమట్టంగా కుప్ప కూలుతుందని నా భయం!

గోర్కీ:-పాతదై బూజుపట్టి కుళ్ళిపోయిన రష్యా కూలిపోతూందన్నమాట నిజమే, డాక్టర్ పాలోవ్! తప్పదు, మరి.

కాని, రాళ్ళూ రప్పలూ, వాసాలు దూలాల్లోంచి వినిర్మల సుందరాకాశం చూడగలుగుతున్నా! బందిఖానాలోంచి విశాల విశ్వంలోనికి విడివడివచ్చినట్లు! ఆహా! సురభిళ మందపవనం—దుర్గంధపూరితవాయువుకి బదులు! బూజు పట్టిన చీకటి కొంప కుమారు కాంతిమయమైన సుందర విశాలాకాశం!

పౌలోవ్:-హు! అప్పుడే సుందరవిశాలాకాశం కాంతిమయంగా చూస్తూన్నారూ? ఆకాశం కాంతిమయమైనా శూన్యం గదా? మహాకవీ! (పరిశీలనగా గ్రుచ్చిచూస్తూ) మీకు మీకు తెలుసా? కవులలో ఉత్తేజనం, ఉద్రేకం పై చేయిగా వుంటాయి; విషయగ్రహణమననములకంటె......

గోర్కీ:-మనోవ్యాపారరీతులు మీకంటె తెలిసినవారుండరు... కాని రష్యా భవిష్యత్తు 'మహత్తరంగా, శుభోదర్కంగా వుంటుందనే నా విశ్వాసం. మీరే చూస్తారుగా?...మీ ప్రయోగాలు నిరాటంకంగా, అనర్గళంగా సాగుతూండడానికి వలసిన యేర్పాట్లన్నీ చేయగల్గితే ధన్యులమని భావిస్తాము, మహాత్మా!

(గోర్కీ లేస్తాడు. కోటు తొడుక్కుంటూంటే పౌలోవ్ వచ్చి సాయం చేయబోతాడు.)

గోర్కీ:-వందనాలు, డాక్టరు పౌలోవ్! అబ్బే! ఎందుకండీ? నే తొడుక్కుంటాలెండి.

పావ్లోవ్:-ఇంతలోకే యేంపోయిందండీ, నన్ను సాయం చేయ నీండి, మహాకవీ !

(పావ్లోవ్‌ను కుతూహలంగా కళ్ళుచిగిలించి చూస్తూ, ఆయన చేయి తన చేతిలో పట్టుకుని వుంటాడు గోర్కీ. మహాకాయుడైన గోర్కీ ముందర పావ్లోవ్ పొట్టిగా, సన్నగా, పిల్లవానిలా నిలబడి వుంటాడు.)

గోర్కీ:-(చిరునవ్వుతూ) మహాత్మా ! మీ దగ్గరికి రావడం, మాట్లాడడం చాలకష్టం ! అగ్నిహోత్రంలాంటివారు ! మీకు తోచినంతా ఖండితంగా యెవరి మొహంమీదైనా చెప్పేస్తారు. ఎంతమందికి నచ్చకపోనీ, వ్యతిరేకంకానీ ! అది మెచ్చదగిందే. కాని, డాక్టర్ ! కేవల యదార్థవాదంలో యీ రోజుల్లో అంతగా పసందు కనబడదు. అదీ కేవలం ఒక అలవాటే ! అంతకన్నేమీలేదు. మనోవ్యాపారాలు-మీరు రిఫ్లెక్సులు అంటారే, వాటిల్లోదే అనండి పోనీ. అవి కూడా పరిస్థితుల్ని బట్టి నిబద్ధములైనవని అంటున్నారుగా? నూతన పరిస్థితుల్లో యీ మనోవ్యాపారాలు మారుతాయి, మారితీరాలి, కొత్తసిద్ధాంతాలు, కొత్తమనుష్యులు నేడు దేశాన్ని పరిపాలిస్తున్నారు. ప్రజలకి సౌఖ్యసమృద్ధుల్ని కలిగించడానికై వారు యత్నిస్తున్నారు......

పావ్లోవ్:-మాగ్జింగోర్కీ ! లెనిన్‌కి నా కృతజ్ఞతా వందనాలని చెప్పండి.

గోర్కీ:-తప్పకండా... మీకేం కావాల్సినా... (మెట్లు దిగుతూంటాడు.)

పాలోవ్: (బిగ్గరగా) మహాకవీ! మీ అభిప్రాయాలు మంచివే గావచ్చు. కాని, కేవలం మంచి ఆశయాలవల్ల నేమీ గాబోదు! మీరుకూడా కొన్ని విశ్వాసాలు పట్టుకుని వున్న వారే! అది మతం గాకపోవచ్చు. కాని, నేను, కేవల యదార్థవాదిని. జీవితమంతా నేనొకే ఒక దైవాన్ని ఆరాధిస్తున్నా. ప్రమాణ జ్ఞానమే ఆ దైవం! పరిశీలనే దాన్ని పొందేమార్గం!

గోర్కీ:-(క్రిందినుంచి బిగ్గరగానే) ఔనౌను! డాక్టర్! కాని, ఆ ప్రమాణాలుకూడా దేశకాలాబాధితములని చెప్ప వీలు లేదు! ప్రమాజన్యమైన జ్ఞానం కూడ నూతన ప్రమలు దొరకడంతో పరిణతం అయ్యేతీరుతుంది!

పాలోవ్:-అక్షరాలా సత్యం!

గోర్కీ:-(జయించే చూపుతో) అల్లాగే అనండి, డాక్టర్! లెనిన్ మిమ్మల్ని తన పరమమిత్రునిగా యెంచుతున్నారు! ఆయన అంటూంటారు: "డాక్టరు పాలోవ్ విజ్ఞానశాస్త్ర రంగంలో పనిచేస్తూన్న బోల్షివిక్!" అని!

పాలోవ్:- (దిగ్భ్రమతో) నేనా? బోల్షివిక్కుని? లెనిన్ అంటూన్నారా? చిత్రంగావుందే? చాలా విచిత్రం, మహాకవీ!

గోర్కీ:- ఈ లోకంలో అసంభవం యేముంది? చిత్రమైనదేముంది? అన్నారుగదా పెద్దలు. వందనాలు!

(గోర్కీ వెళ్ళిపోతాడు. పావ్లోవ్ కుర్చీలో సాలోచనుడై కూర్చుంటాడు. నికోడిమ్ ప్రవేశించుతాడు.)

నికోడిమ్:-(నవ్వుతూ) డాక్టర్! భోజనానికి లేవండి. మీరు వస్తుంటే వూరుకోవద్దని ఆ పెద్దమనిషి చెప్పేరు!

పావ్లోవ్:-(సంతృప్తుడై) అప్పుడే నామీద నిఘా వేశారూ? కానీ, కొన్ని అధికారాలకి లోబడకండా...

---

## రెండో రంగం.

(1921 సంవత్సరం జనవరి నెల 24 తేదీ. శీతాకాలం పిట్రోగ్రాడ్ నగరంలో. లేబొరేటరీలో నెగడిదగ్గర వాలుకుర్చీలో కూర్చుని వుంటాడు. పావ్లోవ్. నికోడిమ్ ఆనాటి పత్రికను తీసుకుని వస్తాడు.)

నికోడిమ్:-(సంతోషోత్సాహాలతో) డాక్టర్! ఇవాళ్టి పత్రికల్లో పడింది!

పావ్లోవ్:-ఏమిటి పడత, నికోడిమ్?

నికోడిమ్:-మన ప్రయోగాల్ని గూర్చి లెనిన్ ప్రభుత్వం ప్రకటన చేసింది! వినండి! చదువుతా.

"ప్రజామంత్రివర్గసభ ప్రకటన"

అకడమీషియన్ ఐ. పి. పావ్లోవ్ గత నలువదియైదు సంవత్సరాల్లోనూ చేసిన శరీరశాస్త్ర పరిశోధనలు ప్రపంచ ప్రజానీకాని కత్యంతోపయుక్తమైనవి. అందులోనూ గత

యిరవై యేళ్ళలోనూ ఆయన గావించిన మనోశాస్త్ర ప్రయోగాలు అపారప్రాముఖ్యత గలవి. శ్రామిక వర్గోద్యమానికీ, సిద్ధాంతాలకీ అభివృద్ధినీ, పుష్టినీ చేకూర్చగల వాటిని దృష్టిలో పెట్టుకుని మంత్రివర్గసభ యీ క్రింది నిర్ణయాల్ని చేస్తూంది,-

1. పిట్రోగ్రాడ్ సోవియట్ అధీనంక్రింద సర్వాధికార సమన్వితమైన ఒక ప్రత్యేక కమిటీ యేర్పర్చబడుతుంది. దానిలో కామ్రేడ్స్ గోర్కీ, క్రిస్టీ, కాప్లునోలు ముగ్గురూ సభ్యులుగానూ, గోర్కీ అధ్యక్షుడుగానూ వుండాలి. అకడమీషియన్ పావ్లోవ్, ఆయన అసిస్టెంట్లూ తమ శాస్త్రీయ పరిశోధనలను నిరాఘాటంగా కొనసాగించేందుకు అత్యంతానుకూలమైన పరిస్థితుల నేర్పాటు చేసే బాధ్యత యీ కమిటీ వహించాలి.

2. ప్రభుత్వ ప్రచురణశాఖవారు వెంటనే అకడమీషియన్ పావ్లోవ్ యొక్క మనశ్శాస్త్రకృషినీ, గత యిరవైయేళ్ళుగా ఆయన ప్రయోగ ఫలితాలనూ క్లుప్తంగా క్రోడీకరిస్తూ, ఒక చక్కని సుందరగ్రంథాన్ని తీసుకొని రావాలి.

మాస్కో, క్రెమ్లిన్,
జనవరి 24, 1921.

వ్లాదిమిర్ ఇలిచ్ ఉల్యనోవ్, (లెనిన్)
చైర్మన్,
ప్రజామంత్రి వర్గ సభ.

పావ్లోవ్:- నికోడిమ్! ఇట్లా చేయబోతున్నట్లు మన కిదివరకే తెలుసు గదూ?

నికోడిమ్:-అదిగో అంటే ఆరుమాసాలు పట్టే మనకి యింత త్వరలో పనులు జరుగుతాయని యెవరనుకున్నారు ?

పావ్లోవ్:-నిజమే! కాని లెనిన్ స్వయంగానే యీ విషయంలో శ్రద్ధతీసుకుంటున్నారు. పైగా గోర్కీదే దీనిలో ముఖ్య పాత్ర కూడాను. కానీ, యేమిజరుగుతుందో...

నికోడిమ్:-ఏముంది? అంతా బాగానే జరుగుతుంది.

[తెర పడుతుంది.]

(పెట్రోగ్రాడ్ యూనివర్శిటీ లెక్చర్ హాల్. వేదికమీద జబేలిన్ ఎదుటి టేబిల్‌మీద లావాటి బైండుపుస్తకం. దానిమీద బంగారు అక్షరాలలో 'ఉన్నత నాడీమండలక్రియల ప్రామాణిక పరిశీలన—ఐ. పి. పావ్లోవ్' అని వుంది. గ్యాలరీలమీద సోవియటు విద్యార్థి వర్గం శ్రద్ధాసక్తులతో జబేలిన్ ఉపన్యాసాన్ని వింటూంటారు.)

జబేలిన్:-(పుస్తకాన్ని తట్టుతూ) పావ్లోవ్ ప్రయోగ పరిశీలనల లోని అమూల్యానుభవాలన్నీ యీ గ్రంథంలో క్రోడీకరించబడినాయి. అతికష్ట పరిస్థితుల్లో, కరువు, అంతర్యుద్ధం, అరాజకంతో దేశం అట్టుడికిపోతూన్న కాలంలోనే దీన్ని అచ్చు వేయించి ప్రచురించిన సోవియటు ప్రభుత్వం కొనియాడ దగింది. మనోవ్యాపారములకు నూతన భౌతికవాద దృక్పథంతో వ్యాఖ్యానం చెప్పుకోడానికి పావ్లోవ్ పండితుని పరిశోధనలు పునాదిని వేస్తున్నాయి. ఇంతవరకూ

అవాఙ్మానసగోచరమైన ఆత్మ అని పిలువబడేదేది ? అనే విషయాన్ని యీ పరిశోధనలు అతిసూక్ష్మంగా విశదీకరిస్తూన్నాయి......

(ఫిరంగి గుండ్లు గుభేల్ గుభేల్‌మని బైట పడతాయి. విద్యార్థులు విభ్రాంతులై ఒకరి మొగాలొకరు చూసుకుంటారు.)

[తెర పడుతుంది.]

(యూనివర్సిటీ మెడికల్ అసోసియేషన్ హాలు. శరీరశాస్త్రం, మనోశాస్త్రం, నాడీశాస్త్రం, వైద్యశాస్త్రం మొదలైన శాస్త్రాల్లో నిష్ణాతులైన డాక్టర్లతో హాలు నిండి వుంటుంది. అందరూ తెల్లని గౌనులు ధరించి వుంటారు. వర్మారా వేదిక మీద నిల్చుని ఉపన్యసించుతూంటుంది.)

"పాశ్చాత్య దేశాల్లో కొందరు శాస్త్రజ్ఞులు పౌలోవ్ పండితుని ప్రయోగాలు కేవలం లాలాగ్రంధిలో చేసే అల్లాటప్పా పనులని తూష్ణీభావంతో త్రోసిపుచ్చ జూస్తున్నారు. ఆయా శాస్త్రాల్లో ఆరితేరిన మీరు ఒక విషయాన్ని గమనించాలి. అదేమంటే పౌలోవ్ గావించిన మనోవ్యాపార ప్రయోగాల సాయంలేనిదే డాక్టర్లు నిత్యమూ చూచే అనేక వ్యాధులకూ, లక్షణాలకు అర్థం చెప్పలేరనీ, వాటికి చికిత్స చేయలేరనీ నేడు ప్రత్యక్షంగా ఋజువౌతూంది......

(హడావడిగా యెవరో ప్రవేశిస్తారు.)

"డాక్టర్ ! క్షమించండి. తప్పని సరై యీ వుపన్యాసాన్ని ఆపుచేయాలి. మహాజనులారా ! నీవానది నీటిమట్టం ప్రమాదకరంగా పొంగింది. వఱదల రక్షణసంఘం తరఫున

మిమ్మల్నందర్నీ అత్యవసరమైన పనులకై నియోజిస్తూ న్నాను. దయచేసి రాగోర్తాను."

(అందరూ వరుసలుగా వెలుపలకు నడుస్తారు. తెరలో వర్వారా గొంతు వినిపిస్తుంది.)

"డాక్టర్ పౌలోవ్‌కి కబురుచేయండి. లేబొరేటరీ భద్ర పరచాల్సి వుంటుంది."

"ఓ! ఇప్పుడే పంపుతా."

---

## మూడో రంగం

(పెట్రోగ్రాడ్ ప్రాంత పల్లెటిసీమ. బండిచక్రాల గాళ్ళతో నిండిన మట్టిరోడ్డు మీద గుర్రపుబగ్గీపోతూంది. నికోడిమ్ బండితోలేవాని పెట్టెమీద కూర్చున్నాడు. సెమ్యోనోవ్, పౌలోవ్‌లు లోపల కూర్చుని వున్నారు.)

పౌలోవ్:-(కటువుగా) నన్ను యీ అయోమయంలోకి పని కట్టుకుని తీసుకురావడంలో నీ అభిప్రాయమేమిటో అర్థం గావడం లేదు! అదల్లా వుంచు. ఇంతకీ అసలు కోల్తూషీ అనేదేమిటంటారు?

సెమ్యోనోవ్:- (చిరునవ్వుతూ) అర్థంగాని దేముందండీ? కోల్తూషీ అనేది గ్రామంపేరు! దాని నానుకునే ఓ జమీందారీ యెస్టేటు వుండేది. పెద్ద భూఖండం! కొన్నివేల యెక రాలు! దాంట్లో ఓ చిన్న యిల్లు, గుర్రాలసాల, గుర్రం,- యివన్నీ వున్నాయి.

పాలోవ్:-(బుసకొడుతూ) ఎందుకూ వేల యెకరాలు? ఎవరి క్కావాలి? అక్కడ మనం దోసపాదులు పెంచబోతున్నామా? గడ్డి కోసుకుంటామా?

నికోడిమ్:-(విసుగ్గా) మీ రన్నిటకీ యింతే! ఊరిఖే తొందరా, కోపమూను! ప్రతీదానికీ చిర్రుబుస్సు మనడమే గాని చివరకన్నీ బాగానే జరిగిపోతాయి!

పాలోవ్:-ఓసోస్సీ! మా గొప్ప నెమ్మదస్తును బైలుదేరేవు, చూడండీ!......(బగ్గీ గతుకుల్లో యెగిరెగిరి పడుతుంది. బండి తిరగబడపోతుంది)... దిక్కుమాలిన రోడ్డు! నడుం విరిగిందోయి, బాబూ! నికోడిమ్! ఇక్కడికేనా మోటారులో వెళదామన్నావు? నీ తెలివి...

నికోడిమ్:-నాకేం తెలుసునండీ, యిల్లా వుంటుందని! ఎల్లాగ తేనేం మహా! మాటకిమాట అప్పగించేరు లెండి!

(చిరపరిచయంచేత చనువుగా ఒకరొకరిమీద విసురులూ, మందలింపులూ విసురుకొనే యీ వృద్ధు లిద్దరి సంభాషణ చిరునవ్వుతో వింటూ సెమ్యోనోవ్ కూర్చుని వుంటాడు.)

పాలోవ్:-(సెమ్యోనోవ్ తో) మతిలేని పనులు! నా తెలివి మండా! నే నెందుకు అంగీకరించేనో, యెరక్కపోయి! ఆ కోల్ఖోజ్ యెస్టేటు కావాలని యెవరడిగేరు?

సెమ్యోనోవ్:-(ఒకటిమాటు ఆగి, మెల్లగా) మీరే!

పాలోవ్:-(అదిరిపడి) ఏమయ్యోయ్! బోల్షివిక్! ఏమిటీ సంగతి? నీకు మతి పోలేదుగదా? నేనెప్పుడడిగేను?

సెమ్యోనోవ్:-(ప్రశాంతంగా) నేనే మీ తరఫున అడిగేను లెండి.

పావ్లోవ్:-నువ్వే అడుగుతి? నిజంగానే? నిన్నెవరడగమన్నారు? అదంతా నాదగ్గర కుదరదండీ, అయ్యగారూ! మీ హద్దుల్లో మీరుండండి!...నికోడిమ్! ఇదెల్లా వుందంటావ్? నీ వుద్దేశం ...(నికోడిమ్‌వైపు చూస్తాడు.)

(నికోడిమ్ వైఖరి చూస్తే పావ్లోవ్‌ను సమర్థించేట్లు కనబడదు. అతడు యేమాటా తేలకండా మౌనంగా వుంటాడు.)

పావ్లోవ్:-నాకు కోల్తూషూ వద్దు, గోంగూరా వద్దు! అదంతా నేను చూడనేనా చూడననుకో! తెలిసిందా? నికోడిమ్! బండి వెనక్కి తిప్పు!

(నికోడిమ్ వెనకతిరిగి సెమ్యోనోవ్ ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తాడు. పావ్లోవ్ ఆ చూపును కనిపెట్టేస్తాడు.)

పావ్లోవ్:-ఓహోఁసస్సీ! అదా సంగతి! మీరిద్దరూ చేరి కుట్ర పన్నుతున్నారన్నమాటా?

(బగ్గీలోంచివురికి పట్నంవైపు పెద్ద పెద్ద అంగలతో నడుస్తూంటాడు. సెమ్యోనోవ్ దిగి, చిరునవ్వుతో పావ్లోవ్‌ను వెంబడిస్తాడు.)

సెమ్యోనోవ్:-ఏమండోయ్! ఒక్కమాట! ఆ స్థలం ఒక్కసారి కళ్ళతో చూడండి. అంతే నేకోరేది! మీరే చెప్పేవారు, గుర్తులేదండీ? పరిశోధనాలయ పరిసరాల్లోనూ పరిస్థితుల్లోనూగాక జంతువుల ప్రవర్తనలు సహజ వాతావరణంలో పరిశీలించాలి! అని.

పొలోవ్:-(వెనక తిరిగి) ఏతే నేమంటావ్ ? దానికీ దీనికీ...

సెమ్యోనోవ్:-పట్టణంలోని సమ్మర్దం, గొడవాలో జంతువుల సహజ స్వభావరీతులు గమనించలేం గదండీ! కోల్తూషీలో అయితే ప్రశాంతప్రకృతి......

(ఇద్దరూ యీ సంవాదంలో వుండీ నడుస్తూనే వుంటారు. నికోడిమ్ తిరిగి చూస్తూ, తన్నుగానట్లుగా యేదో యీలపాట పాడుతూంటాడు. పొలోవ్‌ని సెమ్యోనోవ్ త్రిప్పి తీసుకు వస్తాడని అతడికి ఘట్టి నమ్మకమే.)

నికోడిమ్:-(గుర్రాలతో) క్లక్లక్ల! ఇదిగో! మీ కే! ఈ ఆటలేం నా దగ్గిర సాగవ్! కట్టిపెట్టండి యింక!

(అవన్నీ పొలాలు. వినిర్మలాకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. నికోడిమ్ కళ్ళేలు వదిలేసి, కూనిరాగం తీస్తూ క్రీగంట, వెనక్కి తిరిగి వస్తూన్న పొలోవ్, సెమ్యోనోవ్‌లను చూసి, గంభీరంగా మొహం పెట్టేస్తాడు.)

పొలోవ్:-ప్రశాంతప్రకృతి సరేననుకో. కాని మన లేబొరేటరీ, సిబ్బంది, వైద్యశాల వగైరాలన్నీ యెక్కడ పెడతావు?

సెమ్యోనోవ్:-ఎక్కడంటారా? ఇక్కడే భవనాలు కట్టిస్తాం. ఒకటీ రెండూ కాదు! పట్టణం పట్టణమే లేస్తుంది! వైజ్ఞానిక నగరం! డాక్టర్ పొలోవ్! మనం చెయ్యలేకపోతే అప్పుడడగండి! ఇదిగో! అప్పుడే దానికో చిత్తుప్లాను వేసే వుంచేను. ఎంతో సేపా? చూడండి!

(ఇద్దరూ గుర్రాలబండిని సమీపించి దానిలో కెక్కి కూర్చుంటారు. ప్లానుల్ని సెమ్యోనోవ్ చేతుల్లోంచి తీసుకుని చూస్తూంటాడు.)

పొలోవ్:-(ప్లానులో చూపుతూ) ఏమిటిది?

సెమ్యోనోవ్:-కుక్కల్ని స్నానం చేయించేటందుకు మడుగు.

పావ్లోవ్:-(ఇంకో చోటు చూపుతూ) మరియివో?

సెమ్యోనోవ్:-వానరాలకు వసంతిగృహాలు.

పావ్లోవ్:-వానరాలేమిటి?

సెమ్యోనోవ్:-మన ప్రయోగాలకోసం తెప్పిస్తాము. ప్రయోగాన్ని మానవజాతికిప్పటికంటె సన్నిహితంగా తీసుకొని రావాలిగదండీ. నరునికి శరీరనిర్మాణ రీత్యా అత్యంత సన్నిహితంగా వుండేది వానరములేయని స్పష్టమే. మీరే ఒకసారి నాతో చెప్పేరు......

పావ్లోవ్:-(భుజాలు కుంచిస్తూ) ఓహోం!... మరి యిదేమిటిక్కడ?

సెమ్యోనోవ్:-ఉన్నత నాడీమండల క్రియా కలాపాల మీద ప్రయోగాలు చేసేందుకు లేబొరేటరీలు యిక్కడే స్థాపించుతాము, జీవోత్పత్తి శాస్త్ర ప్రయోగాలకి యిన్స్టిట్యూట్.

పావ్లోవ్:-ఓ బోళ్ళి పిల్లాడా! నీకు మతి పోతూందయ్యా!... నన్నడిగితే దీనికి కనీసం పదిలక్షలకి తక్కువ కాదంటా! ఇంతెందుకూ? ఎవరేనా వత్తిమైదానంమీద, పొలాల్లో లేబొరేటరీలూ, యిన్స్టిట్యూట్యూటూ నిర్మించ పూనుకుంటారా?

సెమ్యోనోవ్:- కమ్యూనిష్టులు యెప్పుడూ ఆకాశసౌధాలు నిర్మించరు! దివాస్వప్నాలూ కనరు! నేనా విషయాన్ని స్వానుభవంమీద చెప్పగలను.

(గుర్రంబండి మెల్లగా పోయి ఒకచోట ఆగుతుంది. వంకరటింకర స్థంభం మీద ఓ కొయ్యపలక దిగ్గొట్టి రోడ్డుసైన్ ఏర్పాటు చేసేరు. దానిమీద 'కొల్తూషి గ్రామం' అని వుంటుంది. పాలోవ్, సెమ్యోనోవ్‌లు బండిదిగి విశాలమైన గ్రామవీథిలో నడుస్తుంటారు. దూరంలో మంచినీటిబావి, చుట్టూ విల్లో వృక్షాలూ. వీధిలో పిల్లలు కాలిబంతి ఆడుకుంటూంటారు. పాలోవ్ కాలిముందుకొచ్చి ఆగిన బంతి నాతడు సూటిగా తన్నుతాడు. ఆ నేర్పుచూసి పిల్లలు మెచ్చుకునే చూపులతో ఆశ్చర్యంగా చూస్తారు. వీధేపోయేవాళ్ళంతా సనాతన సాంప్రదాయానుసారంగా టోపీతీసి, నూతనాగంతుకులకు వందనసమర్పణ చేస్తుంటారు. ఒక స్త్రీ రెండు నిండుబాల్చీలను కావడికి పూన్చి మోసుకుపోతూ, వీరికెదురుగా వస్తుంది. నిండుబాల్చీలు శకునం మంచిది! పాలోవ్ ఆ స్త్రీకి టోపీతీసి వందనం చేస్తాడు.

ఇద్దరూ కొంచెం దూరంపోయి ఊరిబైట పచ్చికమీద నిలబడతారు. ఎదురుగా అడవి. అడవి అంచున చిన్న కొయ్యకుటీరం. అక్కడ వాతావరణం ప్రశాంత మనోహరం.)

పాలోవ్:-(గడ్డిమీద చతికిలబడుతూ) ఇక్కడెంత బాగుంది!

సెమ్యోనోవ్ :-(వానకోటును తీసి గడ్డిమీద పరుస్తూ) దీనిమీద కూర్చోండి. క్రింద తేమ!

పాలోవ్:-(కోటుమీద వాలుతూ) ఏమయ్యా! బోల్షివిక్! నీ పని యిదేనా యేమిటి? నాకు సంరక్షణచేస్తూ నాతో వుండడమేనా! (ఆదరస్నిగ్ధ దృష్టులతో సెమ్యోనోవ్‌ను చూస్తాడు. పాలోవ్ ముఖం యెంతో ప్రసన్నంగా వుంటుంది. ఓ లేగడ్డిపోచను మునిపంట కొరుకుతూ, కూనిరాగంతీస్తూ, నిర్మలాకాశంలోకి చూస్తూ కాస్సేపు వెల్లకిలా పడుకుని వుండి, తటాలున లేచి కూర్చుంటాడు. సెమ్యోనోవ్ వైపు భావగర్భితంగా చూసి, చిరునవ్వుతో.)

పావ్లోవ్:-ఐతే నేనో పదిలక్షలడిగితే ఏమవుతుంది? నువ్వేమీ ఆలోచించ లేదనుకుంటానేం?

సెమ్యోనోవ్:-(లేదన్నట్లు చేతులు త్రిప్పుతూ) అబ్బే!

పావ్లోవ్:-మరి నువ్వు గొప్ప నిర్మాణదక్షుణ్ణంటావెందుకు? చాల బావుందిలే!

సెమ్యోనోవ్:-(ఒక్క క్షణం వూరుకొని) డాక్టర్! ఇక్కడి నిర్మాణకార్యాలకై యిరవై లక్షలు కావాలని ప్రభుత్వాన్ని మీ తరఫున నేనడిగేను. క్షమించాలి!

పావ్లోవ్:-ఏమిటీ? ఎల్లాగా? ...కాని, వాళ్లు...యేమన్నారేమిటి?

సెమ్యోనోవ్:-వాళ్లు నన్ను చూసి నవ్వేరు. ఇరవై లక్షలు యే ముక్కలోకీ రావు పొమ్మన్నారు!

పావ్లోవ్:-అందుకని అదీ యివ్వమనా దానర్థం?

సెమ్యోనోవ్: ఇప్పటిమటుక్కి ముప్పై లక్షలు తీసుకోమనీ, కాస్తంత కాలూ చెయ్యీ కూడదీసుకుని తర్వాత...

పావ్లోవ్:-ముప్పై లక్షలా? ఒక్కమాటు! వెనుకటిదంతా ప్రోగుచేసినా......

సెమ్యోనోవ్:-యుద్ధం, కరువు, సంక్షోభం, బ్లాకేడ్ లేకపోతే మీకు ముప్పైకోట్లు యివ్వాల్సిందన్నారు......

(పావ్లోవ్ ముఖం గంభీరంగా, ప్రశాంతంగా వుంటుంది. ఆయనేం ఆలోచిస్తూన్నాడో? ప్రకృతి రహస్యంలోని యే అగాధాల్లోకి పోవ నుత్సహిస్తూందో, ఆయన మేధ, తెలియను! హఠాత్తుగా గాలి వీవ నారంభిస్తుంది. పావ్లోవ్

టోపీ యెగిరిపోతుంది. సెమ్యోనోవ్ దాన్ని తరిమిపట్టుకుని తెచ్చి, ఆయన కిస్తాడు. ఆకసం మేఘావృతమవుతుంది. తుపాను సూచనలు. దూరాన రోడ్డు మీద దుమ్ము, యెండుటాకులు సుళ్లుతిరుగుతూ ఆకాశంమీదికి లేస్తూంటాయి.)

పౌలోవ్:-(ప్రకృతానికి వచ్చి) ఏమిగాలి! తుపాను వచ్చేట్లుందే. నీవానది ఉవ్వెత్తుగా పొంగుతూందే!

సెమ్యోనోవ్:-వెళదాం, నడవండి. వరదలు పొంగితే మన చేతినిండా పనే. లేబొరేటరీ భద్రపరచుకోవాలి......

---

## నాలుగో రంగం

(పెట్రోగ్రాడ్ నగరం. నీవానది వువ్వెత్తుగా పొంగి చుట్టుప్రక్కలంతా జలమయం చేసేసింది. ఆర్తులు గుంపులుగా మూటలు నెత్తినమోస్తూ, పిల్లల్ని చేయిబట్టి నడిపిస్తూ పోతూన్నారు. ప్రమాదాన్ని సూచిస్తూ ఫిరంగిమ్రోతలు. చీకటి పడబోతూంది. పౌలోవ్‌ల గృహంలో మేడమీది గదిలో పౌలోవ్ ఆతురతగా అటునిటు పచారుచేస్తూ, కిటికీదగ్గరికి పోయి బైటికి చూస్తూంటాడు. నీవా నది గట్లుమీంచి పొర్లి, చుట్టుప్రక్కలంతా జలమయంచేసి ప్రవహిస్తూంది. గాలి వీస్తూ నదీతరంగాల్ని పెద్దపెట్టున లేపుతూంది. ఇళ్ళకప్పులమీది రేకుల్ని గాలి యెగరగొట్టేస్తూన్న శబ్దం. దూరాన వార్ఫులదగ్గర ఓడలు,పడవలు లంగర్లు వేసి వుంటాయి. నీటిమట్టం యింకా లేస్తూనేవుంది. పెనుకెరటాలు విరిగి పడుతూ, ప్రళయోద్దండంగా, బీభత్సంగా వున్న నీవా ప్రవాహాన్ని మరింత భయంకరంగా చేస్తున్నాయి. దూరాన ఫిరంగిధ్వని మళ్ళీ వినవస్తుంది. గదిలో సెరాఫిమా కూర్చుని భర్తను ఆదుర్దాగా కనిపెడుతూంటుంది.)

పౌలోవ్:- (ఫిరంగిశబ్దం వింటూనే) అదుగో! పీటర్ పాల్ దుర్గంమీాది ఫిరంగిశబ్దం అది! వరద యింకా తీవ్రమవుతూందన్నమాట! (హాలులోనికి సెమ్యోనోవ్ నుద్దేశించి)

సెమ్యోనోవ్! నువ్వు వెంటనే యిన్‌స్టిట్యూట్‌కి పోవాలి.

(బైటనుంచి సెమ్యోనోవ్ గొంతు: 'ఇదిగో! ఇప్పుడే వెడుతున్నానండీ, డాక్టర్!' అని వినవస్తుంది.)

పావ్లోవ్:-(మళ్ళీ వినవచ్చిన ఫిరంగిశబ్దం విని) అదుగో! సీమా! వింటున్నావా? నీటిమట్టం యింకా హెచ్చుతూంది!

సెరాఫిమా:-ఈశ్వరకటాక్షం! ప్రభువు......

పావ్లోవ్: పొరబాటు! ఇదీ ఒక మనోవ్యాపారమే! ఈ మనః స్థితికి కూడ చికిత్సవుంది......

(పావ్లోవ్ దంపతుల కుమారై వీరా ఉత్సాహోద్రేకాలతో పరుగెత్తుకొని లోనికి వస్తుంది.)

వీరా:-నీళ్ళు కామినోస్త్రోవ్‌స్కీ దాకా వచ్చేసేయి, నాన్నా!

పావ్లోవ్:-(చిలక్కొయ్యనున్న కోటునందుకోబోతూ) అల్లాగా! నేనే వెళ్ళాలి, యిన్‌స్టిట్యూట్‌కి!

సెరాఫిమా:-(చటుక్కున కోటు లాక్కుని వెనక్కి పెట్టేస్తూ) వాన్యా! మీకేమేనా పిచ్చెత్తిందా? ఈ ప్రళయంలో పురుకుతానంటావేమిటి? మిమ్మల్నెక్కడికీ వెళ్ళనీయను!

పావ్లోవ్:-నిజమే. కాని, సీమా? వరదకి గోపురంకూడ మునిగి పోవచ్చు. అమూల్యమైన... (గమ్మున టెలిఫోను దగ్గరకు పోయి, రిసీవరును యెత్తుతాడు.) ఎవరు...ఆఁ!...ఔను, ఔను...ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్‌పెరిమెంటల్ మెడిసిన్ ...ఏమిటీ?...లైను చెడిందా?......

సెరాఫిమా:-మీరెక్కడికీ వెళ్ళొద్దు. వెళ్ళనసండి!

(తలుపువద్ద గంటమ్రోత)

సెమ్యోనోవ్:-(ప్రవేశిస్తూ) డాక్టర్ పౌలోవ్ ! నీరు గోపురాల్లోకి వచ్చేసింది. కేబులు పనిచేయడంలేదు. కనక్షను చెడింది. జబేలిన్ యిన్‌స్టిట్యూట్‌లో కాపలావుంటున్నారు......

పౌలోవ్:-దారి జలమయమా ?

సెమ్యోనోవ్:-ఆఁ ! మోటారులో వచ్చేను. చివరవరకు వెళ్ళ యత్నిస్తా.

పౌలోవ్:-మంచిది ! వెళదాం, నడు !

సెమ్యోనోవ్: మీరు వస్తారా ? మిమ్మల్ని అక్కడికి తీసుకుపోవడానికి వీల్లేదు, డాక్టర్ !

పౌలోవ్:-నేను వెడతానని చెప్పేనా ? సెమ్యోనోవ్ ! ఇంక మాట్లాడ్డం అనవసరం ! తెలిసిందా ? నడవండి !

సెరాఫిమా:-వినరూ ? మీపట్టే మీది ! (సెమ్యోనోవ్‌తో) డాక్టర్ ! భద్రం ! ఆయన్ని వదలకండి ! జాగ్రతసుమా !

సెమ్యోనోవ్:-అమ్మా ! యేం ఫర్వాలేదు. కానీండి. (చిరునవ్వుతో పౌలోవ్ వెనకే నడుస్తాడు.)

(పౌలోవ్, సెమ్యోనోవ్‌లతో మోటారు రంయ్‌మని పిట్రోగ్రాడ్ వీధుల్లోంచి పోతూ, బ్రిడ్జిదగ్గర కాపలా సిపాయిచేత నిలువరించబడుతుంది. రహదారీ బందైంది. అవల ప్రమాదకర ప్రదేశం, సెమ్యోనోవ్ మోటారునుంచి దూకి, సిపాయిదళ ముఖ్యుని దగ్గరికి వెళ్ళి అనుమతి సంపాదిస్తాడు. సెంట్రీదారి విడుస్తాడు. మోటారు మళ్ళీ శరవేగంతో బైలుదేరిపోతూంది. అక్కడ వీధులన్నీ అప్పటికే జలమయం. మోటారు చక్రాలంతకంతకి లోతునీళ్ళలో మునుగు

తూంటాయి. వీధిచివర మోటారు నిలుస్తుంది. పావ్లోవ్, సెమ్యోనోవ్‌లు దిగి, రేవులో పడవ నెక్కుతారు. పడవ తెడ్డుమీద సాగుతూంది. ఎదురుగుండా చిన్న లంకలా సగం మునిగిన ఇల్లు. నీటికందని కిటికీలో ఒకస్త్రీ చేతుల్లో చంటి బిడ్డ నుంచుకొని విభ్రాంతయై కూర్చుని వుంటుంది. రక్షణనావ శరవేగంతో పావ్లోవ్ పడవనుదాటి ముందుకు పోతూంటుంది. అదొక మోటారుబోటు. అందులోంచి ఒకడు ఆస్త్రీనుద్దేశించి పిలుస్తాడు: 'అమ్మా! ఓ అమ్మా!' ఆమెకు యీ కేకలు వినిపించినట్లు లేదు. కళ్ళు పెద్దవిచేసుకుని భయభ్రాంతురాలై శూన్యంగా చూస్తుంటుంది. అంతలో పావ్లోవ్ పడవలో ఆబోటును సమీపిస్తాడు.)

పావ్లోవ్:-(స్త్రీవైపు చూపుతూ సెమ్యోనోవ్‌తో) చూసేవా? అతివేలమైన భయమూలకంగా భ్రాంతత్వం! పరిపూర్ణ మనోవ్యాపారనివృత్తి! (complete inhibition) కళ్లుండీ చూడలేదు! చెవులుండీ వినలేదు! ఇంద్రియవ్యాపారాలు అసంబద్ధములవుతాయి. ఇదే విపరీతావస్థ! (paradoxal phase) ఎంత బలమైన ప్రేరకములైనా నిష్ఫలమవుతాయి!

(పడవ మోటారుబోటును సమీపిస్తుంటుంది.)

పావ్లోవ్:-(రక్షణదళసభ్యులతో) మెల్లగా పిలవండి! రహస్యం చెప్పినట్లు మెల్లగా పిలిచిచూడండి!

ఒకడు:-(పావ్లోవ్‌వైపు ఆశ్చర్యంగా చూస్తూ) మెల్లగానా? మీరనేదేమిటి? అరిస్తే ఆమెకి వినబడలేదుగాని! రాయై పోయినట్లుంది! అటువంటప్పుడు......

పావ్లోవ్:-ఔనౌను! సరిగ్గా అంతే జరుగుతుంది! ఇచ్ఛాశక్తి పూర్తిగా స్థంభించిపోయింది. (suspension of volotion) మేధో కణములమీద ఒత్తిడి అధికమై శక్తిహీనములైపోతాయి.

(ఈ పెద్దమాటలూ, పాలోవ్ వైఖరీ, ఆత్మవిశ్వాసంతో గూడిన సానునయ స్వరమూ బాగానే పనిచేసేయి. మోటారుబోటులోని వాళ్ళొకరిమొగాలొకరు చూసుకుంటారు.)

రక్షణదళ సభ్యుడు:-(చేతులురెండూ దోప్పగా నోటినుంచుం చుతూ) అమ్మా! (బహుమెల్లగా) ఓ అమ్మా!

(ఆ స్త్రీముఖంలో మినుకుమని చైతన్యం దీపించి నట్లవుతుంది. ఆమె తిరిగి చూస్తుంది.)

పాలోవ్:-(సెమ్యోనోవ్‌తో) చూసేవా! చికిత్స అవసరమైన సందర్భం! అచ్చంగా!

(మోటారుబోటు ఆ స్త్రీని యెక్కించుకుపోతుంది. పడవ ముందుకు బోయి, ఇన్‌స్టిట్యూట్‌ను సమీపిస్తుంది. అదంతా జలమయం. గోపుర భవంపు చేడీలను చిరుతరగలు చుంబిస్తున్నాయి. పాత దస్త్రాలను, ప్రయోగ లిఖితములను కట్టలుగట్టి, క్రింది అంతస్థునుంచి సురక్షిత స్థానాలకి కొందరు తీసుకుపోతున్నారు. కుక్కలబోనులు నీటిలో తేలుతుంటాయి. అక్కడక్కడ. కునక గృహంకూడ మునిగిపోయింది. కుక్కలు భయంతో వణుకుతూ, భ్రాంతనయనాలతో నీటిలో యీదుతున్నాయి. జబేలిన్ పడవమీద కూర్చుని, ముందు పడి చెక్కమీంచి వంగి ఓ కుక్కని మెడపట్టుకుని లోనికిలాగ యత్నిస్తుంటాడు. అప్పటికి బాగా చీకటిపడింది. మషాల్తీల చేతుల్లోని కాగడాలు ఆ భీభత్స దృశ్యాన్ని కాంతివంతం చేస్తున్నాయి. గాలి తీవ్రంగా వీస్తూంది.)

(రంగం తటాలున మారుతుంది.)

(అదే జలమయప్రదేశం. ఒక పడవలో పాలోవ్, వర్వారాలు, మరో దానిపై సెమ్యోనోవ్ వుండి నీళ్ళలోంచి కుక్కల్ని లోపలికి లాక్కుంటూంటారు. కుక్కల మూలుగులతో ఆప్రాంతం సందడిగా వుంది. నీటిలో సగం మునిగిన పొదరింట మూలలో చూరుబొద్దుపైన నక్కి నిల్చుని వుందొక బొచ్చు కుక్క. భయంతో దాని రోమాలన్నీ నిక్కబొడుచుకుని వున్నాయి.)

వర్వారా:-(పడవలో దగ్గిరికి వచ్చి) మంపస్! మంపస్! చ్ఛ!

చ్ఛ! చ్ఛ! దా! మంపస్! (వర్వారా చేతికందకండా కుక్క వెనక్కి తగ్గుతుంది.)

పావ్లోవ్:-సెమ్యోనోవ్! ఇల్లారా!

సెమ్యోనోవ్:- వస్తున్నా! (పడవను త్రోసుకుంటూ వచ్చి) ఏమిటంటారు, డాక్టర్!

పావ్లోవ్:-(కుక్కను చూపుతూ) ఆ స్త్రీ విషయం జ్ఞాపకం వుందా? అచ్చంగా అల్లాంటి పరిస్థితే! మానవయంత్రానికీ యితర జంతుయంత్రాలకీ భేదం లేదు! ఇంతవరకూ మానవుల దృష్టి యేమైపోయింది? ఈ అనుభవం మన ప్రయోగాల్లో కొంత వుపకరిస్తుందనుకుంటా!

వర్వారా:-(కుక్కను లోపికి లాగుతూ) ఎల్లాగంటారు, డాక్టర్ పావ్లోవ్?

పావ్లోవ్:-భౌతిక పరిస్థితులు దేహధారులన్నిటి మనోఫలకాల మీాదా దాదాపు ఒకేరీతియైన వృత్తి-ప్రతివృత్తుల్నీ, ముద్రల్నీ అచ్చొత్తుతూంటాయి. అతివేలమైన భయం మానవునిమీాదా, కుక్కమీాదాకూడ ఒకే ఒకమాదిరి ప్రతివృత్తిని (reaction) కలిగించడం యీా సందర్భంలో ప్రత్యక్షంగా చూసే అవకాశం కలిగింది. ఏమంటావు, సెమ్యోనోవ్?

సెమ్యోనోవ్:-ఔను. ఇది గమనార్హమని అంగీకరించక తప్పదు, డాక్టర్ పావ్లోవ్!

[తెర పడుతుంది.]

## అయిదో రంగం.

(ఇన్‌స్టిట్యూటులోని ముందుగదిలో జబేలిన్ మౌనంగా, ఆలోచనలో మునిగి, పచారు చేస్తుంటాడు. వర్వారా ప్రవేశిస్తుంది.)

వర్వారా:-ఏమండీ, డాక్టర్ జబేలిన్ ! ఏం నిర్ణయించేరు ?

జబేలిన్:-డాక్టర్ పౌలోవ్‌తో మాట్లాడాలి. మీరు గమనించిన దేమిటి ?

వర్వారా:-నాకూ చాలా ఆశ్చర్యంగా వుంది! అవి మునపటి కుక్కలేనా అనిపిస్తూంది. మునపటి మనోవ్యాపారాల జాడలే లేవు! రిఫ్లెక్సులన్నీ మటుమాయమైనాయనండి !

(సెమ్యోనోవ్ ప్రవేశిస్తాడు. వీరిద్దరినీ చూసి భుజాలు కుంచిస్తాడు.)

సెమ్యోనోవ్:-(లాభం లేదన్నట్లు చేతులు త్రిప్పుతూ) ఎంత పరిశీలించినా ప్రయోజనం లేదు! కుక్కల్లో మునపటి స్వభావాలే మారిపోయినట్లుంది! డాక్టర్ పౌలోవ్ యిక్కడికి రాలేదూ ?

జబేలిన్:-రాలేదింకా. ఆయనకేమని చెప్పాలో నాకేం పాలు పోడం లేదు ! నిజంగా.

(పౌలోవ్ ప్రవేశిస్తాడు.)

పౌలోవ్:-(మాటలోనే అందుకుని) దేన్నిగూర్చి, మిత్రులారా! ఎవరితో ?

జబేలిన్:-మీతోనే, డాక్టర్ ! మన కుక్కల్లో మునుపటి అలవాట్లు, స్వభావాలు కానరాడంలేదు. రిఫ్లెక్సుల అడాపొడా కూడా లేదు. మాకేమీ అర్థంగావడంలేదు!

పౌలోవ్:-అంతేనా. ఐతే చాలా బాగుందన్నమాట! (ముఖం మీద ఏదో సంతోషం దీపిస్తూంటే చేతులు నలుచుకుంటూ అటునిటు పచారు చేస్తాడు. ఏమీ అర్థంగాక తెల్లబోయి నిల్చున్న సెమ్యోనోవ్ యెదుట నిలబడి) ఏం? ఎందు కట్లా నిలబడ్డావ్? ఏమీ అర్థం కావడంలేదూ, బోల్షివిక్?

సెమ్యోనోవ్:-(నిరుత్సాహంతో) అదే పరిస్థితి.

పౌలోవ్:-బాగుంది, మిత్రమా! చాలా బాగుంది!

సెమ్యోనోవ్:- మీ సంతోషానికి కారణమేమిటో అడగ వచ్చునా, డాక్టర్! నిజానికి నాకు మీ ధోరణేమీ అర్థం గావడంలేదు.

పౌలోవ్:-తొందరపడకండి, నాయనలారా! మీకూ అర్థం అవుతుంది! పరిశీలనాదృష్టితో ప్రతి చిన్నవిషయాన్నీ వివ రాలతో సహా గమనించాలి, మననంచేయాలి! ఏం! వర్వారా?

వర్వారా:-డాక్టర్! ఈ వెల్లువవచ్చి కుక్కల్లో గిజ్ఞ్వాసలన్ని టినీ కడిగేసి తుడిచిపెట్టినట్లుంది! మనోవ్యాపారాలన్నీ క్షాళితములై పోయినాయండీ!

పౌలోవ్:-ఏమిటీ? ఏమిటంటున్నావో, మళ్లా చెప్పు! (హృదయ పూర్వకమైన నవ్వుతో) వర్వారా! నీవిప్పుడొక అపూర్వ సత్యాన్ని వుచ్చరించేవు! నీకు తెలియకుండానే. సరిగ్గా చెప్పేవు నువ్వు! క్షాళితములై పోయినాయి! కడిగేసి

తుడిచి పెట్టేసింది, వెల్లువ! ...సరిగ్గా జరిగినదే అది. తెలిసిందా? మెదడుమీద ఒత్తిడి అత్యధికమైనప్పుడు అది పని చేయడం మానేస్తుంది! 'రక్షకనివృత్తి'! (protective inhibition) ప్రాణియొక్క అస్తిత్వంకోసం యిది అవసరం. మనోవ్యాపారాలన్నీ స్తంభిస్తాయన్నమాట!...దీన్నిగూర్చి మన పరిశోధనలను ఋజువు చూచుకుందాం. వర్వారా! మంపస్‌ను లేబొరేటరీకి తీసుకునిరా. రండి, వెడదాం.

[అందరూ నిష్క్రమిస్తారు.]

(లేబొరేటరీ వరండాలో అందరూ, నికోడిమ్ వున్నారు. పాలోవ్ గబగబ ఆజ్ఞలిస్తుంటాడు.)

పాలోవ్:-నికోడిమ్! ఓ బాల్చీ, నీళ్ళు, పెద్ద రేకూ.

నికోడిమ్:-ఇప్పుడే తెస్తా. నాకేమీ అర్థంకావడమే లేదు, నా అభిప్రాయం. (వెడుతూంటాడు.)

పాలోవ్:-చెప్పినట్లుచెయ్! తర్వాత అన్నీ అర్థమవుతాయి.

(అందరూ దిగ్భ్రాంతులైనట్లు చూస్తుంటారు. ఒకరిముఖాలొకరు చూసుకుంటూ నిలబడ్డారు.)

పాలోవ్:-(వాళ్ళని చూస్తూ చిరునవ్వుతూ) నాకు మతిపోయిందనుకుంటున్నట్లున్నారేం? అబ్బే! నేను బాగానేవున్నా, నిక్షేపరాయుడిలాగ! మనం యిప్పుడు 'అషురు' ను వెంబడించి, నాడీమండలంమీద దాని కల్లాటి ప్రభావం వున్నదీ తేలుస్తాం......

జబేలిన్:-ఓహో!......

(లేబరేటరీలోని ఒక గదిలో మంపస్‌ను పెట్టి తలుపు మూస్తారు. గదిలో జరిగేదంతా పెరిస్కోపులో ప్రత్యక్షంగా కనబడుతూంటుంది. పావ్లోవ్ పెరిస్కోపు అద్దంలోకి చూస్తుంటాడు. నికోడిమ్ గదిగుమ్మంలో బాల్చీతో నీళ్ళను పోస్తూంటాడు. సెమ్యోనోవ్ యినపరేకును ధణధణమనిపిస్తున్నాడు. జబేలిన్, వర్వారాలు గాలి హోరుమంటూన్నట్లు శబ్దాన్ని గావిస్తున్నారు.)

పావ్లోవ్:- (పెరిస్కోపులోనికి చూస్తూ) గాలి! అబ్బే! చాలదు. గాలి రైంయ్‌మంటూ వీచాలి!

(జబేలిన్, వర్వారాలు శాయశక్తులా గాలి హోరులా శబ్దాల్ని గావిస్తుంటారు.)

పావ్లోవ్:-నీళ్ళు బాగా పొయ్యాలి!

(నికోడిమ్ నీరు అదేపనిగా పోస్తుంటాడు. పావ్లోవ్ కంటిని పెరిస్కోపు అద్దానికి వత్తి చూస్తుంటాడు. గదిలోని కుక్క తలుపుక్రిందినుంచి జాలువారు నీటిని చూస్తుంది. గాలి హోరుమంటున్న శబ్దాన్ని వింటుంది. భ్రాంత నయనాలతో వణకుతూ, మూలచేరి వెనుక కాళ్ళమీద క్రుంగి చతికిలబడిపోతుంది. రోమాంచం. నీరు గదిలో మడుగు కడుతూంది. కుక్క పటకాలో గింజుకుంటూ, వున్నట్లుండి కొయ్యబారి, ఒక విధమైన మైమరపులో మునుగుతుంది)

పావ్లోవ్:-(విజయసూచకంగా) ఆఁ! అదే! చూడండి!

(గదితలుపుల తెరుస్తాడు. అందరూ లోనికి చూస్తారు. కుక్క కట్టుత్రాటిలోనే నిద్రిస్తూంటుంది. పావ్లోవ్ దగ్గిరికి బోయి కుక్క ముంగాలు యెత్తుతాడు. అది వదులుగా వ్రేలాడుతూంటూంది.)

పావ్లోవ్:-చూసేరా? కాలు పట్టులేకండా, వ్రేలాడుతూంది!

జబేలిన్:-అపస్మారము! నిద్ర!

పావ్లోవ్:-(ఉత్సాహంగా) అంతే! సరీగా అంతే! నాడీమండలంమీదా, మెదడుమీదా ఒత్తిడి అత్యధికమైనపుడది హఠాత్తుగా క్రుంగిపోతుంది. మానవుల్లో కూడా యింతే.

దుఃఖం, క్రోధం, భయం, కరుణ, సుఖం మొదలైన భావాలు అత్యధికమైనపుడు హఠాత్తుగా మెదడు పని చేయడం నిల్చిపోతుంది. వరదల్లో మనం చూసిన స్త్రీ విషయం గుర్తులేదూ ?

సెమ్యోనోవ్:-(సాలోచనగా) భ్రమజెందినట్లు, భ్రాంతిపడినట్లు కనబడే రోగులున్నారే, మానసికరోగులు; వాళ్ళలో ఆ రోగలక్షణాలు యిలాంటి కారణాలవల్లనే కలుగుతూన్నా యంటే ఆశ్చర్యం లేదు !

పాలోవ్:-(వికసితవదనంతో) ఆఁ ! బాగా గ్రహించేవు, సెమ్యోనోవ్ ! చూసేవూ ! అల్లాంటి కేసుల్లో కృత్రిమ పద్ధతులద్వారా గాఢ నిద్రను గలుగచేస్తే ? సుదీర్ఘ నిద్ర సుమా ? ఏం ? దానివల్ల యేం జరుగుతుందో తెలుసా ?

సెమ్యోనోవ్:-గాఢమైన వుద్రేకాలవల్ల అలసి, అవసిపోయిన మనస్సూ, నాడీమండలమూ కూడ క్రమంగా తేరుకుంటాయి. అందుమూలంగా......

పాలోవ్:-భేష్ ! తెలిసిందిగాదూ ? అమితవేగములవల్ల శ్రమ జెంది, స్తంభించిపోయిన మెదడుకు విశ్రాంతినిచ్చి, యథా స్థితికి దేవచ్చు. 'రక్షకనివృత్తి' అని మన తత్వశాస్త్రజ్ఞు లంటారే, అదేమిటి ? అతివేలమైన భావోద్రేకంవల్ల కలిగే బాధనుంచి శరీరాన్ని రక్షించేందుకై, బాహ్యోద్రేకాల నుంచి మనస్సు నివర్తితమైపోయి, నాడీమండలానికి పూర్ణ

విశ్రాంతి నిస్తుంది, పిల్లినోట పడ్డ యెలుక కివలె! 'తంద్ర' అని చెప్పచ్చు. మనోవ్యాధుల్లో యీ రకమైన దీర్ఘకృత్రిమ నిద్రను కలిగించి, చికిత్స చేయవచ్చును. తెలిసిందా?...

---

## ఆరో రంగం.

[లెనిన్‌గ్రాడ్ (పిట్రోగ్రాడ్) లోనే ఒక మెంటల్ హాస్పిటల్ తాలూకు వుద్యానం. పావ్లోవ్, సెమ్యోనోవ్, జబేలిన్‌లు, మరికొందరు డాక్టర్లూ నడుస్తూంటారు. తీరైన బాటలు, పూలమొక్కలు, అందమైన చెట్లూను. చల్లనిగాలి వీస్తూంది.

తోటలో కొందరు రోగులు స్వేచ్ఛగా తిరుగుతుంటారు. ఒకడు పరుగెడుతూ హఠాత్తుగా నిల్చిపోయినట్లుంటాడు. ఇంకోడు విపరీతపు తీరులో, విడు గడివినట్లు నిశ్చలంగా నిలిచివుంటాడు. ఇంకొకచో హాస్పిటల్ గౌనులో నెపోలియన్ తీరులో నిలబడి పావ్లోవ్‌ను రమ్మని సంజ్ఞచేస్తాడు ఒకరోగి. పావ్లోవ్ ఆ రోగిని సమీపిస్తాడు.]

రోగి:- (వుద్రేకంతో) మూరట్ దగ్గిరికి వెళ్లు. గుర్రాన్ని దౌడు తీయించు. గార్డ్సు దళాన్ని యుద్ధరంగంలోకి వురికించమని అతనితో చెప్పు. (హఠాత్తుగా పావ్లోవ్ జబ్బులు దొరకబుచ్చుకొని కుదుపుతూ) ఏమిటి? చెప్పవేం? ఇదంతా ఓ పెద్ద పొరబాటే అంటావా?

పావ్లోవ్:- (ప్రశాంతంగా) ఆఁ! ఔను! ప్రభూ! ఇదంతా కేవలం పొరబాటే! భ్రమ!

(పావ్లోవ్ ముఖంలో, కళ్ళల్లో అంత ప్రశాంతతా, కరుణా, సాధుత్వం మరొకప్పుడు ఎవరూ చూచివుండరు.)

రోగి:- ఓస్సాయి! ఐతే సరే! వెళ్ళు! (ఆలోచనలో మునుగుతాడు.)

(అంతా ముందుకు సాగిపోతారు.)

మనోవైద్యుడు:- (పాలోవ్‌తో) డాక్టర్ పావ్లోవ్! ఇతనిది కుదరని మొండివ్యాధియని వైద్యులంతా నిరాశ చేసుకొన్నారు. కాని, యేమో? అపూర్వమైన మీ ప్రయోగాలు చూసి, మా కందరికీ ఆశలు రేకెత్తుతున్నాయి...

(నడుస్తూంటారు. మరొకచోట యింకో రోగి కానవస్తుంది. ఆమె యువతి. చక్కని ముఖం. చకిత నేత్రాలు. గాలికి రాలుతూన్న ఆకుల్ని చేతులుజాచి పట్టుకుంటూందామె.)

పాలోవ్:- (మృదువుగా) కులాసాగా వున్నావా, అమ్మా?

యువతి:- (దృష్టి ఆయనమీద నిలిపి) ఆc! కులాసాగానే వున్నానండి. డాక్టరుగారూ! మీకు నా వందనాలు. నా మనస్సు యెంతో తేటగావుంది. మెదడు తేలిగ్గా, తాజాగా వుందనిపిస్తూంది... నేను రెండు వారాలుగా నిద్రబోతున్నానని చెప్పేరు, అందరూ. ఈ ప్రపంచాన్ని యిప్పుడే మొదటిసారి చూస్తున్నానా? అనిపిస్తూంది. మబ్బులూ, చెట్లూ యెంత బావున్నాయి! ఎంత చక్కటి గాలి! ... (కించిల్లజ్జతో చిరునవ్వుతో) డాక్టర్! మీకు నేనెంతో ఋణపడి వున్నాను...

(అందరూ పాలోవ్ వైపు సగౌరవంగా, మౌనంగానే చూస్తూవుంటారు. ఆ యువతి హఠాత్తుగా పాలోవ్ చేతిని పట్టుకుని ముద్దుపెట్టుకో చూస్తుంది.)

పౌలోవ్:- (చేతులు వెనక్కి పెట్టేసుకుంటూ) ఇదుగో! ఇదుగో! అమ్మా! నువ్విల్లా చెయ్యకూడదు... ఇందులో నా ప్రజ్ఞ యేమీ లేదు. నీకు పునరారోగ్యం కలిగినందుకు నాకు చాల ఆనందంగా వుంది. నేనెంతో సంతోషిస్తూన్నా. సుఖంగా వుండమ్మా!... (ఆశీర్వదించి) ముందుకు సాగుతూంటాడు.)

వృద్ధ వైద్యుడు:- డాక్టర్ పౌలోవ్! మీరు మా చికిత్సా విధానంలో అనధికారంగా ప్రవేశించేరని మా కందరికీ కొంచెం యిదిగానే వుండేది, చెప్పొద్దూ. కాని, మీ నిద్రా చికిత్సనూ, దానివల్ల కలుగుతూన్న ఫలితాలనూ కండ్లారా చూచేక మా వెనకటి అభిప్రాయం మార్చుకోవాల్సి వస్తూంది. మే మందరం మీ పరిశోధనలను సప్రమాణము లని అంగీకరించుతున్నాం...

(మాట్లాడుకుంటూ హాస్పిటల్‌లోనికి ప్రవేశిస్తారు. గాలి వెలుతురులు పుష్కలంగా వచ్చే విశాలమైన వార్డులు. వరుసలుగా వున్న మంచాలమీద రోగులు నిద్రిస్తూంటారు. ప్రశాంతంగా వుందంతా. ఒక నర్సు డ్యూటీమీదుంటుంది. ఆమె టేబిలుమీద గడియారం మెల్లగా టిక్‌టిక్ మంటూంది. కిటికీలు బార్లా తెరిచివున్నాయి. గాలికి కిటికీ తెరలు మెల్లగా తటతటలాడుతూ కొట్టుకుంటున్నాయి.)

పౌలోవ్:-(ఏదో ఆలోచనలో వున్నట్లుండి) ఆఁ! అదీ విషయం! చైతన్యం అంటే యేమిటి? ఏమో! ఇంతవరకూ మానవుని సమాధానం యిదే; అప్రాప్యం, అగ్రాహ్యం! దానిని వివరించేందుకు వాక్కులు చాలవు, మనస్సుకుకూడ అది

అందనిదే నన్నారు!... కేవలం యింతకన్న తెలివితక్కు వేముంది? వృథా కాలక్షేపం మాటలు! అదేమిటో తెలుసుకోడాని కింతవరకూ జరిగిన అన్వేషణంతా పిల్ల లాట లాంటిది! (ప్రకృతానికి వచ్చి, తాపీగా అంటాడు.) అజ్ఞేయం అనే దెక్కడా లేదండీ, అయ్యా! తెలిసిందిగా దండీ, లేబొరేటరీ అవసరం యెంతవున్నదీను? రోగ చికిత్సలో మానసిక లక్షణాలను నిర్ధరించడం యెంతఅవసరమో వేరే చెప్పాలా? లేబొరేటరీకీ, హాస్పిటల్‌కీ మధ్యనున్న అగాధాన్ని మనం కలపగలగాలి...... ప్రస్తుత చికిత్సా విధానం...

సెమ్యోనోవ్:- డాక్టర్ పౌలోవ్? మనం వెడదామా? ఇప్పటికే చాలా ఆలస్యమైంది.

పౌలోవ్:- వెడదాం, వెడదాం... విదేశీయమిత్రు లిప్పుడేమంటారో వినాలి. నా కెంతో కుతూహలంగా వుందనుకో...

[నిష్క్రమిస్తారు.]

(తెర లేస్తూండగానే పౌలోవ్‌ల గృహంలో భోజనాలగది. సెరాఫిమా టేబిలుమిద ప్లేట్లు అమరుస్తూంటుంది. కుమార్తె వీరా పుస్తకం పట్టుకుని లోనికివచ్చి, కుర్చీలో కూర్చుంటుంది.)

సెరాఫిమా:- వీరా! టైమెంతో చూసేవా? (గడియారం వైపు తలెగరేస్తూ) ఆరుకి మూడునిముషాలుంది. నాన్న గారు వస్తారు...

వీరా:- వుండమ్మా. ఈ కొంచెం చదివేసి...

సెరాఫిమా:- నా మాటవిను, తల్లీ! ఈ సమయంలో చదవడం నాన్నగారికి యిష్టంవుండదు గదూ. పుస్తకం దాచెయ్యవు? తర్వాత చదువుకుందువుగాని. అమ్మగాదూ?

(వ్లాడిమిర్ ప్రవేశిస్తాడు. అతడిప్పుడు పరిణత వయస్కుడు. గడియారం ఆరు కొడుతూండగానే పావ్లోవ్ గుమ్మంలో కనిపిస్తాడు. అంతా తలో కుర్చీ దగ్గరా నిల్చుని వుంటారు. పావ్లోవ్ మెడలో పూలరుమాలు చుట్టుకుని వుంటాడు. ఆయన కూర్చున్నాక అందరూ కూర్చుంటారు.)

పావ్లోవ్:- (రొట్టె కోస్తూ, కేబేజి పులుసుగిన్నె దగ్గరగా లాక్కుంటూ) వొలోడ్యా! తెలిసిందిగాదూ. మనం అమెరికాకు బైలుదేరుతూన్నాం...

సెరాఫిమా:- (ఆశ్చర్యంతో) ఎప్పుడూ?...

పావ్లోవ్:- ఎందుకంత కంగారుపడతావు? సీమా! వెనక మనం యింగ్లండు వెళ్ళేం గుర్తుందా? (నవ్వుతూ) కేంబ్రిడ్జిలో మనల్ని చూడ్డానికి ముగ్గురు పెద్దమనుష్యులు వచ్చేరు, గుర్తులేదూ? మన రిఫ్లెక్సులు తమదేశంలో అంతగా ప్రజామోదాన్ని పొందవుట! హ్హా! హ్హా! హ్హా! ఇప్పుడేమంటారో వాళ్లు! చూస్తాంగదూ?...

సెరాఫిమా:- ఇంగ్లాండుకు మళ్ళా వెడుతున్నారా?

పావ్లోవ్:- ఆఁ! అమెరికాలో వుపన్యాసాలు. వివిధ కేంద్రాల్లో. అక్కణ్ణుంచి యింగ్లండు. అక్కడ కాంగ్రెస్‌కు హాజరుగావాలి. (కుమారునితో) వోలోడ్యా! నువ్వూ నాతో వస్తున్నావు. తెలిసిందా?

వ్లాదిమిర్:- (సంతోషంగా) అల్లాగా, నాన్నగారూ! నాకు దేశాటనమంటే చాల సరదా. ఎన్నిరోజులుంటామక్కడ?

పొలోవ్:- మనం సరదాకోసం గాదోయ్, యీ ప్రయాణం చేస్తూన్నది! గుర్తుంచుకో. దృశ్య దర్శనార్థం ఒక్క క్షణం కూడ, ఒక్క కోపెక్కుకూడ వెచ్చించము. కార్యార్థులమై వెళుతున్నాం. ప్రభుత్వపు ఖర్చుతోనే మనం యీ యాత్ర గావిస్తున్నాం. సిద్ధంగా వుండు. (బోండా తీసుకుతింటూ) సీమా! బోంటాలు చాల బాగున్నాయి!...

(సీమా కప్పుల్లో టీ పోస్తూంటుంది.)

[తెర]

## ఏడో రంగం.

(అమెరికాలో న్యూయార్కు నగరంలోని హార్బరు ప్రాంతం. ఓడ యీలలు చెవులు గింగిర్లెత్తిస్తూ వినిపిస్తుంటాయి. ఘట్టంలో డా. పొలోవ్, వ్లాదిమిర్లు నడుస్తున్నారు. సామాను నెత్తికెత్తుకుని నీగ్రోకూలీ వారి వెనకే వస్తుంటాడు. చుట్టూ ఫొటోగ్రాఫర్లు, పత్రికావిలేఖరులు సిద్ధంగా వున్నారు. విజ్ఞానవేత్తలు కొందరు ఆయన కెదురువోయి స్వాగతమిస్తారు.)

ఒక వృద్ధశాస్త్రవేత్త:- మిస్టర్ పొలోవ్! వందనాలు. తమకు స్వాగతం యివ్వడానికి మాకెంతో ఆనందంగా వుంది. మీరు రావడం మా దేశాన్ని గౌరవించినట్లే!

(అందరూ టోపీలు చేతపట్టుకుని పొలోవ్‌తో కరచాలనం చేస్తూంటే, ఒక పెద్దమనిషి అందరినీ త్రోసి త్రోవచేసుకుంటూ ఆయనను సమీపిస్తాడు. అతడెవరోగాదు. 1917 లో పొలోవ్‌ను రష్యా వీడిరమ్మని ఆహ్వానించిన హిక్స్ యీతడే.)

హిక్స్:- (పాలోవ్‌ను సమీపించి, చేయిజాపుతూ) మిష్టర్ పాలోవ్! మీకు మా దేశంలో స్వాగతం యివ్వగలిగి నందుకు నాకెంతో సంతోషంగా వుంది... ఇదివరలోనే నాకు తమ పరిచయభాగ్యం లభించింది...

(పాలోవ్ హిక్స్‌ను గమనించకండా వుదాసీనంగా ముందుకి నడిచిపోతాడు. హిక్స్ చిన్నబోయి కంగారుగా టోపీ నెత్తిన బెట్టుకుంటాడు. పాలోవ్ చిన్న నాటి మిత్రుడు, సహపాఠి, తర్వాత ఉన్నతోద్యోగియై, విప్లవం తర్వాత దేశాన్ని వీడిన పిత్రిశ్చేవ్ గుంపులోంచి త్రోవచేసుకుని పాలోవ్‌ను సమీపిస్తాడు.)

పిత్రిశ్ఛేవ్:- (ముందుకువస్తూ) ఇవాన్ పిత్రోవిచ్! ప్రియ మిత్రమా! నిన్ను చూడగలిగినందుకు చాలాసంతోషంగా వుంది. ఇప్పుడక్కడ యెల్లావుందో చెప్పవు? నాలుగు మాటలు... ఏదీ నీ చెయ్యి... (చేయిజాపుతాడు.)

(రిపోర్టర్లు ఆతృతతో చుట్టూ మూగుతారు. సోవియటు రష్యానుగూర్చి అకడమీషియన్ పాలోవ్ అభిప్రాయాలు విని, రిపోర్టుచేయడానికి వాళ్ళెంతో కుతూహలంగా వున్నారు.)

పాలోవ్:- (కటువుగా) ఏమిటీ? అక్కడెల్లా వుందంటావా? వానకురిసి వెలిసినట్లుంది! చెత్తా చెదారం కొట్టుకుబోయి శుభ్రంగా వుందనుకో! దానికేం అడల్లావుంచు... కాని,- నేను దేశద్రోహితో...

(గబగబా నడుస్తాడు. అందరూ నిర్ఘాంతపోతారు. ఇమిగ్రేషన్ ఆఫీసుదగ్గర చాలమంది విదేశీయులు తమ కాగితాలు తనిఖీ చూపించేందుకు వేచియుంటారు. పాలోవ్ సపరివారంగా అక్కడికిపోయి, ఓ చిన్న కిటికీదగ్గర తన పాస్ పోర్టును చూపుతాడు. దాన్ని చూడ్డంతోనే ఆఫీసరు తలను బైటికిపెట్టి, చిరునవ్వుతో చూస్తాడు.)

ఇమిగ్రేషన్ ఆఫీసరు:- అయ్యా! క్షమించండి! దీనిమీదే సన్తకు తిని నమోదుచేయడానికి వీల్లేదు.

పాలోవ్:- ఏం? ఎందువల్ల?

ఆఫీసరు:- మాకు మీ దేశంతో దౌత్యసంబంధాలు లేవుగనక నండీ, మీకు అభ్యంతరం లేకపోతే పైన మరోచీటీ అంటించి నమోదుచేయిస్తానండీ. (అంటూ ఒక స్టాంపు నెత్తుతాడు.)

పాలోవ్:- దయచేసి ఆగండి! నాకు పనికివచ్చిన పాస్‌పోర్టు మీకూ పనికిరావాలనుకుంటూ! అయ్యా! ఆ పాస్‌పోర్టు మీదే మీ స్టాంపును వేయండి. అల్లాచేయడానికి...

(చుట్టూవున్నవాళ్ళ ముఖాల్లో ఆశ్చర్య సంభ్రమాలు ముప్పిరిగొంటాయి. తలపండిన విలేఖరి ఒకడు చిరునవ్వుతో ముందుకువస్తాడు.)

ఆఫీసరు:- వీల్లేదని చెప్పడానికి విచారిస్తున్నాను. అది మా రెగ్యులేషన్లకి వ్యతిరేకం. అల్లా చేయలేను, క్షమించండి!

పాలోవ్:- (పాస్‌పోర్టును అందుకుంటూ) ఇవే పరిస్థితులైనట్లయితే నేను మీ దేశంలో అడుగుపెట్టజాలనని చెప్పడానికి విచారిస్తున్నానండి, అయ్యా!... సెలవు...

(వెళ్ళిపోతున్న పాలోవ్‌ను చాలమంది వెంబడిస్తారు. అతనివెనకే వ్లాదిమిర్, నీగ్రోకూలీ వుంటారు. కెమేరాలు క్లిక్ క్లిక్ మంటున్నాయి.)

వృద్ధ విలేఖరి:- భేష్! మిష్టర్ పాలోవ్!... ఈ మాత్రం పెంకితనం వుండాల్సిందేనండీ! అయ్యా!

ఒక యువవిలేఖరి:- మీ కింత సంతోషం దేనికండీ?

వృద్ధ విలేఖరి:-మనవడా! నువ్వింకా అర్థంచేసుకోలేని విషయా లెన్నోవున్నాయోయ్! మన దేశంకూడా గుర్తించబడని కాలం వుండేదని నీకు తెలియదనుకుంటానేం? ఏమో? మన పూర్వీకులు కూడా యూరోపులో సరిగ్గా యీ విధం గానే ప్రవర్తించివుంటారు, బహుశా!

[తెర పడుతుంది]

(ఓడలోని కాబిన్ (గది) లో టేబిలుదగ్గర కూర్చుని యేదో రాసుకుంటూ, తనలోనే యేదో మాటాడుకుంటూ, అభినయిస్తూంటాడు, పావ్లోవ్. బిస్కట్టు కొరుకుతూ వ్లాదిమిర్ ప్రవేశిస్తాడు.)

వ్లాదిమిర్:- (దిగులుగా) నాన్నగారూ!

పావ్లోవ్:-(పరధ్యాన్నంగా) ఊఁ!

వ్లాదిమిర్:-నాన్నా! మిమ్మల్నే!

పావ్లోవ్:-ఎవరూ? వొలోడ్యా! నువ్వా! ఏమిటి?

వ్లాదిమిర్:-దిగుమతంతా పూర్తయిందిట. మనం యిప్పుడింక ప్రయాణీకులంగాదు. కనక సరంగులమని సంతకంచేసి ప్రయాణం చేయాల్సి వుంటుందిట.

పావ్లోవ్:-ఏమిటీ? సరంగులుగానా?

వ్లాదిమిర్:-ఔను, నాన్నా! మరోగత్యంతరం లేదు.

పావ్లోవ్:-ఓహో! (విషయం మెల్లగా బుర్రకెక్కుతుంది. తిరిగి చూసి) హ్హా! హ్హా! హ్హా! సరంగు పావ్లోవ్! విధివైచిత్ర్యం!

(ఓడకెప్టెన్ గదిగుమ్మంలోకి వచ్చి, యీ నవ్వును విని, గతుక్కుమని టోపీ నుదుటిమీదికి లాక్కుంటాడు.)

కెప్టన్:-(ముందుకువస్తూ కంగారుగా) తమబోంట్లను యిక్కడ వుంచుకోడానికి నాకు చాల సంతోషమే అనుకోండి, అయ్యా! కాని, ఓడ బొగ్గు వేసుకొనేచోటికి పోతూంది. అది మీలాంటివారికంతగా ఆకర్షనీయమైన స్థలంగాదని నా భయం......

పాలోవ్:-ఐతే యేం చేస్తాం?......

(ఇమిగ్రేషన్ ఆఫీసరు ప్రవేశిస్తాడు.)

ఆఫీసరు:-(అతినమ్రతగా) అయ్యా! నేను స్టేటుడిపార్టుమెంటుతో మాట్లాడాల్సి వచ్చిందండీ......

పాలోవ్:-(ఉల్లాసంగా చిరునవ్వుతో) మీకు శ్రమ యిచ్చినందుకు చాల విచారిస్తూన్నాను.

ఆఫీసరు:-క్షమించండి. మీకేమేము శ్రమగలిగించేము......

కెప్టన్:-(ఈ మర్యాదలు చూచి ఓరిమి పట్టలేక చిరాకుతో) అయ్యో దేవుడా! నలిపి చంపుతున్నావేమిటయ్యా? వాళ్ళే మన్నారో చెప్పరేమండీ? నాకు చాలా ఆలస్యమవుతూంది......

ఆఫీసరు:-(కోపంగా) ఊరికే మధ్య మీ యిదేమిటండీ? (పాలోవ్ తో నమ్రతగా) అయ్యా! అంతా సవ్యంగానే వుంది. తమరు రాండి.

కెప్టన్:-(నిట్టూరుస్తూ, టోపీతీసి, నుదిటి చెమట గోటితో వూడుస్తూ) అమ్మయ్య! బ్రతికేమురా, భగవంతుడా! ఈ మాట చెప్పడానికి వూరికే నలిపి చంపుతాడేమిటంటా?...

పావ్లోవ్:-నడవండి. (లేచి నిల్చుంటాడు.) అమ్మో! (హఠాత్తుగా రెండుచేతులా డొక్కలో పట్టుకుని, అతికష్టంమీద వాలుకుర్చీ దగ్గరికి పోయి కూర్చుని మూలుగుతాడు.)

వ్లాడిమిర్:-(ఉలిక్కిపడి) ఏమిటి, నాన్నా? ఏమిటది?

పావ్లోవ్:-(అంతలో సమాళించుకుని) ఏం లేదులే, వొలోడ్యా! తగ్గిపోతుందిలే. డొక్కలో పోటు......

[తెర పడుతుంది.]

(నేపథ్యంలో)

పత్రికలమ్మే పిల్లలు:-తాజావార్తలు!

—రాక్‌ఫెల్లర్ యిన్‌స్టిట్యూట్‌లో పావ్లోవ్ వుపన్యాసం!

—న్యూయార్క్‌లో రష్యన్ రిఫ్లెక్సులు!

—సోవియట్ శాస్త్రజ్ఞుని పాదాలవద్దా అమెరికా విజ్ఞాని థారన్‌డైక్ స్థానం?

—పావ్లోవ్‌కు వీసా * యివ్వడానికి బ్రిటిష్ కాన్సల్ నిరాకరణ!

—కేంబ్రిడ్జి గౌరవడాక్టర్ బోల్షివిక్ చారుడా?

—సోవియట్ శాస్త్రజ్ఞునికి ప్రవేశనిరాకరణ: బ్రిటిట్ శాస్త్రజ్ఞుల తీవ్ర నిరసన!

---

* దేశంలో ప్రవేశించేటందుకు అనుమతి పత్రం.

# ఎనిమిదో రంగం

(ఇంగ్లండులో ఎడింబరోనగరం. విశ్వవిద్యాలయంలోని విజ్ఞాన పరిషత్ భవనం. పరిషత్సమావేశం జరుగబోతూంది. వేదికమీది అధ్యక్షవర్గ పీఠాల్లో ఒకటి ఖాళీగా వుంటుంది. దిగ్దంతులవంటి శాస్త్రజ్ఞులంతా వచ్చి కూర్చుని వున్నారు. ఛైర్మన్ మనకు పూర్వపరిచితుడైన డాక్టరు బూయింగ్టన్.)

ఛైర్మన్:- (ఉపన్యాసధోరణిలో) అకడమీషియన్ పౌలోవ్, కేంబ్రిడ్జి గౌరవడాక్టరు, మన మధ్య (కుర్చీచూపుతూ) నీ గౌరవ స్థానంలో కూర్చోవాల్సినవారు, ఇంతవరకిక్కడ కెందుకు రాలేదో మీకు కొంచెం విన్నవించాల్సివుంది. కేవల రాజకీయకారణాల్నే పురస్కరించుకుని మన ప్రభుత్వం ఆ విజ్ఞానికి వీసా నివ్వనిరాకరించిందని చెప్పాల్సి వచ్చినందుకు చాల విచారిస్తున్నాను. (ఖాళీకుర్చీవైపు తిరిగి అభివాదనం చేస్తాడు.) ఈ చర్యపట్ల మన అసమ్మతిని పార్లమెంటులో వెల్లడించాము. ఉద్యోగులు దిగిరాక తప్పింది గాదు. మరో మూడునిముషాల్లో ఆధునిక రష్యా మహా విజ్ఞాని, శరీరశాస్త్రవేత్త, డాక్టర్ పౌలోవ్‌కు వుపన్యాస వేదిక నొసగాల్సివుంది. ఆయన నియమ పాలనలో బహు ఖచ్చితంగా వుంటారని మనకందరకూ తెలిసిందే. ఈ తూరి ఆయన గనక సమయానికి రాకపోయినట్లైతే అందుకు బాధ్యత యెవరిదై వుంటుందో తమకు నేను చెప్పనక్కర లేదు. ఈ నాటి కార్యక్రమం ప్రకార......

(సభలో ముందు కుర్చీల్లో గుసగుసలు. కేంబ్రిడ్జిలో పౌలోవ్‌ను చూడ వచ్చిన బూయింగ్టన్ మిత్రులిరువురూ అక్కడే కూర్చుని వున్నారు.)

ఒకరు:-(మెల్లగా ప్రక్కవానితో) బూయింగ్టన్, యీ సందర్భంలో కాస్త అధికోత్సాహాన్ని ప్రదర్శిస్తూన్నాడు కాదూ?

రెండోవారు:- (గుసగుసగా) సందేహమేమిటి?... పావ్లోవ్ నూతన సిద్ధాంతాల్లో మనవాడికి సానుభూతి వుందని తోస్తూంది!...ఐనా, పావ్లోవ్ యిప్పుడీ మీటింగుకి రాలేడనే నా నమ్మకం. అదీగాక ఆయనగారు యిప్పుడు కొత్తగా చెప్పేదేమీ వుండదులే. (ఇబ్బందిగా గడియారాన్ని చూసుకుంటాడు.)

(పురాతనమైన గంటస్థంభం నుంచి శ్రావ్యంగా ఘంటాధ్వానం వినవస్తుంది. పావ్లోవ్ సభాభవనంలో ప్రవేశించి, చురుకుగా పెద్ద అంగలతో నడుస్తూ, వేదిక మీదికి పరుగెడతాడు. సభికులంతా లేచి, ఆయనమీదే దృష్టి నిలిపి, హర్షధ్వానాలు చేస్తూంటారు. పావ్లోవ్ సభకు ఒక్క నమస్కారబాణం వదలుతాడు. ముందువరసల్లో కూర్చున్న విజ్ఞానవేత్తలకు సగౌరవంగా మరొక్క నమస్కారం విసరి, అధ్యక్షపీఠంమీద చేతులాని, వుపన్యాసం ఆరంభిస్తాడు.)

పావ్లోవ్:-మహాజనులారా! సోదర శాస్త్రజ్ఞులారా! విజ్ఞానరంగంలో ప్రమాణాలు, నిదర్శనాలు చూపడంకంటె మించిన వాక్చాతుర్యం వేరే లేదని నా నమ్మకం...నాడీమండల వ్యాపారాలన్నీ, అత్యున్నతమైనవీ, విశిష్టమైనవీ ఐన మనోవ్యాపాలతో సహా, భౌతిక పరిస్థితులపైననే ఆధారపడివున్నాయి......మనోవ్యాపారములన్నీ బాహ్యపరిస్థితులచే నిబద్ధములైనవే నని ఋజువు చేయగలిగినప్పుడు ...ఆత్మ, చైతన్యం,-అనేవాటి విషయమై యింతవరకూ వ్యాపించియున్న భావాలన్నీ పటాపంచలౌతాయి......

(పాలోవ్ తన వుపన్యాస వాచకాన్ని చదివి. కాగితాలు ఓ ప్రక్కన పెట్టేసి, సభవైపు చూస్తూ కలకలమూ, హర్షధ్వనులూ సద్దు మణిగేవరకూ వేచి యుంటాడు. తర్వాత పాలోవ్‌ను పూర్వపక్షం చేసేందుకు వృద్ధపండితుడొకడు లేస్తాడు.)

వృద్ధ పండితుడు:-మహాజనులారా! పండిత వర్యులారా! అకడ మీషియన్ పౌలోవ్ చదివిన పత్రానికి మనందరం యెంతో ఆనందాన్ని పొందియున్నాము. అందులోని విషయాలు అత్యుదాత్తమైనవేగాక ప్రామాణికమైనవి కూడానని అంగీకరించకతప్పదు. కాని, వాటినిబట్టి ఒకేఒక సామాన్య సిద్ధాంతాన్ని యేవిధంగా (మాటలకోసం తడబడతాడు.) ...చేయడమూ? అనేదే సమస్య. ద్విపాత్తులైన మానవులకూ, చతుష్పాత్తులైన శునకాదులకూ, కపాలాపాతులైన జలచరాదులకూ కూడ ఒకే ప్రమాణాన్ని వర్తింపజేయడం యెంతవరకూ యుక్తియుక్తమని ప్రశ్నించాల్సివస్తూంది!...

పౌలోవ్:-మీరు వాక్రుచ్చినవీ, మరి యితరములైనవీ ప్రాణులన్నిటికీ సామాన్య లక్షం ఒకేఒకటి వున్నదికదా! అదే జీవము...చైతన్యం...

ఒకవృద్ధ పండితుడు:- (మధురంగా చిరునవ్వుతో) క్షమించండి, మిస్టర్ పౌలోవ్! ఒక్కప్రశ్న అడగనీండి. మానవుడు కేవలం నాడీపూరితమైన ఒక యంత్రమనియేనా మీ సిద్ధాంతం?

పౌలోవ్:- (ఉటంకరించే స్వరంతో) కాదండి, అయ్యా! ప్రకృ

తిలో కంతకీ పరమోత్కృష్టమైన జీవపరిణామమే మానవు డని నా అభిప్రాయం! మానవుడొక్కడే యీ పృథ్వీమీద అమరుడు! చేతల్లోనూ, చైతన్యంలోనూ, మానవత్వం లోనూ అతడు నిత్యజీవి! తెలిసిందిగదూ?

(సభలో హర్షధ్వానాలు. హనుమంతుని గుర్తుకుదెచ్చే ఓ పెద్దమనిషి సభ లోంచి మాట్లాడ నారంభిస్తాడు.)

హనుమంతుడు:- (అసమ్మతిగా) మానవత్వమా?... క్షమిం చండయ్యా! అదొక అర్థంలేని మాట! మానవుల్లో యెన్ని తరహాలున్నాయి! అందరూ ఒకటెల్లాఅవుతారు? ఎన్ని జాతులు, ఎన్నిరంగులు, రూపాలు! నీగ్రో యెప్పటికీ యాంకీ కాజాలడు! కుక్క గోవు అవుతుంతా? యేం చేసినా!

(వుండ్రంముక్కలాటి మరొకడు యింకోచోటినుంచి అరుస్తాడు.)

ఉండ్రంముక్క:- (కీచుగొంతుతో) క్షమించండి, మిస్టర్ పావ్లోవ్! అయితే మీ సిద్ధాంతరీత్యా యింగ్లండు రాజుకీ, బొగ్గుగని కార్మికునికీ భేదమే లేదన్నమాటా?

పావ్లోవ్:- (చిరునవ్వుతో) లేదని యెవరన్నారండీ, అయ్యా! బోలెడంత తేడావుంది. వారిలో ఒకరివల్ల వుపయోగం వుంది! రెండోవారివల్ల...

(సభలో హర్షధ్వానాలు, నవ్వులూ, కలకలమూ)

(సభలో కలకలం కొంచెం తగ్గడంతోనే పాండురోగిలావున్న మతబోధకు డొకడు లేచి నిల్చుని పావ్లోవ్‌ను సంబోధిస్తాడు.)

మతబోధకుడు:- మిస్టర్ పౌలోవ్! మీ సిద్ధాంతాలపట్ల నా కత్యంత గౌరవభావం వుంది. కాని, మన స్తత్వ శాస్త్రజ్ఞుడుగా నేనొక విషయం చెప్పగోరుతున్నాను. ఆత్మయొక్క వ్యాధుల్ని కుదర్చటంమాటటుంచి, వాటిని గ్రహించడానికేనా మీకు సాధ్యంగాదు!

పౌలోవ్:- నేను ప్రస్తుతం ఒక్క విషయాన్నిమాత్రం చెప్పదలచుకొన్నానండీ, అయ్యా! వైద్యశాస్త్రాన్ని పరిశోధనాలయంతో అనుబంధించినపుడే సరియైన ఫలితాలు కలుగుతవి. చికిత్సాలయానికి నిరంతరం అవిచ్ఛిన్నంగా ప్రామాణిక ప్రయోగ విజ్ఞానాన్ని జతపరుస్తేనే చికిత్సావిజ్ఞానం ప్రస్తుతభ్రమలనుంచి బైటపడగలదు. శరీర శాస్త్ర విజ్ఞానంలోని అధునాతన ప్రయోగ ప్రమాణాలమీద పునర్నిర్మిస్తేనేతప్ప మనస్తత్వశాస్త్రం కేవలం ఆభాసమాత్రమే అవుతుంది! శాస్త్రజ్ఞు డెప్పటికీ వ్యూహాసౌధ నిర్మాతగా వుండజాలడు!

(హర్షధ్వానాలు. సభపూర్తై అందరూ లేస్తారు. లోపల వసారాలో చాలా కుర్చీలు, టేబిల్సూ వుంటాయి. పురప్రముఖులూ, విజ్ఞానవేత్తలూ కూర్చుని చర్చించుకుంటూన్నారు.)

మతబోధకుడు:- ఆయనేమన్నాడో విన్నారుకాదూ? మనం వ్యూహాసౌధ నిర్మాతలమని ఆయనభావం!

ఒకరు:- (ఆశ్చర్యంగా) ఓసోస్సీ! అంతమాటే!

మరొకరు:- (అసమ్మతిగా) ఆయనవన్నీ ప్రమాదకర భావాలే!

ఇంకొకరు:- పాషండమతం!

వేరొకరు:- ఇట్లాంటి కాకమ్మకథలు చెప్పేవాళ్లని యిదివరకు చాలామందిని చూసేం!

మతబోధకుడు:- ఇట్లాటివాళ్లేగతికి బోతారో స్పష్టమే!

(మరో టేబిలు దగ్గర కూర్చున్న ఒక విలేఖరి తల పంకిస్తూ నోట్సు రాసుకుంటూంటాడు.)

విలేఖరి:- (సంతోషంగా) ఏమండీ! స్పష్టంగా యిల్లాచెపితే బాగుండదూ?— 'విజ్ఞానశాస్త్రంలో బోల్డివిజం!'

ఒకశాస్త్రజ్ఞుడు:- భేష్! బాగా చెప్పేరు! ఆఖరికంత్తే!

మరొకడు:- ఇతడు సోవియటు గూఢచారుడని ఢంకా బజాయించి చెప్పగలనండయ్యా!

ఇంకొకడు:- సందేహమేమిటి? అదే నిజం!

(ద్వారంలో నుంచి వస్తూ పావ్లోవ్ యీ ఏడపటి సంభాషణ వింటాడు. ఆయన వెంబడే వ్లాడిమిర్ వున్నాడు. ఆ మాట్లాడినవాని కోటు పట్టుకుని యెవరో వెనుకనుంచి లాగి, సంజ్ఞ చేస్తారు. అతడూ కపటమైన చిరునవ్వుతో ముఖవైఖరిని ప్రసన్నంగా మారుస్తాడు. పావ్లోవ్, వ్లాడిమిర్లు నడిచివచ్చి టేబిలు దగ్గర చెరో కుర్చీలోనూ కూర్చుంటారు. అందరూ యెబ్బెట్టుగా మౌనం వహిస్తారు. మరోటేబిలు దగ్గర కూర్చున్న డాక్టర్ బూయింగ్టన్ లేచి వచ్చి పావ్లోవ్ చేతిని రెండుచేతులా పట్టుకుని చాలన చేస్తాడు.)

డా. బూయింగ్టన్:- చాల సంవత్సరాలుగా మీ పరిశోధనల్ని గూర్చి చాలనగా వరిస్తున్నాను. కేంబ్రిడ్జిలో నన్నొక ప్రశ్న అడిగేరు గుర్తుందా? చాల యేళ్లక్రితం మాటలెండి. అప్పుడు నా అభిప్రాయం చెప్పలేను... కాని నేనీ రోజున

ఖచ్చితంగా, నిశ్చితంగా చెప్పగలను! మీ ప్రయోగాలు మానవజాతికి నూతన ద్వారాల్ని తెరుస్తూన్నాయి. భ్రమాత్మకమైన అనేక అభిప్రాయాల్ని తొలగించి ప్రమాత్మకమైన నూతన సిద్ధాంతాల్ని నిర్మించి, మానవజాతికి అమూల్యసేవ జేసిన మీకు నా నమస్సులు!...

పాలోవ్:- (లేస్తూ) కృతజ్ఞుణ్ణి! మీకనేక వందనాలర్పిస్తున్నాను, మిత్రమా!......కాని ఒకవిషయం మీదృష్టికి తేగోరుతాను. విజ్ఞానరంగాల్లో యింకా యెందరో మూఢాత్ములు, గతానుగతికులు, ఆషాఢభూతులు వున్నారు. వాళ్లు యదార్థ ప్రమాణాలనుంచి పెడమొగం పెడుతూన్నారు! భ్రమలే వాళ్ళకి ఆప్తవాక్యాలు! ప్రమ అంటే బెదరి పారిపోతారు, వాళ్ళు!......

బూయింగ్టన్:- (చిరునవ్వుతో) అబ్బే! అదంతా మామూలే గదండీ! దేనికైనా తారం, పోల్లు అనేది వుంటుంది! అసలుసరకు గాదు! దానితో పోలుస్తేనే అసలుసరకు విలువ తెలిసేది!...ప్రమాణవిజ్ఞానం సజీవమై సాగిపోతూన్నది మీబోంట్లవల్లనే!

(చాలమంది హర్షధ్వానాలు చేస్తూ వారిచుట్టూ గుమిగూడి, పాలోవ్ కరచాలన చేస్తూంటారు. వ్యతిరేకులు మతబోధకుని నాయకత్వాన ప్రదర్శనగావిస్తూ, అసమ్మతిగా బైటికి పోతారు. పరిహసిస్తూ పిల్లికూతలు, హర్షధ్వానాలు.)

---

# అయిదో అంకం

## ఒకటో రంగం.

(లెనిన్‌గ్రాడ్‌లో ఒక రైలుస్టేషన్. సందడిగా వుంది. ఎదుటి రాజమార్గంలో జనసమ్మర్దం. స్టేషన్‌బైట సరికొత్తదైన 'లింకన్' మోటారు ఆగి వుంది. దగ్గరే ఛాఫర్, నికోడిమ్ నిల్చుని మాటాడు కుంటుంటారు.)

నికోడిమ్:- (మెచ్చుకుంటూ) చాలా హాయిగా పోతుందిలే! భేషైన మోటారు! దీనిపేరేమిటీ అన్నావు?

ఛాఫర్:- 'లింకన్'. అమెరికా తయారీ.

నికోడిమ్:- రైలొచ్చే వేళయిందనుకుంటా.

ఛాఫర్:- ముసలాయన ముక్కుమీదే వుంటుందిటగా కోపం?

నికోడిమ్:- అబ్బే! వృద్ధిది! నమ్మల్ని గూర్చి అంతా అనుకునే మాటలు నమ్మకు...కాని, ఒక్కటి మాత్రం మరిచిపోకు సుమా. ఏ పనిలోనైనా టైము తప్పితే ఆయనకి ఒళ్ళు మండిపోతుంది. అంతే. (స్టేషన్ గడియారం వైపు చూస్తాడు.) అయ్యో! దేవుడా! టైమ్ అయిందోయ్, నాయనా! (స్టేషన్‌లోకి పరుగెత్తుతాడు.)

(ప్లాట్‌ఫారం మీద చాలామంది జనం సమ్మర్దంగా వున్నారు; జబేలిన్, వర్వారా, సెమ్యోనోవ్, సెరాఫిమా, నికోడిమ్‌లు అక్కడే వున్నారు. ట్రెయిన్ వచ్చి ఆగింది. పావ్లోవ్ ఓపెట్టె ద్వారంలో నిలబడి, తనవైపు చాచిన చేతులందరివీ చాలన చేస్తున్నాడు. సెరాఫిమా చెయ్యి అందివ్వగానే దిగుతూ, ముద్దెట్టుకుంటాడు. వెనకే వ్లాడిమిర్ దిగుతాడు.)

సెరాఫిమా:- (కొడుకుతో) వచ్చేవా, నాయనా! నాతండ్రి.

వ్లాడిమిర్:- (తల్లిని ముద్దెట్టుకుంటూ) అమ్మా! వందనాలు!

సెరాఫిమా:- నాయనా! వాలోడ్యా! నాన్నగారికి పడిసెం పట్టలేదుగదా!

వ్లాడిమిర్:- (చిరునవ్వుతో) నువ్వే చూస్తున్నావుగా, ఆయ నెల్లావున్నారో, అమ్మా!

(చుట్టూ విలేఖరులు కెమేరాలు 'క్లిక్ క్లిక్' మనిపిస్తుంటారు.)

పాలోవ్:- (విసుగుదలతో) ఎక్కడికెళ్ళినా వీళ్ళబాధ తప్పదు గదా! (పరిచితులను చూసి సస్మిత వదనముతో) జన్మ భూమికివలె ప్రీతిదాయకమైనది మరొకటి లేదు గదా!

నికోడిమ్:- రాండి పోదాం.

(అందరు బైటికి వస్తారు. టాక్సీదగ్గర ఛాఫర్ అటెన్‌షన్ పోజులో నిల బడివుండగా, నికోడిమ్ గంభీరంగా టాక్సీ తలుపు తెరచి పట్టుకుంటాడు.)

పాలోవ్:- (మొగం చిట్లించి) ఎవరిదీ టాక్సీ?

నికోడిమ్:- మనదే.

పాలోవ్:- ఎవరు పంపేరు? నా అనుమతిలేనిదే? ఆఁహాఁ! ఎవరిష్టంవచ్చినట్లు ...... (కోపంగా చిరచిరలాడుతాడు.)

(ఛాఫర్ బెదిరిపోయి తన స్థానంలో గప్‌చిప్‌గా చతికిలబడతాడు. సెమ్యో నోవ్ ముందుకు వస్తాడు.)

సెమ్యోనోవ్:- డాక్టర్ పాలోవ్! ఎక్కండి, పోదాం.

పాలోవ్:- (నిష్ఠూరంగా) నువ్వా! కృతజ్ఞుణ్ణి!... అక్క ర్లేదు. నాకు దీని అవసరంలేదు! నా కాళ్ళల్లో యింకా ఆమాత్రం ఓపిక వుందిలే (ట్రాంవైపు నడుస్తాడు. జోరుగా)

నికోడిమ్:- (తలపంకిస్తూ) కాలంలో వున్నప్పుడే జీవితాసక్తం తకూ సరిపడా కాళ్ళకు బుద్ధి జెప్పేము! సరిపడా యేమిటి

లెండి మరో మోటారు జాస్తీగానే తీరింది కాళ్ళతీట !

(నికోడిమ్ మోటారులో కూర్చుని ఛాఫర్‌ను పోనిమ్మంటాడు. పావ్లోవ్, అసిస్టెంట్లూ అందరూ ట్రాంలో పోతూంటారు. మోటారు కూడా ట్రామును వెంబడించిపోతూంది. ట్రాంలో జనం క్రిక్కిరిసి వున్నారు. పావ్లోవ్ నిలబడి, తోలుపటకాను పట్టుకుని వేళ్ళాడుతుంటాడు. అతడు మౌనంగా, యేదో చిరాకుగా, విసుగ్గావున్నట్లుంటాడు. ట్రాం ఒకచోట ఆగుతుంది. మోటారు ఆగింది)

ట్రాం కండక్టర్:- అందరూ దిగండి! పౌరులారా! ఇదే టెర్మినస్ !

పావ్లోవ్:- ఏమిటీ? మళ్ళీ చెప్పు. ఇది టెర్మినస్సా ?

కండక్టర్:- ఔనండీ! ఇప్పుడింక లోపూఖిన్‌స్కయా వీధిలో ట్రాంబళ్ళు పోవు. ఈ పైనించి ట్రాంపట్టాలు పీకేసేరు !

పావ్లోవ్:- (కోపంగా) ఏం? ఎందుకూ? మతిపోయిందా ?

(వర్వారా యేదో చెప్పబోతూంటే, సెమ్యోనోవ్ ఆమె కోటుపట్టుకుని లాగి, మాటాడవద్దని చిరునవ్వుతో సంజ్ఞ చేస్తాడు.)

కండక్టర్:- ఎందుకో! నగరసోవియటు నడగండి, అయ్యా! దయచేసి.

పావ్లోవ్:- తప్పకండా! అడుగుతా! అడగనూ మరి !

(పావ్లోవ్ కోపంగా క్రిందికి దూకి చరాలున పోతూంటే, అసిస్టెంట్లు వెంబడిస్తారు. అసలే పావ్లోవ్‌తో నడవడం కష్టం. అందులోనూ కోపంగా వున్నప్పుడు ఆయనతో సమంగా నడవడం అసాధ్యం. ఇన్‌స్టిట్యూట్ వీధిలో ట్రాం లైనంతా త్రవ్వేసివుంది. ఓ ప్రక్క పట్టాలు పెరుకుతూంటే, రెండోప్రక్క పెనుబండలు పరచి రోడ్డు వేస్తున్నారు. పావ్లోవ్ కొందరు రోడ్డుకూలీల్ని సమీపించి నిలబడతాడు.)

పావ్లోవ్:- (ఒకకూలీతో) దీని భావమేమిటో చెప్పగలవా ?

కూలీ:- దేనిభావమండయ్యా ?

పొలోవ్:- ఇదిగో! (సీకుతూన్న ట్రాంలైనును చూపుతూ) దీని వుద్దేశ్య మేమిటంటా?

కూలీ:- ఉద్దేశానికేముంది? ట్రాంలైను తీసేసి రోడ్డు వేయమని హుకుం అయింది!

పొలోవ్:- (చిరాకుగా) హుకుం? అంతా హుకుములిచ్చే వాళ్ళే! మతిలేని హుకుములు! ఇదేమిటంటా? ఈ లైను నాకు యెంత అవసరముంది!

(సెమ్యోనోవ్‌వైపు అడుగేస్తాడు)

కూలీ:- (పళ్ళికిలిస్తూ) ఆయనగారన్నది విన్నారా? ఈ లైను తనకెంతో అవసరమట!...అయ్యగారూ! తమరు ట్రాం లేకండానే కాలక్షేపం చెయ్యాలండి! అదిగో! అల్లక్కడ చూసేరూ? (దూరంగా కనబడే యిన్‌స్టిట్యూట్ భవనాన్ని వ్రేలితో చూపుతూ) దాంట్లో ఓ గొప్ప శాస్త్రజ్ఞుడు పనిచేస్తున్నారు. పెద్ద లెక్కల్లో పండితుడు లెండి! (నుదిటిమీద చూపుడు వ్రేలితో తట్టుకుంటూ) దీనికి సంబంధించిన పరిశోధనలు చేస్తుంటారాయన! జంతువులతో ప్రయోగాలు చేస్తూంటారు. ఈ వీధులో ట్రాం వుండడం ఆయన పనికి అడ్డుగా వుంటుంది. ఎప్పుడూ రణగుణధ్వని. అందుకని లైనులు త్రవ్వేస్తూన్నాం! తెలిసిందాండి?

(ఈ మాటవింటూ ఆశ్చర్యముతో నోటమాటరాక, పొలోవ్ ఆ కూలీవైపే చూస్తూ నిల్చునిపోతాడు. ఆ మహావిజ్ఞాని తల నీరసంగా గుండెమీదికి వాలిపోతుంది. మళ్లీ సమాళించుకొని తల యెత్తేసరి కాయన కండ్లలో నీళ్ళు గిర్రున తిరుగుతాయి.)

పాలోవ్:- (కూలివానివైపు చేయిచూపుతూ) వందనాలు! కృతజ్ఞుణ్ణి!

(ఆశ్చర్య చకితుడైన కూలివాని చేయిపట్టుకుని చాలన చేస్తాడు. కళ్లఅద్దాలు తీసి తుడుస్తూ, సెమ్యోనోవ్‌తో.)

పాలోవ్:- సెమ్యోనోవ్! నేను గర్విస్తున్నా! ఇందులో లజ్జించాల్సిందేమీ లేదు! మనవాళ్ల యింగితజ్ఞానం......

(కళ్లజోడు పెట్టుకుని, నడువ నారంభిస్తాడు. కొద్దిసేపట్లో యిన్స్టిట్యూట్ ఆవరణలోని వుద్యానంలో నడుస్తూంటారు, అందరూ. హఠాత్తుగా పాలోవ్ వికసిత వదనం మ్లానమైపోతుంది. మూలుగుతూ, కుడి డొక్కను రెండు చేతులా పట్టుకుని అతికష్టంమీద వుద్యానంలోని ఒక ఆసనంమీద కూర్చుంటాడు. ఆయన ముఖంలో వెల్లదనం గాన వస్తూంది.)

సెమ్యోనోవ్:- (ఆదుర్దాగా) ఏమిటండీ? ఏమిటి? ఏమైంది? డాక్టర్ పాలోవ్!

పాలోవ్:- (ఆత్మసంయమనం చేసుకుంటూ) ఏమీలేదు. అదే పోతుందిలే. ఇప్పుడు బాగానేవుంది.

(ఆయన ముఖంలో బాధ, కళ్లల్లో గ్లాని గానవస్తుంటాయి. ఈ స్థితిలో వున్న పాలోవ్ నెవ్వరూ చూచివుండరు. ఊపిరి బిగ్గరగా తీస్తుంటాడు. ఎదురుగా గాజు కళ్లతో శూన్యంలోకి చూస్తూ, సణుగుతూంటాడు.)

పాలోవ్:- (తనలోనే సణుగుడుగా) నేను భయపడేది... కాలేయం పూర్తిగా...

సెమ్యోనోవ్:- (ఏమీతోచక విమూఢుడైపోయి కంగారుగా) ఆఁ! ఏమంటారు?...ఏమండీ?...

పాలోవ్:- (సెమ్యోనోవ్ దగ్గరగా జరుగుతూ, చెవిలో)

నీతో చెప్పడానికి నేనేం సంకోచించను ... నాకు మృత్యు వాసన్నమైం దనుకుంటా.

సెమ్యోనోవ్:- ( తెల్లబోతూ ) ఆఁ! ఏమంటారు, డాక్టర్ ... అబ్బే! మీరు చిరంజీవులుగా వుంటారు! మా అందరి కంటె... చాలాకాలం బ్రతుకుతారు!

పాలోవ్:- నన్ను అనునయించుతున్నావా? సెమ్యోనోవ్! నే నెవరిననుకుంటున్నావు? పసిబిడ్డనా?...నాయనా! నేను చావుకు వెరవడంలేదు. నేనింకా జీవించివుండి, చేయాల్సిన పని చాలా వుంది. నా అవసరం తీరిపోలేదు. మన కృషి యిటీవల యెంత జయప్రదంగా వుందో చూస్తున్నావు గదూ? ముందున్నదే అత్యంతాసక్తిజనక మైందనుకో. ఇటువంటప్పుడే యీ దిక్కుమాలిన కాలేయం... తెలిసింది గదూ? ... ( పిడికిలి బిగించి బెంచిమీద గ్రుద్దుతాడు. )

(సెమ్యోనోవ్ లేచి పాలోవ్‌ను మెల్లగా లేవదీసి యింట్లోకి నడిపించుకొని పోతాడు. టేబిలు ముందు కుర్చీలో కూర్చోబెట్టి. వేడనీటి సీసాతెచ్చి యిస్తాడు. పాలోవ్ ఆసీసాతో పొట్ట కాచుకుంటూ వుండగానే చాలామంది డాక్టర్లు వస్తారు. సెమ్యోనోవ్, వర్వారాలు కూడ అక్కడే వున్నారు.)

ఒక డాక్టర్:- (సెమ్యోనోవ్‌తో) మేమందరం ఏకాభిప్రాయానికి వచ్చేమండీ, డాక్టర్!

ఇంకోడాక్టరు:- (సంతోషంగా) అబ్బే! ఇందులో ప్రమాదమేమీ లేనేలేదు. కాలేయంలో రాళ్లు యేర్పడ్డాయి. ఇక్కడున్న హేమాహేమీల కిదోలెఖ్ఖా? పత్రమా?......

(వర్వారావైపు సగౌరవంగా శిరఃకంపం చేస్తాడు.)

మూడోడాక్టరు:- అంతేలెండి. ఇదేమంత గడ్డుసమస్య కానే కాదు. కేవలం పథ్యనియమంద్వారానే దీన్ని తొలగించ గలము. డాక్టర్ పౌలోవ్, ఏమంటారు మీరు? ఆహార నియమమూ, పూర్తివిశ్రాంతీ, కారల్స్‌బాద్‌లో నివాసమూ,-బస్! వీటివల్ల మీకు మేలు కలిగితీరుతుంది!

పౌలోవ్:- (తాజాగా) ఐతే ... ఐతే ... (నిశ్చయస్వరంతో) ఆరోగ్య స్థలాల్లో దిమ్మరుతూండాలన్న మాట? ఆఁహాఁ! అల్లా పనికిరాదండీ! అయ్యో! నాకందుకు తీరిక లేదు. (సాలోచనగా) పోనీ, ఆపరేషన్ చేస్తేనో?

(తన విషయంలో గాక యేదో రోగి విషయంలో నిర్ణయిస్తూన్నట్లుగా అంటాడీ వాక్యాన్ని పౌలోవ్. హఠాత్తుగా యీ మాట వినడంతో డాక్టర్ల ముఖాలమీద ఆందోళనా, భయమూ గానవస్తాయి. గదంతా నిశ్శబ్దంగా వుంటుం దొక్క క్షణకాలం.)

మొదటిడాక్టర్:- ఏమంటారు, డాక్టర్ పౌలోవ్! ఆపరేషనా?

రెండోడాక్టర్:- అబ్బే! ఏ పరిస్థితిల్లోనూ అదివల్ల కాదు!

పౌలోవ్:- (ఉల్లాసంగా) శ్భేనుమరి! మీరు ఔషధచికిత్సకులు, కత్తంటే పక్క బెదురుండడం సహజమేలెండి. కాని, మన సర్జను లేమంటారో? (సర్జనులవైపు చూస్తాడు.)

(ఒక్కపరి మళ్ళీ నిశ్శబ్దంగా వుంటుంది.)

సెమ్యోనోవ్:-(అనిశ్చితంగా) ధైర్యానికి నేను కేలుమోడుస్తానెప్పుడూ. కాని, యీ సందర్భంలో...డాక్టర్ పౌలోవ్! ప్రభుత్వానికి తెలపందే మనమేమీ చేయలేమనుకుంటానండీ......

పాలోవ్:- (చమత్కరిస్తూ) ఓహో! నన్నిప్పుడే ప్రభుత్వాస్తిగా చేసేసేవన్నమాట? ఏమయ్యా, కామ్రేడ్!... కానీ, చూస్తా...(సర్జనులతో) ఏమండీ! సధర్ములైన సోదరీసోదరులు మీలో యెవరు ఆపరేషన్ చేస్తారు? త్వరగా ఒక నిర్ణయానికి రాండి!

(సర్జనులంతా ముఖముఖాలు చూసుకుంటారు. ఎవరూ కిమ్మనరు. పాలోవ్‌కి ఆపరేషనే! ఎవరికి గుండె తాళుతుంది. పాలోవ్ పడకకుర్చీలో కూర్చుని, ఉదిటిమీద యేదో పాటకి లయగా వ్రేళ్ళతో తాళం వేస్తూంటాడు.)

ఒకసర్జన్:- అడిగేరుగనక చెప్తున్నా. ఈ వ్యాధికి ఆపరేషన్ తిరుగులేని చికిత్స, నిజమే కానీ, యీ సందర్భంలో మనం ముఖ్యంగా రోగివయసును పరిగణించాల్సి వుంటుంది... లేకపోతే...(సంకోచిస్తూ వూరుకుంటాడు.)

పాలోవ్:-(చిరునవ్వుతో) తెలిసిందిగా! రోగి యేమీ చిన్నవాడా చితకవాడా? అంతేగాదూ?...

(మళ్ళీ యెవరూ మాట్లాడరు. సర్జన్లు తమలో గుసగుసగా మాట్లాడుకుంటుంటారు. తటాలున వారిలో ఒకడు వుపాయాంతరాన్ని కనిపెట్టినట్లుంది. పైకి అంటాడు.)

సర్జన్:-అన్నట్లు, మరిచిపోయేము! సర్జికల్ కాంగ్రెస్ సమావేశమైవుందిగా, మననగరంలో, ఇప్పుడు! డాక్టర్ పాలోవ్! ప్రపంచ విఖ్యాతులైన సర్జనులెందరో వచ్చేరండీ. ఉదాహరణకు, ఫోమ్, చూచేరూ...

పాలోవ్:- (కోపంగా టేబిలుమీది వేటిసిటి సీసాను దూరంగా విసిరేస్తూ లేచి నిలుచుంటాడు.) ఏమంటారు? ఇది సిగ్గు

పడాల్సిన విషయం ! జర్మను సర్జనులు మన సర్జనులకంటె సమర్థులని యెవరయ్యా, చెప్పింది ? ఎవరేమన్నా సరే, నావంటిమీద జర్మన్ సర్జన్ కత్తిపెట్టడానికి నేనంగీకరించను. పట్టుదలంటే పట్టుదలే ! మిమ్మల్నిచూసీ, మీ అధైర్యాన్నిచూసీ నేను లజ్జిస్తూన్నాననుకోండి ? ఎందుకు, మీరింత వెనుతీస్తున్నారు? నాతో ముఖపరిచయం వుండడం వల్ల నేనా ? పోనీ, నా ముక్కూ మొహం యెరగనివాళ్ళో ? (ఒక అపరిచిత సర్జన్ వంకచూస్తూ) ఏమండీ, మీరేమంటారు ? నన్నెరగరుగా, మీరు ?

(ఆ సర్జన్ కొద్దిగా కంగారు పడుతూంటాడు.)

పావ్లోవ్:- (ఆయనతోనే) అబ్బే! ఎందుకూ ? మీ పేరు మార్టినోవ్ కాదూ ?

మార్టినోవ్:- (ఆత్మసంయమనం చేసుకుంటూ ) ఆఁ ! ఔనండీ.

పావ్లోవ్:- బాగుంది ! భేషుగ్గావుంది ! మీ సామర్థ్యం విన్నా. మిత్రమా ! ఈవృద్ధరోగికి మీరే ఆపరేషన్ చెయ్యాలి !

మార్టినోవ్:-(మౌనంగా కూర్చుని, నుదుటిమీద ఘర్మబిందువులు తుడుచుకుంటాడు.)

పావ్లోవ్:- (చకిలిస్తూ) సరే ! సంతోషం ! (ఇతర సర్జన్లనుద్దేశించి) వీరందరూ మీకు సాయం చేస్తారు. ఏమంటారు? మిత్రులారా ! మీరు నాకీసాయం నిరాకరించరనే తలుస్తా !

అందరూ:-మీ ఆజ్ఞ మాకు శిరోధార్యం. కానీండి.

(పాలోవ్ లేచి బైలు దేరుతాడు. అందరూ హాస్పిటల్‌కు బైలు దేరుతారు. తెరయెత్తగానే హాస్పిటల్‌లో ఆపరేషన్ వార్డులో మంచం మీద పాలోవ్. తెల్లటి టోపీ, గౌనులో సర్జన్ మార్టినోవ్ ప్రవేశిస్తాడు. సెమ్యోనోవ్ అక్కడే వుంటాడు.)

మార్టినోవ్:- (ఉల్లాసంగా) ఏమండీ! రోగి యెల్లావున్నారు? (పాలోవ్‌తో) వందనాలు! మీ శరీరంలో యెల్లావుంది?

పాలోవ్:- (బొంగురుగా) అద్భుతంగా వుందనుకోండి. (చిరునవ్వుతో) ఇల్లారాండి!

మార్టినోవ్:- (మంచందరికిబోయి, ప్రక్క కుర్చీమీద కూర్చుంటాడు.)

పాలోవ్:- (మంచంమీదే లేచి కూర్చుంటూ మార్టినోవ్‌ను తేరిపారజూస్తూ) భయపడుతున్నారు, మీరు! ఔనా?

మార్టినోవ్:- (ఈ హఠాత్ప్రశ్నకు చకితుడై కొన్ని క్షణాల బాటు నోట మాటరాక గ్రుడ్లప్పగించి పాలోవ్‌ను చూస్తూంటాడు. పాలోవ్ తనకు ధైర్యం గరపుతున్నట్లుంటుండి చిరునవ్వుతో, తలపంకిస్తాడు.) మీరు నిజాన్ని కనిపెట్టేరు! ఆపరేషన్ చేయడానికి యింత కష్టపడిందెప్పుడూ లేదు, ఇంతకుపూర్వం!

పాలోవ్:- (మార్టినోవ్ భుజం తట్టుతూ, చేతిని పట్టుకుని) సంఘర్షణ లేదు, మిత్రమా! మీరేమీ ఆదుర్దా పడకండి. నేను చనిపోను! చావడానికి నాకు హక్కు లేదు! మనం చేయాల్సినపని చాలావుంది. ఇటీవల మన ప్రయోగాలెంతో

ముందుకి బోయినాయి. చూచేరుగదూ? (సెమ్యో నోవ్‌తో) కోతుల విషయం యేమైంది?

సెమ్యోనోవ్,- హాంబర్గ్‌లో ఓడ కెక్కిచేరు. డాక్టర్ పావ్లోవ్! త్వరలోనే వచ్చేస్తాయి.

పావ్లోవ్:- (మార్టినోవ్‌తో) విన్నారుగదూ? మన ప్రయోగాలు మానవుని కింకొక్క అడుగులో వుంటాయింక! అఁహాఁ! నేను మరణించను. నాకు ... హక్కులేదు!... కానీండి, మిత్రమా.

(తెర పడుతుంది.)

---

## రెండో రంగం.

(లెనిన్‌గ్రాడ్ సమీపంలోని రాజమార్గంమీద ఒక కారు బహువేగంతో బోతూంటుంది. రోడ్డున కిరుప్రక్కలా సమాంతరంగా వృక్షపంక్తులు యెంతో మనోహరంగా వుంది. ఆ 'లింకన్' కారులో పావ్లోవ్, జబేలిన్ సెమ్యోనోవ్ లున్నారు.)

పావ్లోవ్:- (పిడికిలి బిగించి విసురుతూ) జీవితమెంత ఆహ్లాదకరమైనది! అనుభూతియొక్క మధురిమ అమూల్యమనక తీరదు. ఇంతకీ!

(టాక్సీ పట్టణవీధుల్లో ప్రవేశించి ఒక చతుష్పథంలో ఆగిపోతుంది. రహదారి పోలీసు, బహుశా యీ టాక్సీలోని పావ్లోవ్‌ను గుర్తిపట్టివుంటాడు. అతడాయనకు అభివాదనంచేస్తూనే చేతిని సుతారంగా విసిరి ట్రాఫిక్ నంతనీ ఆపు చేసి, పావ్లోవ్ కారును బోనిమ్మని సంజ్ఞ చేస్తాడు.)

పాలోవ్:- ( మెచ్చుకోలుగా ) ఎంత సుతారం! నాట్యభంగి మాన్ని మించిపోయింది!...బహుశా మా ర్యాజాన్ మండలపు రైతుబిడ్డడై వుంటాడనుకుంటా ?

( కారువచ్చి యిన్‌స్టిట్యూట్ దగ్గర ఆగుతుంది. లోపల వెయిటింగ్‌రూమ్ లోంచి మెల్లని సంభాషణ వినవస్తూంది. అదొక అండాకారపుగది. లేబొరేటరీ స్టాఫ్, విద్యార్థులూ అక్కడ సమావేశమై యున్నారు. టేబులుమీది అలంకార పాత్రలో పూలగుత్తు అమరుస్తూంటుంది, వర్వారా. )

వర్వారా:- ఆయన వచ్చేస్తూంటారు...ఆఁ! అదిగో కారు!

ఒకరు:- డాక్టర్లు రానిస్తారంటారా ?

వర్వారా:- ఓస్సీ! ఆయన ఒకరిమాట వినేరకంగాదు! ఆయనకు తోచినట్లు చేసితీరుతారనుకోండి. నేనెరుగుదును. ఆయనకి యెదురు చెప్పగలవాళ్లు లేరు!

(మాటలలోనే పాలోవ్ ద్వారంలో ప్రత్యక్షమవుతాడు. అంతా ససంభ్రమంగా లేచి నిలుస్తారు. పంతులు రాగానే బడిపిల్లలు లేచినట్లుగానే వుంటుందక్కడివాలకమంతా. ఎటొచ్చీ బడి వాతావరణానికి డస్కు బల్లలుమాత్రమే లోటుగా వుంటాయి.)

పాలోవ్:- అబ్బే! ఎందుకూ లేస్తారు? కూర్చోండి, దయచేసి.

(నికోడిమ్ వచ్చి పాలోవ్ కోటును అందుకుంటాడు. అతడు బహు ఉల్లాసంగా వున్నాడు.)

పాలోవ్:- డాక్టర్లు నన్నింకా అక్కడే కొన్ని రోజులుండమన్నారు. కాని, వాళ్ళకేం తెలుసు? ఇక్కడి గోడలే నన్నారోగ్యవంతుణ్ణిగా చేస్తాయని! మిమ్మల్నందర్నీ తిరిగి చూడ్డానికి చాల ఆనందంగా వుంది! (టేబులు వెంబడే నడుస్తూ ఒక్కొక్కరి చెయ్యే చాలనచేస్తూ పరామర్శగా చూస్తాడు.

తన స్టాఫ్ అంతా ఆ రోజున అక్కడే వుంటుంది. పావ్‌లోవ్‌కు యెంతో వుత్సాహంగా వుంటుంది.)

అందరూ:- మీ దయకు కృతజ్ఞులం! మీకు పరిపూర్ణారోగ్యం, చిరాయువు కలగాలని ప్రార్థిస్తూన్నాం.

పావ్‌లోవ్:- కృతజ్ఞుణ్ణి!...మహాజనులారా! (అందరివైపూ కలయజూస్తూ) మిమ్మల్ని చూసి నేను గర్వపడుతున్నా. వస్తు సేకరణలో నాకెంత ఆసక్తివున్నదీ మీకు తెలిసిందేగదా? కాని, యెంత విలువగలదైన వస్తు సంచయముకూడా సజీవమైన యీ నిధికి (వారిందరినీ చూపుతూ) యీడు రాదని చెప్పగలను!...ఐతే యీ రోజు మన బైకోవ్, స్పెరాన్‌స్కీ, అనోఖిన్‌ల వుపన్యాసాల్ని వింటామన్నమాట? భేష్!...ఇటువంటి సుదినంకోసం...మనం...

(ఆయన పొగడ్తకి అంతా కంగారుపడతారు. సెమ్యోనోవ్ లేచి, పావ్‌లోవ్ చెవిలో గుసగుసలాడి, యేదో కాగితాన్ని ఆయనముందుంచుతాడు.)

పావ్‌లోవ్:- చాలా బాగుంది. ఇక్కడపని పూర్తికాగానే నేనూ వస్తా. ఈలోగా వాళ్లకిక్కడి విశేషాలన్నీ చూపిస్తూండమను. (కళ్లజోడు పెట్టుకుని టేబిలుమీది కాగితాన్ని చదువుతాడు.) ఓహోహో! మళ్లా యిదొకటా? దీనివిషయంలో నాకేమీ తెలియదు! (అసంతృప్తితో) అహాఁ! ఏమిటయ్యా యీ గొడవ? ఏమో? నాకేమీ తెలియదు!

(పావ్‌లోవ్ యొక్క యీ చిరాకుకు కారణమేమిటో తెలియక అందరూ యిబ్బందిగా కూర్చుండిపోతారు, కిమ్మనకుండా.)

పాలోవ్: (అందరినీ వుద్దేశించి) ఇదిగో! శరీర శాస్త్రరంగంలో పరిశోధన గావించేందుకై పదిహేను పండితపీఠాలు (Chairs) క్రొత్తగా యేర్పాటుగావిస్తూంది ప్రభుత్వం; బాగుందా?... అవన్నీ మనకే యిస్తున్నారు. (హఠాత్తుగా సెమ్యోనోవ్ కేసి తిరిగి) వాళ్ళు కేడర్లు అంటున్నారే, వాటిని అన్ని స్థానాలకూ మనం యివ్వజాలమని స్పష్టంగా చెప్పేసెయ్యాలి నువ్వు. స్పష్టంగా చెప్పు. తెలిసిందా? మనకీ గౌరవం లభించడం సంతోషకరమే; గర్వకారణమేకూడా! కాని, మిమ్మల్నందర్నీ తలాఒకచోటికీ పంపించేస్తే యిక్కడ నేనొక్కణ్ణి మిగులుతా, ఊడగొట్టిన మంచంకోడులాగ!

సెమ్యోనోవ్:- (చిరునవ్వుతో) అటువంటి ప్రమాదం వుందని నేననుకోనండీ!

పాలోవ్:- (మరోధ్యానంలోవుండి) ఏమంటావు?... (కాగితం చూస్తూ) ఓహో! ఏమిటీ?...నిన్ను మాస్కోకి పంపాలా? నాతో నువ్వీవిషయం యింతవరకూ యెందుకు చెప్పలేదు? అహాఁ! ఇంక యీ విషయంలో సహించడానికి వీల్లేదు! ఐతే, నువ్వేమన్నావు? అంగీకరించేవా?

సెమ్యోనోవ్:- అబ్బెబ్బే! ఇది నేను కోరి వేయించుకున్నాననుకుంటున్నారా? ఒట్టు! ఇది నా కోరికగాదని మువ్మాటికి చెపుతున్నానండీ.

పాలోవ్:- ఐతే నువ్వు కోరలేదంటావా? కోరలేదుగాని వాళ్ళంతటవే వేస్తే వెళ్ళడం నీకిష్టమేనా? ఏం? చెప్పు?

సెమ్యోనోవ్:- అదీ నాకిష్టంగాదు. నమ్మండి, డాక్టర్ !

పాలోవ్:- (కోపంతగ్గి) ఇదేం బాగాలేదు!...ఇదిగో! ఈ కాగితం చూసేవుగా ? (కాగితాన్ని సెమ్యోనోవ్‌కు అంది స్తాడు.) దీంట్లోంచి నీ పేరు ముందుగా కొట్టేసెయ్యి. వింటు న్నావా ? ఏం ? సందేహిస్తావేం ?... ఈ విషయం నేనింక ఆలోచించదలచుకోలేదు ! విన్నావా ?...నువ్వంటే అల వాటైపోయిందనుకో...అదీగాక కోతులను గూర్చి పరిశీ లనలు ప్రారంభించబోతూంటిమి. అది కొత్తపని. నువ్వా ఆ విషయంలో బాధ్యత వహించాలికూడాను. మరొకరి మీద ఆ విషయం వదలిపెట్టడం నాకెంతమాత్రం...

(పాలోవ్ యొక్క యీ ధోరణి చూస్తూ, ఆయన కేకలు వింటూంటే సెమ్యోనోవ్ యెంతో సంతృప్తిగా వున్నట్లు కనబడతాడు.)

సెమ్యోనోవ్:- సరేలెండి. మీరన్నట్లే చేద్దాం! (ద్వారంవైపు నడుస్తాడు.)

పాలోవ్:- (బిగ్గరగా అరుస్తూ) నీ పేరు కొట్టెయ్యడం మరిచి పోకేం...ఇప్పుడే ఆ పనిచేసెయ్ !...బాగానేవుంది, లేని పోని గొడవొచ్చి పడిందే!...(అందరినీ వుద్దేశించి) ఎవరికి వారే వేరుపడి, తమ యిళ్ళు తామే చక్కబెట్టుకోవాలను కుంటున్నారన్నమాట ! అంధహూను ! ఏం ? ఔనా ? తలా ఒక లేబొరేటరీ, పండితపీఠం,- యెవరిదారివాళ్ళది !... వామరం పోవాలనివుందా? ఈ ముసలాడి అడ్డు తొలగించు

కోవాలి! ఔను! బాగానేవుంది! మీ అభివృద్ధికి అడ్డా ఆటంకం నేనొక్కణ్ణేనన్నమాట!

(ఒక్కరూ మాటాడరు. ఆయన మాటల కెవ్వరికీ కోపం రాదు. ఆయన మందలింపులూ, చీవాట్లూ, సాధింపులూ వారి కలవాటే. వాటి వెనకున్న నవనీతకోమలహృదయాన్ని వారు యెరుగుదురు. హఠాత్తుగా వచ్చే యీ తుపానుల కన్నిటికీ వారంతా చిరపరిచితులే. పాలోవ్ ఆలోచనా నిమగ్నుడై అటుఇటు పచారుచేస్తూ, వున్నట్లుండి టేబిలుదగ్గరికి వెళ్ళి లావాటి వ్రాత ప్రతి నొకదాన్ని తన పోర్టుఫోలియోనుంచి బైటికి తీస్తాడు.)

పాలోవ్:- (వ్రాతప్రతిని జబేలిన్ కందిస్తూ) చదివి పూర్తి చేసేను. ఆస్పత్రిలో పడుకుని వుండే నిన్ను గూర్చి ఆలోచించేను. ఆఁ! ఔను! తెలిసిందిగాదూ?...

జబేలిన్:- (ఆతురతతో) ఏమంటారు?

పాలోవ్:- నువ్వు వెళ్ళాల్సి వుంటుందంటాను.

జబేలిన్:- (దిమ్మదిరిగినట్లు నిశ్చేష్టుడై, తడబడుతూ) మీ రేంచెప్తుంటున్నారో సరిగా అర్థంగావటంలేదు. నాకృషి అంత అధ్వాన్నంగా వుందా?

పాలోవ్:- (ఆలోచనగా) చాలాబాగుంది. నీ అభిప్రాయాలు, పద్ధతులు...అసలు నీ ఆలోచనా సరళివుండే అది అనన్యం! స్వతంత్రమార్గంలో పోడానికి నువ్వు సమర్థుడవని నా అభిప్రాయం!

జబేలిన్:- నేను మీనుండి గ్రహించినవే ఆ భావాలన్నీ కూడా డాక్టర్ పాలోవ్! అన్నీ మీభావాలే! నేనెక్కడికి పోతాను?

పావ్లోవ్:- డాక్టర్! భావాలెవరివీ అనేది ముఖ్యంగాదు. భావాలెన్నివుండనీ, మానవుడు జీవించగలిగే ద్రాక్ష-సారే! దానికి మనం యిప్పుడేం చేయలేముగదా? జీవితంలో మన దారిని యెంచుకొన్నాం. ఆ బాటను బట్టుకుని ముందుకు బోతున్నాం, యెన్ని అవాంతరాలు వస్తున్నా ఇప్పుడు మనం కూడలిదగ్గరకు చేరుకున్నాం. (వ్రాతప్రతిని చూపుతూ) ఇదిగో! ఇక్కడే మనమార్గాలు విడిపడుతున్నాయి. మరో నూతనపంథాకు నువ్వు అంకురార్పణ చేసేవు! ఏమో ఎవరు చెప్పగలరు? బహుశః నీదే నా మార్గంకంటె మేలైనదీ, అధిక కౌతూహల కరమైనదీ గావచ్చు! కాని, . ఆ నూతన పంథాలో కృషిని యిక్కడ చేయనీయను! తెలిసిందిగా, ఎందుకో? ఇక్కడ గాదులే. అహాఁ! ఇక్కడుంటే నీ ప్రతిభ ప్రజ్వరిల్లేందుకు అవకాశం లేదు. నా నీడచేత నీ ప్రతిభా ప్రకాశాలు గ్రసించబడిపోతాయి. మర్రిచెట్టు నీడను మరో మొక్క బైలుదేరదుగదా? నా ప్రాబల్యం నిన్ను క్రుంగ దీసి, విరిచేస్తుంది. (టేబిలుమీద వ్రేలితో తాటిస్తూ) అట్లా చేసేందు కెవరికీ హక్కు లేదు! నేను సుతరామూ అంగీక రించను అట్లా జరగడానికి! నువ్వు స్వీయ ప్రతిభను చాటి ముందుకు బోవాలనే నా కోరిక!

(అన్యాసక్తుడైనట్లు కిటికీలోంచి బైటకు చూస్తూంటాడు. ప్రతిభాశాలియైన అంతరంగిక శిష్యుని మరొకచోటికి పంపుటకు యెంతో ఉదారుడై తేనే అంగీక రించగలడు యేగురుడైనా. అతని కీర్తిలో తనకీర్తిని చూడగల హృదయ వైశా

క్ష్యం పావ్లోవ్‌లో వుంది. ఎదిగినకుమార్తె తనయిల్లు చక్కబెట్టుకొనబోతూంటే తండ్రిహృదయంలో కలిగే భావసన్నివేశం, సంఘర్షణా యీఘట్టంలో ప్రతిఫలి స్తాయి. మధురబాధాపూరితమైన సంతోష దుఃఖాలకు కూడలి : మానవజీవితంలో యిట్టి ఘట్టాలు నిత్యానేరములు. భావోద్రేకంతో మొగంచాటుచేసుకొని పావ్లోవ్ కిటికీవైపు తిరుగుతాడు. వయోభారంవల్ల కృశించినా యింకనూ నిటారుగానే వున్న ఆయన నడుము వణుకుతుంది. అంతలోనే సంబాళించుకొనిపావ్లోవ్ గిరు క్కున తిరిగి జబేలిన్‌ను సమీపించి భుజంమీద చేయివేసి తట్టుతాడు. ఏభై ఏళ్ళక్రిందట ప్రొఫెసర్ బోట్కిన్ తన నిట్లేతట్టి, ధైర్యంచెప్పి, ప్రోత్సహిం చిన ఘట్టం ఆయనకు కళ్లకి గట్టినట్లుంది.)

పావ్లోవ్:- (ప్రశాంతంగా) అత్యుత్తముడైన గురువు నాకు లభించేడు. ఆయన ఆశీర్వాదంవల్లనే నేను నా జీవితాన్ని వుత్తమపథంలో పెట్టుకోగలిగేనని గర్వంగా చెప్పుకోగ లను... నేనూ నా కర్తవ్యాన్ని నెరవేర్చితీరాలి... తప్పదు. మన సుఖసంతోషాలు వాంఛలు ప్రధానంగాదు ... సరే. నాయనా వెళ్ళచ్చు. నీకు నా శుభాశీస్సులు!

జబేలిన్:- (ఆనందం, ఉద్రేకంతో కళ్ళనీళ్ళు గ్రమ్ముతూంటే.) డాక్టర్ పావ్లోవ్! నేను మిమ్మల్ని వదలి యెక్కడికీ వెళ్లను! మీరు లేనిచోటు, స్వర్గమైనా సరే, నాకక్కర్లేదు!

పావ్లోవ్:- (కసరుతూన్నట్లు) ఇదిగో! అదేం పనికిరాదు! తెలి సిందా? నీ ఆలోచనాపద్ధతిలో ఒక కేంద్రభావం వుంది. దాని నంటిపెట్టుకుని వుండి ముందుకుపో. మరి దేనినీ లక్ష్య పెట్టొద్దు. నీ దృష్టికి యేదీ అడ్డు కారాదు! తెలిసిందా? చివరకు నన్నైనా సరే. వెళ్ళు. ముందుకే సాగిపో!

నీ కర్తవ్యం అదే. దాన్ని నెరవేర్చడంలో పరాఙ్ముఖుడవు గాకు!

(పిడికిళ్ళు బిగించి రెండు చేతులూ పైకి విసురుతూ ముందున కదుగేస్తాడు. పడుచుతనపు రోజుల్లో మనం చూసిన నిర్భీకుడూ, అజేయుడూ ఐన పౌలోవ్ విగ్రహం కళ్ళకి కట్టిన ట్లుంటుంది. కాలంగాని, వయసుగాని ఆ మహావిజ్ఞాని వైఖరిలో యేమి మార్పు దేజాలకపోయినాయి. ఎప్పటికీ ఆయన యువకుడే.)

పౌలోవ్ :- (టేబిలుమీంది కాగితాల్లో తడుముతూ) నాకంటద్దా లేమైనాయి చెప్మా!

జబేలిన్ :- ఇదిగో! ఎదురుగానే వున్నాయి. (తీసి యిస్తాడు.)

పౌలోవ్ :- వందనాలు! నాకు మరుపు పట్టుకుంది!...(జబేలిన్‌తో) నాపంథాను గూర్చి తీరికగా చదువుదువుగానిలే. మిలిటరీ మెడికల్ అకాడమీలో. అక్కడే నీకు ప్రత్యేకంగా ఓ లేబొరేటరీనికూడా యిస్తారు. అవకాశాలన్నీ వుంటాయి...(ద్వారంవైపు నడుస్తూ) ఎంతకాలమో జీవించను. కాని, జీవించి వున్నంతవర......నాతోడ్పాటు నీకు వుంటుంది......(నిష్క్రమణ.)

---

## మూడో రంగం

(లెనిన్‌గ్రాడ్ యిన్‌స్టిట్యూట్ భవనప్రాంతములో సెమ్యోనోవ్ కొందరు యువకడాక్టర్లతో మాట్లాడుతూంటాడు.)

సెమ్యోనోవ్ :- ఇందులో కొత్తేమీ లేదు, చూచేరూ? వర్తకుల చందాలతో ప్రారంభించబడిన కార్యం మనం పూర్తి

చేసేం. ఇక్కడే అకడమీషియన్ పౌలోవ్ శ్రమ సార్థకమై మానవజాతికి మేధామార్గాన్ని సుగమం చేసింది!...

(పౌలోవ్ వెనకనుంచి సమీపించడం అక్కడవారెవరూ గమనించరు. ఆయన వారి ముందుకు వచ్చి చేతికర్రమీద ఆనుకుని వీఃవబడి వ్యంగ్యంగా పలకరిస్తాడు.)

పౌలోవ్:- ఏం, మాంఛి హుషారుగా వున్నావ్, సెమ్యోనోవ్! ఏదో కొత్తవెలుగు చూస్తున్నట్లున్నావే!...ఏమండీ, మహా జనులు! మీరంతా యిక్కడే పనిచేయదలచుకున్నారా యేమిటి?

(యువకడాక్టర్లు చిరునవ్వుతో, మౌనంగా మొగమొగాలు చూచుకుంటారు.)

పౌలోవ్:- ఏం అల్లా చూస్తారు? మహాజనులు అనే సంబోధన మీకు కటువుగా వుందా యేమిటి? దానిలో యే ముందిలెండి. అదో అలవాటు! అలవాటనేదికూడా ప్రకృతి లాంటిదే. అదీ ఒక మనోవ్యాపారం (రిఫ్లెక్సు) అనచ్చు లెండి, మీరు కావాలంటే. నేను దాన్ని మార్చుకోవా లనుకోడంలేదు. చూసేరూ, అందులో మునిగి పోయిదేం లేదు గాదూ?......

(అంటూ చేతికర్ర నూతంగా చేసుకొని, ఆయువడాక్టర్ల ముఖాలు పరీక్షగా చూస్తూ నడుస్తుంటాడు. కొత్తదళాన్ని పర్యవేక్షణ చేస్తూ సేనాపతి వైఖరిలో ఆయన నడుస్తున్నాడు.)

పౌలోవ్:- (ఒకనిదగ్గర ఆగి) అన్యథా భావించరనుకుంటా... నువ్వేప్రాంతాన్నుంచి వచ్చేవు?

మొదటి డాక్టరు:- కీవ్ మెడికల్‌లో పట్టం పుచ్చుకున్నా.

పౌలోవ్:- (నడుస్తూ రెండో యువకునితో) నువ్వు, నాయనా?

రెండో డాక్టరు:- శరత్రోవ్ మెడికల్.

మూడో డాక్టరు:- మాస్కో - నేచురల్ హిష్టరీ

నాల్గో డాక్టరు:- నొవొశిబిర్స్క - బయోలాజికల్.

ఐదో డాక్టరు:- ఆల్మా - ఆటా, మెడికల్. (యాసగా వుచ్చరిస్తాడీ మాటల్ని )

పౌలోవ్:- ఓ! కజాక్ దేశీయులా! ఆల్మా ఆటా అంటే పూర్వపు వెర్నీనగరమేగాను? ఆఁహాఁ! ఇదో కొత్త కాలేజీ తెరిచేరన్నమాట ( సెమ్యోనోవ్‌తో ) అన్నిటినీ గుర్తుంచుకోడం కష్టంసుమా ?

సెమ్యోనోవ్:- ప్రతియేటా యేదోచోట కొత్తకళాశాల మొదలెడుతూనే వున్నారు. వైద్యశాస్త్రంలో యిప్పటికె యింకా యెంతో సాధించాల్సి వుంది.

పౌలోవ్:- వుండదుటోయ్ నాయనా! ఏదీ, మానవు డిప్పుడిప్పుడేకదా నిజమైన ముందడుగు వేయనారంభిస్తున్నది. (యువకడాక్టర్లతో) సరే, మహాజనులు! యువకశకులు! మీాలో వుత్సాహం పొంగులు కారుతూంటుంది. మీారు యెన్నో నూతన విషయాన్ని చూడగలరు. భవిష్యత్తు మీాదే. తెలిసిందిగదూ? ప్రకృతిని సరైనదారిలో బెట్టాలి. చూచేరుగదూ. మనం ఓ కొండమీాదికి మెల్లగా, కష్టంగా ప్రాకిపోతున్నాం. ఇదే ఒక బ్రహ్మాండమైన పర్వతమనుకుంటాం. కాని పైకెక్కి చుట్టూ చూసేసరికి యిదో చిన్నగుట్ట

మాత్రమేననీ, పర్వతపంక్తి అంతా యింకా ముందరుందనీ తెలుస్తుంది! మానవ విజ్ఞానం తాబేటినడకతో సాగిపో తూంది! ఎన్నటికో ... (సాలోచనుడై చేతికర్రతో నేల మీదేదో గీతలుగీస్తూ, పరధ్యానంగా వుంటాడు. భవనం లోంచి నికోడిమ్ వెలుపలికి వస్తాడు.)

నికోడిమ్:- (వరండానుంచే బిగ్గరగా) డాక్టర్ పాలోవ్! వాళ్ళు కోల్టూషీనుంచి ఫోనులో పిలుస్తున్నారు... (అవాచ్యమైన దేనినోగూర్చి మాట్లాడుతున్నట్టు చీదరతో) ఆఁ...ఆవాన రాలేవో దిగివాయిటండీ!

పాలోవ్:- ఇదిగో! వస్తున్నా! (భవనందరికి పోతాడు.)

నికోడిమ్:- ఐతే యింక కుక్కలతో పనితీరిందన్నమాటేనా? వాటినింక వదిలిపెట్టేస్తారూ? (అతని స్వరంలో యెంతో విచారం ధ్వనిస్తుంది.)

పాలోవ్:- అంతలో వదిలేస్తామనుకోకు. శునకానికి స్మారక చిహ్నంగా ఒక జయస్తంభాన్ని నిర్మించుతాం. మనో విజ్ఞాన శాస్త్రంలో శునకం తన కడపటి మాటలు చెప్పే సింది! (తనమాటలకు తానే చకితుడై) అబ్బే! అది చెప్పాల్సినమాట సింకా చెప్పనేలేదు!

నికోడిమ్:- ఇక మన పరిశోధనలన్నీ వానరాలతోలా వుంది. నా కవంటే మాచెడ్డ...సరే! కానీండి...చూస్తాంగా!

( తెర )

## నాలుగో రంగం

(కోల్తూషి గ్రామసమీపంలోని రాజబాట. అదిప్పుడు రాళ్లుపరచిన వెడల్పైన ఘంటాపథం. అక్కడ ఒక విశాలమైన మైదానంలో బ్రహ్మాండమైన భవనాలు. దూరంగా యింకా యెన్నో భవనాలు కట్టుబడిలో వుంటాయి. రాజబాటమీంచి బహువేగంగా ఒకటాక్సీ వచ్చి ఆగుతుంది. దానిలోంచి కిరోవ్* సెమ్యోనోవ్‌లు దిగుతారు.)

సెమ్యోనోవ్:-(ఒకపెద్ద పలకమీద పేరుచూపుతూ) కామ్రేడ్ కిరోవ్! ఇదేనండీ. ఉన్నత నాడీమండల వ్యాపారాన్ని గూర్చి పరిశోధనా కేంద్రం. (ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్పరిమెంటల్ మెడిసిన్) ఈ గ్రామాన్నే మేము మనోవ్యాపార విజ్ఞానానికి పుట్టినిల్లుగా భావిస్తుంటాం. ఉన్నత నాడీమండల వ్యాపారాల్ని గూర్చీ, జీవుల వుత్పత్తి పరిణామాల్లో మనోకేంద్రం యొక్క పాత్రనుగూర్చీ అనన్యమైన ప్రయోగాలు యిక్కడ జరుగుతున్నాయి. కండిషన్డ్‌రిఫ్లెక్సులకు మాతృస్థానం యిదే!

కిరోవ్:- చాల సంతోషంగావుంది, కామ్రేడ్! ఎంతగానేనా ఆ కాంక్షవుంది. గాని నాకు అవకాశంలేదు. మీరు ధన్యజీవులు. ఇట్టి విజ్ఞానక్షేత్రంలో నివసించి, ఆ కృషిలోనే జీవితాన్ని ధారపోయగల్గేరు...కానీండి. చూచి సంతోషిద్దాం.

సెమ్యోనోవ్:- (నడుస్తూనే) అదిగో! ఆ కనిపించేదే వానరాల మీద పరిశోధనలు సాగించేందుకై క్రొత్తగా ప్రారంభించేం.

---

* సెర్జీమిరోనిష్ కిరోవ్. బోల్షివిక్ నాయకుడు. లెనిన్‌గ్రాడ్ సోవియట్ అధ్యక్షుడు. 1934 లో ట్రాట్స్కీయిష్టు విద్రోహు లితనిని హత్యగావించేరు.

అదుగో! అకడమీషియన్ పౌలోవ్ అక్కడే వున్నారు.
నడవండి......

(తీగవల బిగించిన పెద్దగృహం. లోపల కోతులెన్నో విడివిడి గదుల్లో సందడిచేస్తున్నాయి. ఓ పెద్ద చింపాంజీకోతి తీగవలపట్టుకుని నిలబడి పరిశీలనా దృష్టితో పౌలోవ్‌ను చూస్తూంటుంది. ఆయన బైటనిలబడి, తదేకదృష్టితో ఆ వానరాన్ని చూస్తూంటాడు. ఆయన దృష్టంతా యేకేంద్రకంమీదో లగ్నమై నట్లు స్పష్టమే. ఆ చింపాంజీపేరు రాఫేల్. వానరం రాఫేల్, మహావిజ్ఞాని పౌలోవ్, యిరువురూ సన్నిహితులే, యుగాంతరాలనాటి రక్తబంధువులేగదా! కాలమొక్కటేగదా వీరిద్దరినీ వేరుచేసివుంచిన తెర.)

సెమ్యోనోవ్:- చూసేరా? ఆయన దృష్టంతా యెప్పుడూ దేన్నో పరిశీలిస్తూనే వుంటుంది. మెదడు ఆలోచనలోనే వుంటుంది. మనంవస్తూన్నట్లు ఆయనకి తెలియదుచూడండి!

కిరోవ్:- ఏకాగ్రత! అదేలేకపోతే యేమహాకార్యమూ నెరవేరదు గదూ!

(పౌలోవ్ వీరిరాకను గమనించకండానే రాఫేల్‌తో యేదో మాట్లాడుతూం టారు.)

పౌలోవ్:- ఏం, పెద్దయ్యా! మనిద్దరికి చాల పోలికలున్నాయి. ఏమంటావు? పోలికలంటే నిరాకరించ వీలులేనివి! అది మాత్రం నిజం! ఏమనుకొన్నారో? కాని...కాని, నీకు అదొక్కటే కొరత! వాక్కు ఒక్కటే నీకు లేనిది! చెప్పవూ? అసలేమీ మాట్లాడవు? పలుకులు, వాక్కులు మావి! నరులవి! నరుల ప్రత్యేకలక్షణం వాగ్మిత్వం! కాని, పెద్దయ్యా! మనం వేరుపడినదశలో నువ్వుచ్చరించిన

ఆ మొదటిశబ్దం యెల్లాంటిదో! కాస్త చెప్పవు! ఏం? లేదాఅసలు నువ్వు పలుకనేలేదా? పలుకే బంగారమా, తాతా! ...ఓహూ! అందుకనే నువ్వున్నచోటనే దిగడిపో యేవు! మేముమాత్రం నీ సన్నిహిత జాతులం ముందుకు సాగివచ్చేసేము!... పెద్దయ్యా! ఊరికే నటిస్తావుగాని నువ్వు నరుడవుగావు. ఎప్పటికీ గావు. మేము నరులము! నువ్వో వ్యాగ్రహితుడవు! అందుకే వానరమవు! అదేంగానట్లు మహానటిస్తావే? నరుడెవడో తెలుసా? మొదటిశబ్దాన్ని వుచ్చరించినవాడు!... కాని, అతడా మొదటి శబ్దాన్ని యెల్లా వుచ్చరించగల్గేడు చెప్మా? వానరంనుంచి నరత్వా నికి విభాగరేఖ, సరిహద్దు యెక్కడ? ఏం తాతా. నువ్వు మౌనంగా వుంటావేం? నువ్వు చేయగలిగిందేమిటి? చేయ జాలనిదేమిటి? చెప్పు, తాతా? మనం నడుంబిగించి కృషి ప్రారంభించాలి. బోలెడంత కార్యక్రమంవుంది, మరి. ఏమం టావు?... (ఈ కడపటి మాటల నొత్తిపలుకుతూ, చేతి కర్రను కసుక్కున నేలను తాటిస్తాడు. రాఫేల్ భయంతో వెకిక్కి రెంతుతుంది. మరుక్షణంలోనే బోనులో పడివున్న యాపిల్‌పండును తీసుకుని తింటూంది రాఫేల్.)

పౌలోవ్:- (నొచ్చుకుంటూన్నట్లు) క్షమించు, పెద్దయ్యా! నీకు తొందరకలిగించినందుకు. నేను వెడతా. నువ్వా పండు తిం టూండు, మళ్లా వస్తానులే.

(బైలుదేరి వస్తూంటే, జబేలిన్ కలుస్తాడు. ఇద్దరు కలిసి ఒక కుటీరం లోకి పోతూంటారు. అల్లంతదూరంలో సౌధనిర్మాణస్థలం కనిపిస్తూంటుంది. గోతులు, అగడ్తలు, పునాదులు ఒకచోట. మరొకచో యినుము-సిమెంటు తో గోడలు పోస్తున్నారు. దూలాలు పాతి, వాసాలతో పరవంజాలు లేవదీస్తు న్నారు, ప్రతిచోటా. అదంతా తిరుగుతూ, చూస్తూ, మాట్లాడుకుంటున్నారు, కిరోవ్, సెమ్యోనోవ్, మరికొందరు నిర్మాణపు పనివాళ్లూ.)

సెమ్యోనోవ్:- మనకి యీ యేడాది ముప్పైలక్షలు మాత్రం గ్రాంటు వుంది. పనిచూస్తే బోలెడంత...

కిరోవ్:- (గబగబ నడుస్తూ, వింటూ, తలూపుతూ) డబ్బుకేం లోటురాదు. ప్రజలు యెన్నిత్యాగాలు చేసైనా విజ్ఞాన రంగంలో జరిగే అనన్యకృషికి చేయూత నిస్తారు. శాస్త్ర రంగంలో అభివృద్ధి పొందితేనే సాంకేతికాభివృద్ధీ, ప్రజా జీవన పరిణామాభివృద్ధీ సాధించగలమని కామ్రేడ్ లెనిన్ అంటూండేవాడు. (ఓ అగడ్తను లాఘవంగా దాటి, దూలాల గుట్టమీదికి నేర్పుగా యెక్కుతాడు. వాస్తుపర్య వేక్షకులు కూడ అంత లాఘవంగానూ, వేగంగానూ నడవ లేరు.)

(ఆ కుటీరంలోంచి పాలోవ్, జబేలిన్లు బైటికి వస్తూన్న సమయంలోనే కిరోవ్ పరవంజామీదికి యెక్కుతూంటాడు.)

పాలోవ్:- (మెచ్చుకుంటున్నట్లు) అతడు మాంఛి చురుకుగా యెక్కుతూన్నాడే! (అంతలోనే జగడగొండితనంగా, గయ్యాళి స్వరంతో) శాస్త్రజ్ఞులు యిక్కడికి చూడవచ్చే రంటే అర్థం వుంది. కాని రాజకీయవాదులకు యిక్కడేం

ఏముంటుందంటూ? వాళ్లకి మనం చూపగలిగే దేముంది?

జబేలిన్:- ఈయన చాల తెలివైనవాడు. జిజ్ఞాసువు, నిగర్వి, కార్యవాదీ అని అంటాం.

(కిరోవ్ ప్రభృతులు దూరంలో పావురాగుంపులను చూస్తూ మాట్లాడుకుంటూంటారు.)

ఒక వైజ్ఞానికుడు:- (కిరోవ్‌తో) పావురాల స్వభావప్రవృత్తుల్నీ యథార్థలక్షణాల్నీ గూర్చి సమగ్రపరిశీలనలు గావిస్తున్నామండీ. వేర్వేరు జాతుల మనోవ్యాపారాల వైవిధ్యాలకీ, సంబద్ధతకూ గల కారణాల నన్వేషించడం ద్వారా......
(చూడక, దారిలోని గోతిలో తూలి పడబోతాడు.)

కిరోవ్:- భద్రం! (అంటూ గభుక్కున ఆయన చేయిపట్టుకుని నిలుపుతాడు.) ఎంత చక్కని పక్షులు! (పైనెగురుతూన్న పావురాగుంపును నవ్వుమొగంతో చూస్తూ, తలను వెనక్కి విరుస్తాడు.)

(పావ్లోవ్, జబేలిన్‌లు సమీపిస్తారు. పావురామందను చూస్తున్న కిరోవ్ ముఖంమీద శిశు సహజమైన స్వాప్నికమందహాసం నాట్యం చేస్తూండడం గమనించి, ఆయనకు ప్రీతి కలుగుతుంది.)

పావ్లోవ్:- కిరోవ్! కామ్రేడ్!

కిరోవ్:- పావ్లోవ్! మహావిజ్ఞానీ!

(రష్యన్‌లు కుటుంబనామంతో సంబోధించుకోడం అతి పరిచయం వున్నపుడే. లేదా పేరు, తండ్రి పేరుతో సహా పిలుచుకోవాలి. కాని వీరిసందర్భంలో సాంప్రదాయక సంబోధన అనవసరం, అసంబద్ధంగాను తోస్తుంది. అక్కడివారంతా యీ విషయాన్ని గమనించి, సగౌరవంగా వీరిద్దరినీ చూస్తూ, గంభీరంగా; మౌనంగా వుండిపోతారు.)

కిరోవ్:- (మౌనాన్ని భంగిస్తూ) డాక్టర్ పౌలోవ్! క్షమిం చండి. నాకు మీయందుండే ఆత్మీయతవల్ల...చూచేరూ...

పౌలోవ్:- ఏం ఫర్వాలేదు. మిమ్మల్ని యిక్కడ చూడ్డానికి చాల సంతోషం. దానిలో యేం లేదు. అంతఃకరణ ప్రవృత్తులు సత్పురుషుల్లో ప్రామాణికములని చెప్పేది అక్షరాలా నిజం!

కిరోవ్:-కృతజ్ఞుణ్ణి!......మీ అసిస్టెంటు యిప్పుడే పావురాల స్వభావవృత్తి రీతుల్ని గూర్చి చెపుతూన్నారు. కాని, నిజం చెప్పాలంటే నామనసు మరోచోట వుంది. చిన్నతనంలో నాకు పావురాలు పెంచడమంటే యెంతో ఆసక్తి వుండేది. వాటిని యెగురవేయడం వినోదించడం......పిల్లలకు కాల క్షేపం...మీ రెరగని దేముంది!

పౌలోవ్-:(సంతృప్తితో చిరునవ్వు నవ్వుతూ) మీరు మనసిచ్చి మాటాడగలరే! నాకు అది చాల యిష్టం! ఐతే మీకు మా పావురాలంటే అంతప్రీతి కలిగిందన్నమాట! భేష్! మరి మా కోతుల్నికూడ చూద్దురుగాని! రండి!

కిరోవ్:- (సంతోషోల్లాసాలతో) బాగుంది! నాకు వానరా లంటే, వాటిని చూడ్డమంటే యెంతో యిష్టం. వాటిచేష్టలు చూస్తూంటే లోకాన్నే మరిచిపోతాంసుమండీ! నడవండి.

(ఇద్దరూ చిరునవ్వులతో ఒకరినొకరు చూస్తూ, బైలుదేరుతారు. మిగిలినవా రంతా వారిని వెంబడిస్తారు. వీరు చిరకాలమిత్రుల్లా కలిసి నడుస్తున్నారు.)

పావ్లోవ్:- (చిరునవ్వుతో) వాళ్లు యిక్కడో పెద్ద నగరాన్నే లేవదీసేస్తున్నారు! నిజం చెప్పమంటే నాకు యీ భారీచెయ్యి చూస్తే గుండె తాళడం లేదు! కోట్లధనం మంచినీళ్లలా వెచ్చిస్తున్నారు, నా కోసం!...

కిరోవ్:- దానిలో యేముంది లెండి. ఇంతకాలానికి ధనం సత్కార్యాల్లో వినియోగమౌతూందనిసంతోషిస్తున్నాం. మానవాభ్యుదయం, విజ్ఞాన వికాసం,- వీటికై యెంత వెచ్చించినా అది అధికం గాజాలదనుకుంటా.

పావ్లోవ్:- (గంభీరంగా) అదంతా వృథాయైతే? అబ్బా! ఏం జరుగుతుంది? ఇదంతా ప్రజలసొమ్ముగదా! తలుచుకుంటే...

కిరోవ్:- (ధీమాగా) ఏం ఫర్వాలేదు. ప్రజలు మనఃపూర్వకంగా యిస్తున్నారు, మీకీ ధనమంతా. తమ సుఖ సౌభాగ్యాల కోసమే మీరు పనిచేస్తున్నారని వాళ్లకి గాఢవిశ్వాసంవుంది!

పావ్లోవ్:- (ఉపాలంభనగా) అంటే? మీకు ప్రజలనుకునేవీ, ఆలోచించేవీ అన్నీ హృత్కమలిగా తెలుసునన్నమాటా?

కిరోవ్:- (ప్రశాంతంగా) మహాత్మా! మీరన్నది అక్షరాలా సత్యం! ప్రజాహృదయం తెలియనిచో మేము దమ్మిడీకూడ కొరగాకపోయేవాళ్లమే!

(క్రొత్తగా పాతిన వృక్షపంక్తులమధ్యగా నడుస్తూ, వారు కోతులుండే యింటిని సమీపిస్తారు. తీగవలలోపల, గదుల్లో యెన్నో కోతులు, రకరకాలవి వుంటాయి. పావ్లోవ్ సరాసరిగా వెళ్లి చింపాంజీకోతి రాఫెల్ గదిముందు నిలబడతారు. రాఫెల్ లోపల యేదో పనిచేస్తూంది. ఒకపెట్టె, దానిమీద చిన్న

రంధ్రం. ఒక కర్రలపోగు. రాఫేల్ ఒక్కొక్క కర్రనే ఆ చిల్లిలో పెట్టి, మూతను తెరవ యత్నిస్తూంది. కర్రలు లావై రంధ్రములో దూరవు. అది బుర్రగోక్కుంటూ, ఒక్కక్షణం ఆలోచిస్తూంది. దాని క్రిందిపెదవి వ్రేలుతూ, వణకుతూంది. ఆలోచించి, పరికించి, ఒక సన్ననికర్రను యెంచి, రంధ్రంలోదూర్చి, పెట్టి తెరుస్తుంది. సంతోషంతో కేకలేస్తూ, పెట్టిలోని యాపిల్‌పండును తీసుకుంటుంది.)

కిరోవ్:- ఏదో బాదరాయణ సంబంధంవుంది! తలుచుకుంటే భయంవేస్తూంది కూడాను. నరుడు - వానరుడు!

పాలోవ్:- నిజమే! అతి స్వల్పమే. కాని అత్యధిక ప్రాముఖ్యమైనదికూడాను! వాటికి వాక్కు ఒక్కటేలేదు. ప్రత్యేకంగా పరిశీలిస్తున్నాను, నేను వీటిని. ఖచ్చితంగా మాట ఒక్కటే, రెండో సాంకేతికసరళికిజెందిన వాక్కు ఒక్కటే నర - వానరములకు మధ్య అడ్డుగోడలను నిర్మిస్తూంది!

కిరోవ్:- మహావిజ్ఞానీ! వాక్కు కేవలం కార్యం. అది ద్వితీయమైన స్థానాన్ని మాత్రమే ఆక్రమిస్తూంది.

పాలోవ్:- (ఆశ్చర్యంగా) ఐతే వాక్కు యేర్పడేందుకు కారణమేమిటి? మొదటిస్థానంలో చెప్పదగిందేమిటంటారు?

కిరోవ్:- ప్రథమంలో శ్రమ లేక కర్మయందే వాక్కుజనించి వుండాలి. అందువల్ల వానరులనుంచి నరుల్ని వేరుపరుస్తున్నది ప్రధానంగా 'కర్మ' లేక క్రియాశక్తి యని నా అభిప్రాయం.

పాలోవ్:- ఔను! నేనా విషయాన్ని గమనించేను. అదే యదార్థమని తోస్తుంది.

కిరోవ్:- నిజం చెప్పాలంటే నేను వెలిబుచ్చిన భావం నాది

గాదు. (చిరునవ్వుతో) ఏంగిల్సు 'ప్రకృతియొక్క గతి తర్కం' (డైలెక్టిక్సు ఆఫ్ నేచర్) అనే తన గ్రంథం మొదటి ప్రకరణంలో 'వానరులు నరులుగా మారుటలో కర్మయొక్క పాత్ర'ను గురించి వ్రాసేరు.

పావ్లోవ్:- ఆ గ్రంథం చదువనేలేదు. వ్యవధీ, అవకాశం చిక్క లేదు! చాల విచారకరం.

కిరోవ్:- డాక్టర్ పావ్లోవ్! మీరు మీ స్వంత పంథాలోనే విజ్ఞానాన్వేషణ చేస్తున్నారు. ఆ మార్గం కూడ మిమ్మల్ని మాదగ్గరకే గొనివచ్చింది. అది అన్నిటికంటె విచిత్రమైనది గాదు? విప్లవకారులమైన మేము యెప్పుడూ ఆచరణ యోగ్యమైన పంథాలే తొక్కుతాము. మేము సదాచరణం ద్వారా యేనిర్ణయానికి రాగలిగేమో వాటిలోని యాథార్థ్యతి విజ్ఞానులైన మీరు బురువు చేస్తున్నారు!...

పావ్లోవ్:- మిమ్మల్ని నేనర్థం చేసుకున్నాననుకుంటూ.

కిరోవ్:- (వుద్రిక్తుడై) మేము కష్టజీవుల్ని విముక్తి చేయగలిగేం, చిరకాల పీడలనుంచి. చూచేవుంటారు, మీరూ! మీ ర్యాజాన్ ప్రాంతాల్లో సమిష్టిక్షేత్రపతులైన కర్షకులిప్పుడు ఖిబినీనుంచి తెచ్చిన యెరువులతో పంటలు పండిస్తూన్నారు! దాంట్లోనే నాకు ప్రత్యేకాసక్తి. కోట్ల సంవత్సరాలుగా అపాటైటు (ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్) అక్కడ భూమిలో నిద్రిస్తూవుంది! అవిరళధారాపాతమైన మంచు

క్రిందనుంచి దాని నిప్పును సోవియటు మానవుడు వచ్చి, పైకి తీసేను. ఆఁహాఁ! అంతేనా? ఇంకా యెన్నో మహా త్కార్యాల్ని సాధిస్తాం. ప్రకృతి తన గర్భంలో గుప్తాతి గుప్తంగా దాచిన పెన్నిధుల్నీ, రహస్యాల్నీ మానవుడు వశపర్చుకునేటట్లు చేస్తాం!

పాలోవ్:- (కిరోవ్‌ను పరీక్షగా చూస్తూ) విప్లవకారులు మీరూ ఓ రకంగా చూస్తే స్వాప్నికుల్లాగే వున్నారే! హుఁ!... రాజకీయవాదులూ... స్వప్న సంచారులేనా ఐతే?

కిరోవ్:- మీకిష్టమైతే ఆ పేరున పిలిచినా అభ్యంతరం లేదు, నాకు. కాని మీ మాటేమిటి? మీరు వైజ్ఞానికరంగంలో కలలుగనేవారు గాదూ?

పాలోవ్: ఔను! అల్లాగేఅనండి! కాదనడందేనికి? కాని నేను నేటిసిగూర్చి కలలుగంటుంటానో తెలుసా? కేవలం అసంభవంగా కనిపించే వాట్లనిగూర్చి! నమ్మవీలుగానివాటిని గూర్చి!... మీరు దేంట్లోనూ ప్రత్యేకకృషి చేసినవారు గారు. అందుచేత మీకు నేను చెప్పగలను. (కిరోవ్ దృఢమైన చేతిని పట్టుకుంటాడు. ఇద్దరూ కలసి నడుస్తారు.) చూచేరూ, మెదడు లేక మనస్సుఅనేది అంగిలేక ప్రాణితో అవినా భావసంబంధంగలది. ఈ విషయం శాస్త్రజ్ఞు లెప్పుడో సిద్ధాంతీకరించేరు. అందుచేతనే శరీరంమీంది ప్రేరణలను మనస్సేవిధంగా ప్రతిబింబిస్తుందో అదేవిధంగా

మనస్సుమీద మనం కలిగించే ప్రేరణలన్నీకూడ శరీరంమీద ప్రతిక్రియలను కలిగిస్తాయి. తేలిందేమిటి? దైహిక క్రియా కలాపాలన్నిటినీకూడ మనం కళ్లేలుపట్టి నడిపించడం సాధ్య మని! ఔనౌను! వైద్య చికిత్సాశాస్త్రాల్లో విప్లవం వస్తుంది! అసంఖ్యాకములైన వ్యాధుల్ని యికనుంచీ నాడీ మండల కేంద్రంద్వారా,- మనోచికిత్సద్వారానే కుదర్చగల మన్నమాట! తెలిసిందిగదూ? మానవుడు త్వరలోనే తన శరీరంమీదా, మనస్సుమీదా నిజమైన యజమాని గాగ లడు. వృద్ధాప్యాన్ని, రోగాన్ని వెనక్కి నెట్టగలడు! ఏమో? మృత్యువునుగూడ ధిక్కరించగలమేమో?...... కాని, యెప్పుడూ? అన్నదే ప్రశ్న. ఈ ప్రశ్నకు యిప్పుడే సమా ధానం చెప్పజాలను! (కొంటెగా) ఏమో? బహుశా, ఈ నూతనసమాజంలోనే... మీ కమ్యూనిష్టు సమాజంలోనే అది జరగవచ్చు! (హఠాత్తుగా) కామ్రేడ్ కిరోవ్! ఎత్తు బూట్లు తొడిగేరెందుకు? మీ పార్టీవాళ్లందరూ యెప్పుడూ యీ మిలిటరీ దిరీసులోనే వుండాలా?

కిరోవ్:- (చిరునవ్వుతో) పటాలపు అలవాట్లండీ, డాక్టర్ పొలోవ్! సైనికులంగదండీ. కేవలం కలలుగనడంతోనే సంతృప్తిపడితే బ్రతుకు కల్లకాగలదు! నామటుకు నేను యెన్నో యుద్ధాల్లో పాల్గొన్నాను. ఇంకా ముందెన్నిటిలో పాల్గొనాలో తెలియదు. సంఘశత్రువులు మనల్ని ప్రశాం

తంగా బ్రతుకనీయరండీ. జీవితం అంటేనే పోరాటం. అంత ర్బహిశ్శత్రువులతో మనం యింకా యెన్నో పోరాటాలు చేయాల్సి వుంటుంది... దానికేంగాని, మీరు యిటలీ వెడుతున్నారా?

పాలోవ్:- ఆఁ! వెడదామనే అనుకుంటున్నా. రోమ్‌సైన్సు కాంగ్రెస్‌కి వెళ్లాలనుకుంటున్నా...అంతే, ప్రభుత్వానికే మైనా అభ్యంతరం...

కిరోవ్:- (చిరునవ్వుతో) అబ్బే! ఏమీలేదండీ. ఈ దఫాకి ప్రభుత్వాని కేమీ అభ్యంతరం లేదుగాని, మరోసారికి మాత్రం...ముందు కాంగ్రెస్‌ను మనం ఆహ్వానించాలని కామ్రేడ్ స్టాలిన్ అభిప్రాయం. మీకు ప్రయాణం చేయడం చాల శ్రమగా వుంటుంది. అందుకని లెనిన్‌గ్రాడ్‌లో జరిగితే బాగుంటుందని ఆయన సూచించేరు...

పాలోవ్:- బాగానే వుంటుంది. కాని,...

కిరోవ్:- అదీ అన్ని నగరాలవంటిదేగదండీ! ప్రభుత్వమంతా మిమ్మల్ని చూడవస్తుంది. కామ్రేడ్ స్టాలిన్ మిమ్మల్ని కలుసుకొనడానికి వస్తారు. అంతేగాక మనకింకా తగినన్ని కారణాలున్నాయి...

పాలోవ్:- (చిరునవ్వుతో) వుంటాయి. కానీండి, చూద్దాం. మనం ఆ సుదినంకోసం యెదురుచూద్దాం...

[ తెర ]

## అయిదో రంగం.

(1935 ఆగస్టునెల. సూర్యాతపం యింకా లెనిన్‌గ్రాడ్ వీధుల్ని తాకుతూంది. సైన్సు కాంగ్రెస్ పదిహేనవ సమావేశం జరుగుతూంది. ప్రతినిధుల్ని తీసుకొని పోతూన్న టాక్సీలు బారులు తీరి ప్రవాహంగా పోతున్నాయి. రాజవీధి కిరువైపులా లక్షలాది ప్రజలు బారులుతీరి నిల్చుని పువ్వులు చల్లుతూ, హర్షధ్వానాలు చేస్తున్నారు. సైన్సుకాంగ్రెస్ పండుగదినంగా చేయబడుతూంది. కారులో కూర్చున్న పావ్లోవ్, ప్రజల స్వాగత వచనాలకు బదులుగా పిడికిప్పు బిగించిన రెండుచేతులూ పైకి విసురుతూ, సగర్వంగా వివిధ వైజ్ఞానిక ప్రతినిధుల్ని వీక్షిస్తుంటారు. ఊరేగింపు వచ్చి కాంగ్రెస్ భవనంముందు ఆగుతుంది. ప్రతినిధులూ, ప్రేక్షకులూ సమావేశమైన బ్రహ్మాండమైన సభాస్థలం. జనసముద్రంమీద కాచదీపికా గుచ్ఛములకాంతి తేలియాడుతూంది. వేదికమీద పావ్లోవ్ మాట్లాడుతున్నారు.)

పావ్లోవ్:- మహాజనులారా! విజ్ఞానవేత్తలారా! ఈ మహాసభా సందర్భంలో మనం శరీరశాస్త్ర విజ్ఞానంలో నూతనశకాన్ని ప్రారంభించిన శచినోవ్ నామాన్ని స్మరించకుండా వుండలేము. రష్యన్ శరీర విజ్ఞానుల్లో స్వీయమేధా సంపదతో నూతన సిద్ధాంతాల్ని చేసినవారిలో ఆయనే ప్రప్రథములు...

(పత్రికావిలేఖరులూ, దుబాసీలు కూర్చుండే ఆగారం. పావ్లోవ్ వుపన్యాసం యిక్కడనుంచే అనేక భాషల్లోకి అనూదిత మౌతూంది)

పావ్లోవ్:-...మానవజాతికి సుఖమయమైన భవిష్యత్తుకోసం, అభ్యుదయ శాంతి సౌభాగ్యములకొరకు, ఐక్యతానుసంధానం కోసం మనమందరం కృషిగావిస్తూన్నాము. శాస్త్రరంగంలో పనిచేసే మనమంతా సన్నిహితులం, సహచరులం. మనలో యేలాటి అడ్డుగోడలూ లేవు......కాని,

యుద్ధంలో మానవజాతిని ముంచెత్తాలని యెంచేవారి కోరి కలే సఫలమైతే, మరో దారుణ సంగ్రామమేగనక తటస్థిస్తే మనమందరం ఒకరొకరికి శత్రువులమైపోతాం. అదొక శోచనీయమైన సంఘటనే! జీవితసమస్యల్ని పరిష్కారం చేసుకోడంలో నేటి మానవులు యింకా యుద్ధములనే సాధనంగా భావిస్తున్నారంటే, మన అనాగరికస్థితిని, క్రూర నికృష్ట సంకుచితఆలోచనావిధానాన్నీ వెల్లడిచేసుకుంటున్నామన్నమాట...(సభలో తుపానువంటి హర్షధ్వానులు)... కాని, ఆశారేఖలు కూడ లేకపోలేదు. మా దేశప్రభుత్వం శాంతి అభ్యుదయాలకు పెట్టనికోట! ప్రపంచచరిత్రలో మొట్టమొదటగా, శత్రువులు, శత్రుదేశాలు లేవని ప్రకటించిన సోవియట్ ప్రభుత్వం మానవజాతి మన్ననకు పాత్రమైంది! శత్రుప్రాంతాలనేవి యీ పృథ్వీమీద ఒక్క అంగుళం మేరకుండా లేవని మా ప్రభుత్వం ప్రకటించడం ముదావహం! అట్లు చెప్పడానికి నేనెంతో గర్విస్తున్నాను...

(సుదీర్ఘ హర్షధ్వనులు. జర్మన్, జపాన్, ఇటాలియన్ దేశాల ప్రతినిధుల ముఖాలు ప్లానమై, శిలా సదృశాలై పోతాయి, విలేఖరులగదిలోని టైపుమిషన్ల క్లిక్క్లిక్లు యెడతెరిపి లేకుండా వినవస్తుంటాయి. అప్పుడే మహాసభావిశేషాలను దెలుపుతూ వార్తాపత్రికలు పెద్ద హెడ్డింగులతో వచ్చేసేయి. 'శాంతికై పావ్లోవ్ వినతి' 'శరీర విజ్ఞానంలో పావ్లోవ్‌ను ప్రధానాచార్యునిగా ప్రపంచం గుర్తించింది' 'పావ్లోవ్ పండితులు సోవియట్ ప్రభుత్వాన్ని చూచి గర్విస్తున్నారు' మొదలైన హెడ్డింగులు చదువుతూన్నారు కొందరు సభికులు. సభ పూర్తైంది. అందరూ భవనంనుంచి వెలుపలకు వస్తారు. విదేశ విజ్ఞానవేత్తలు కొందరితోసహా పావ్లోవ్ మోటార్లలో కూర్చుండగా అవి తిరిగి బైలుదేరుతవి)

(వేదిక తిరుగుతుంది.)

(క్రెమ్లిన్ భవనాలు. సైన్సుకాంగ్రెస్ ప్రతినిధులకు మోలటోవ్ విందు. పౌలోవ్ లేచి సోదర వైజ్ఞానికుల నాహ్వానిస్తూ మాట్లాడుతూంటారు.)

పౌలోవ్:- సోదరవైజ్ఞానికులారా! మీ కందరకూ ఆతిథ్య మొసంగి, సోవియటు ప్రభుత్వం తనకు విజ్ఞానులపట్లగల ఆదరభావాన్ని చాటుకుంది...మాదేశంలో విజ్ఞానశాస్త్రాలెట్టి ఆదరణను, ప్రత్యేక సౌకర్యాలను అనుభవిస్తున్నవో మీరంతా చూసేవున్నారు...విజ్ఞాన సంస్థల చోదకుల మైన మేమందరం ప్రభుత్వం మా కోసం వ్యయిస్తున్న ధనానికి తగ్గ ప్రతిఫలం క్రియారూపంలో చేయగలుగుతూన్నామా? అనే నిరంతరం ఆలోచిస్తూన్నాము. ప్రభుత్వం చూపే ఆదరణకు మేము అర్హులమా అనేదే మాధ్యాస...

మోలటోవ్:- మీరందు కర్హులేనని మా గాఢ నమ్మకం!...

పౌలోవ్:- (తన వుపన్యాసాన్ని కొనసాగిస్తూ)...నేను యెల్లప్పుడూ ప్రయోగశీలినే! నాజీవితమంతట్లోనూ ప్రయోగాలే గావించేను. పరిశీలన లేనిదే దేనినీ నమ్మజాలదు, విజ్ఞానశాస్త్రం. మా ప్రభుత్వం కూడా నిరంతరప్రయోగశీలి యనే చెప్పాలి. అందుకనే సోవియటు విధానంలో విజ్ఞానం నవోన్మేషితమై వర్ధిల్లుతూంది. మానవసంఘ నిర్మాణాన్ని గూర్చిన యీ ప్రయోగఫలితాల్ని చూడాలని, చరిత్రాత్మక మైన యీ సాంఘిక రాజకీయ ఆర్థికప్రయోగం యొక్క

విజయాన్ని వీక్షించాలని, నాకెంతో ఆసక్తిగా వుంది. అందుకనైనా నా జీవించాలనీ, జీవించగలగాలనీ నా వాంఛితం...

(హర్షధ్వనులు. 'విజ్ఞాని పాలోవ్ చిరంజీవి యగుగాక!' అని నినాదాలు. హర్షధ్వనుల మధ్య విందు ప్రారంభం.)

(తెర)

## ఆరో రంగం

(1936 ఫిబ్రవరి 26 వ తేదీ ప్రాతఃకాలం. మంచు దట్టంగా కురుస్తూంది. పాలోవ్ గృహంలో మేదమీది గదిలో కిటికీవద్ద సెరాఫిమా నిల్చునివుంటుంది. నెరసిన జుట్టు యెగద్రువ్వి సనాతన సాంప్రదాయికంగా వెనుక ముడివేసుకుంది. వీధిలో చలిగాలి సుడులు తిరుగుతూ వీస్తూంది. ముంగిట్లోకి అసంఖ్యాకంగా వచ్చి నిలుస్తూన్న టాక్సీలు మేదమీంచి చూడ్డానికి బరిణెపురుగుల్లా గానవస్తున్నాయి. గది గోడలనిండా సుప్రసిద్ధ రష్యన్ చిత్రకారుల ఉత్తమచిత్రాలు వ్రేలాడుతున్నాయి. పాలోవ్ కుమారుడు వ్లాడిమిర్ నిరుత్సాహంగా పడక కుర్చీలో కూలబడివుంటాడు. ఆయన శిష్యులు, అనుచరులూ, మిత్రులూ చాలమంది విషాదాక్రాంతులై గదిలో గుంపులుగా గుసగుసలాడుతూన్నారు. కాచగోళం క్రిందినుంచి పురాతన గడియారం టింగ్ టింగ్ మంటూ జలతరంగిణిలా గంటలు కొడుతుంది. అక్కడి విషాద వాతావరణాన్ని చీల్చుకుని వస్తున్నట్లుంటాయి. ఆ శబ్దాలు.

ఆ తరువాతి గదిలోనే వ్యాధిగ్రస్తుడై పాలోవ్ మంచానపడివున్నారు. పక్కమీద కూర్చున్న ఆయన చుట్టూ చాలమంది వైద్యులు నిలుచుని వున్నారు. అందరితలలమీద యెత్తుగా కనిపిస్తూంది పాలోవ్ తల. పెద్దగడ్డం, నెరసి జీబుగావున్న కనుబొమలు, లోతై, తీక్షణములై, మర్మభేదకములైన కళ్ళు. తన నిస్సహాయతనూ, తనచుట్టూ పరివేష్టించియున్న సుప్రసిద్ధ భిషగ్వరులనూ చూస్తూంటే, పాలోవ్ మనసులో కుతూహలం రేకెత్తుతూన్నట్లు గానవస్తుంది. ఆయన వీపుమీద వ్రేలితో తట్టి, పరీక్షగా వింటున్నాడొక వైద్యుడు. కొంచెం దూరంలోనే సెమ్యోనోవ్ నిల్చునివున్నాడు.)

పావ్లోవ్:- (సెమ్యోనోవ్‌తో) వేసవి బోనుల్ని బాగా విస్తృత పరచాలి. శీతకాలపు బోనులూ క్రిక్కిరిసే వున్నాయి. అంతగా ఒకదానిమీదొకటున్నటే పరిశీలనలూ, ప్రయోగాలు సాగడమెల్లా? ఫలితాల్ని గమనించడం యెవరివల్ల నవుతుంది?

సెమ్యోనోవ్:- అది నిజమే. కాని, ఆ విషయాలన్నీ మేం చూస్తాంలెండి. మీరు నిశ్చింతగా వుండండి.

పావ్లోవ్:- ఐతే, నా వుపన్యాసం యెప్పుడు?

(డాక్టర్లు దూరంగా తప్పుకుని, సంప్రదిస్తుంటారు.)

సెమ్యోనోవ్:- రేపు లేదు. ఎల్లుండి.

పావ్లోవ్:- అది వాయిదా వెయ్యాల్సి వుంటుందనుకుంటా. (డాక్టర్ల నుద్దేశించి బిగ్గరగా) మీరేమంటారు?

(డాక్టర్లు విస్తుపోయి, ముఖముఖాలు చూసుకుంటారు.)

ఒక డాక్టరు:- (మెల్లగా) ఉపన్యాసంలాగేవుంది! చస్తూంటే సంధిమంత్రం అన్నట్టేవుంది!

మరో డాక్టరు:- (వేడుకుంటూన్నట్లుగా) డాక్టర్ పావ్లోవ్! దయచేసి, మిమ్మల్ని పరీక్షించే అవకాశ మివ్వండి. ఒక్క క్షణం!

పావ్లోవ్:- అల్లాగే. రాండి. (పెదవులుబిగించి, డాక్టర్లకి శరీరాన్నప్పగించి వూరుకుంటాడు. ఒక్కమాటాగి మళ్ళా ప్రారంభిస్తాడు) చూడు! హాక్ రాసిన పుస్తకంలేదూ? అది నాకోసారి పంపించు. అసలువిషయం అర్థంచేసుకో

కండ్లానే విమర్శను పూనుకుంటా రెట్లాగంటా? ఈ ఇంగ్లీషు వాళ్ళకి తల పొగరెంతుందని! (డాక్టర్లతో) ఏమిటిది? నా డొక్కల్లో ఒత్తుతూన్నా రెందుకు? లివరుకేం లేదు. మాంమూలు జబ్బు. అంతే. చాలు ఇక నన్ను వదిలే యండి. మహాజనులు! లేవండింక!

(డాక్టర్లు దూరంగా తప్పుకుంటారు. పౌలోవ్ తలగడమీద వ్రాలి రగ్గు మీదికి లాగి కప్పుకుంటాడు. మృత్యుచ్ఛాయలు గ్రమ్ముతూన్నట్లు గానవస్తూంది. డాక్టర్లు కిటికీవగ్గర గుమిగూడి గుసగుసలాడుతూన్నారు. బైట వచ్చిచేరుతూన్న కార్లధ్వని వినవస్తూంది. వాకిలివద్ద గుమిగూడుతూన్న జనులసందడి. పౌలోవ్ కనులు మూసికొని పడుండి, హఠాత్తుగా పిడికిలి బిగించి పక్కమీద దిబ్బున కొడతాడు. ఆయన మృత్యువుతో పోరాడుతూన్నట్లు తోస్తుంది.)

[తెర తిరుగుతుంది.]

(వెలుపలిగదిలో టెలిఫోనుదగ్గర సెమ్యోనోవ్ మాట్లాడుతుంటాడు.... "ఆఁ!....యెవరు?....లెనిన్‌గ్రాడ్‌స్కయా ప్రవదా ఆఫీసునుంచా?....ఆయనకి అల్లాగేవుంది!....వైద్యుల ప్రకటనకోసం రెండోపుట అచ్చునిలిపి వుంచేరా ... పంపుతున్నాం....సరే........వందనాలు........" సెమ్యోనోవ్ రిసీవరును పెట్టేస్తాడు.

అంతలో ఆ గదిలోకి పౌలోవ్ మనుమరాలు మిలోచ్‌కా పరుగెత్తుకుంటూ వస్తుంది. ఆమె కారేళ్ళుంటాయి. అప్పుడే షికారునుంచి యింటికి వచ్చి వుందేమో, తాతగారిని చూడ్డానికి ఆయన గదిలోకి పరుగెడుతూంది. దాసి ఆమెను పట్టుకొందామని వెంటబడుతుంది. ఆమె చేతుల్లో చిన్న బొచ్చుకోటూ, గొలోష్‌లూ వుంటాయి. మిలోచ్‌కా దానిని తికమకలు బెట్టి తప్పించుకుని పౌలోవ్ గదితలుపులు నెట్టుకుని లోనికి పరుగెత్తుతుంది. వ్లాడిమిర్ ఆమెను పట్టుకుందామని గమ్మున పడకకుర్చీనుంచి లేస్తాడు. కాని అప్పటికే చిన్న మిలోచ్‌కా తూనీగలా రోగి గదిలోకి జొరబడుతుంది.)

[తెర తిరుగుతుంది. పాలోవ్ గది]

(మిలోచ్కాతోబాటు రోగిగదిలోకి జీవితవసంతశోభ జొరబడ్డట్లవుతుంది. నవనవోన్మిషిత జీవనోదయ సంధాయినియైన యీ పసిహాన ఆగమనాన్ని చూస్తూండగనే పాలోవ్ముఖం వికసిస్తుంది. దిగ్గునలేచి రెండుచేతులూ జాచి, మిలోచ్కా నాహ్వానిస్తాడు. అదేసమయంలో లోనికివస్తున్న వ్లాదిమిర్ను వెళ్ళిపొమ్మన్నట్లు రూక్షణంగా చూస్తాడు. వ్లాదిమిర్ ఆగిపోతాడు.)

పాలోవ్:- షికారు వెళ్ళేవా? తల్లీ!

మిలోచ్కా:- ఉఁ హూఁ! (మీదికి వాలుతూ)

పాలోవ్:- (ఆమె లేతచేతుల్ని బంపబారిన తన చేతుల్తో బిగ్గ బట్టుకుని) చలికి కందిపోలేదుగదమ్మా, పిచికపిల్లా!

మిలోచ్కా:- అబ్బే! లేదు! తాతయ్యా! నేనేం చిన్నపిల్ల ననుకున్నావుకాబోలు! (కిటికీదగ్గరి డాక్టర్లకేసి వీళ్ళెందుకు వచ్చేరన్నట్లు చూస్తూ) మనపెరట్లో యింతెత్తు మంచు గుట్ట వుంది, తాతయ్యా! (అంటూ చేతులు పైకెత్తి చూపుతుంది.) పేద్దగుట్ట!

(డాక్టర్లు వెలుపలి గదిలోకి పోతారు. అక్కడ వాళ్ళని చుట్టు ముట్టుతారు 'యేమైం'దంటూ, జనం. లోగదిలో పాలోవ్, మనుమరాలూ మాత్రం వుంటారు.)

పాలోవ్:- మిలోచ్కా! నా పిచ్చితల్లీ! అందరూ వెళ్ళిపో యేరులే! ఇంక మనిద్దరమే వున్నాం ఎవళ్ళూ మనకి అడ్డు రారులే, తల్లీ!

మిలోచ్కా:- (టేబిలుమీది గాజు కప్పుల్ని చూస్తూ) అవి యేమిటి తాతయ్యా! నా కియ్యవ్, ఆడుకుంటాను?

ఎంచక్కా వున్నాయి, తాతయ్యా!

పౌలోవ్:- తీసుకోవమ్మా! నా చిట్టితల్లి! పగిలిపోతాయిసుమా. జాగ్రతగా ఆడుకో అమ్మా!

(మిలోచ్కా తాతగారి చేతుల్లోంచి విడిపించుకుని వెళ్ళి, ఆ గాజు కప్పుల్ని టేబిల్ మీదే వరుసలుగా పేరుస్తూంటుంది. ఆ బిడ్డ చేసేదంతా నగుమోగంతో చూస్తూంటాడు. పాలోవ్. ఆయన చూపులు గదంతా పరిభ్రమిస్తున్నాయి. గోడనున్న చిత్తరువుమీదికి వ్రాలి నిలుస్తాయి. అనేక నదీతీర ప్రకృతిదృశ్యం. ఓకానదీగావచ్చు. ఓల్గానదీగావచ్చు. సువిశాలమైన సస్యశ్యామల మైదానాలు. సాయంతనదృశ్యం. ఆయనకు తన చిన్ననాటి మధురస్మృతులు గుర్తు కొస్తాయి.)

(నేపథ్యంలో పాట వినవస్తుంది)

...పుట్టిన వన్నియు - గిట్టుట తప్పదు
ప్రకృతి సూత్రం - బిదియే మనసా!
ద్వంద్వాతీతమిా - విశ్వమునందే
వెతికిన దొరకదు - వైరిని విడువుమా!
కష్టసుఖములూ - కలిమిలేములు
చీకటి వెలుగులు - శీతోష్ణాదులు!
స్త్రీ పురుషాదులు - ప్రకృతిపురుషులు
రేతిరి బవళులు - స్థితిలయములు!
కావడికుండలురా - భావనసేయగ
తత్త్వ రహస్యము - శుష్కతర్కములచే!
తెల్లముగాదని - నమ్ముము మనసా!
స్వాధ్యాయంబును - అనుశీలనమూ!

మననము మరి - జిజ్ఞాసయునూ
కర్మకారణముచే - నరునికిచ్చునివి।
చిత్త విశుద్ధివి - సత్యసమీహత
యిందుమూలమననె - చేకురు మనసా॥ *

(పావ్లోవ్ పాటవింటూ పరధ్యాన్నంలో మునుగుతాడు. మైమరపు కలుగుతూన్నట్లుంటుంది.)

పావ్లోవ్:- (సణుగుడుగా) నే నెక్కడున్నాను? ఎక్కడికి బోతున్నాను?......

## ఏడో రంగం.

(మధ్యాహ్నసమయం. పావ్లోవ్ మంచంమీద పండుకొని వుంటాడు. కిటికీ తెరలను దగ్గరగా లాగుతూంది. సెరాఫిమా. సెమ్యోనోవ్. మరికొందరు డాక్టర్లు కొంచెం దూరంలో వుంటారు)

పావ్లోవ్:- (క్షీణస్వరంతో) బైట యెల్లావుంది?

సెరాఫిమా:- మంచుతుఫాను. మూడు రోజులుగా మంచు కురుస్తూనేవుంది, ఒక్కవరసని.

పావ్లోవ్:- ఇది ఫిబ్రవరిగాదూ? ఫిబ్రవరిలో మంచు అనేక విలక్షణంగా వుంటుంది. దానిలో వసంత పరిమళాలుంటాయి! అద్భుతమైన మంచు బంతులు చేయొచ్చు. ఏదీ, సీమా! కొంతమంచు తీసుకురా, చెప్తా.

---

* శ్లో॥ కర్మాత్మ విజ్ఞాన మవిక్రమేణ। సంపాద్యమేకేన నరేణ వేద
యఃకర్మణా చిత్త విశుద్ధిమాప్య। సవిద్యయాప్నోత్యమృతంహివిద్వాన్.

సెరాఫిమా:- (గతుక్కుమని) ఏమిటీ, పట్టుకురావడం!

పౌలోవ్:- (చెదరిన భావాల్ని కూడదీసుకుంటూన్నట్లు ఒక్కమారాగి) ఏం? అల్లా అడుగుతావేమిటి? మంచు, ఇంకేమిటి తెమ్మన్నాననుకున్నావు?

సెరాఫిమా:- ఇప్పుడే వస్తా. (వెళుతుంది)

(కొద్దిసేపట్లో సెరాఫిమా ఒక పళ్లెంలో మంచు నింపుకొని తెస్తుంది. అది చూచి డాక్టర్లు ఆటంక పెడతారు.)

ఒక డాక్టరు:- వద్దు, వద్దు! ఏ పరిస్థితుల్లోనూ మంచు పనికి రాదు!

పౌలోవ్:- ఎవరన్నారు, పనికిరాదని? సీమా! ఇల్లారా! (ఆమె సంకోచిస్తూ యిచ్చిన పళ్ళెమును తీసుకుని చదులిస్తాడు.) పళ్ళెంలో మంచు! ఆశ్చర్యం! ఇదే ఉపకారం చేసేది! (మంచును రెండుచేతులలా పిసికి బంతిగా దొర్లిస్తాడు. చేతులకంటిన మంచును దులుపుతూ సంతోషంగా గొణుగుతాడు.) చలికాలంలో కూడా స్నానంచేయడమే నాకు చిరకాలంనుంచీ అలవాటు. అది చాల మేలుచేసింది. ప్రకృతిమాతకెంతో ఋణపడి వున్నాను!...

(బైటగంట మ్రోగుతుంది. సెరాఫిమా వెలుపలికి వెడుతుంది.)

పౌలోవ్:- (డాక్టర్లతో) మన రష్యాకో సనాతన సాంప్రదాయం వుంది చూసేరూ, ఎపిఫనీ పండుగకీ * నదుల్లోని మంచు

---

* క్రిష్టమసు తర్వాత పన్నెండోరోజు. జనవరి ఆరవరోజున. క్రిస్తును ప్రవక్తగా ప్రాగ్దేశీయ పండితులు గుర్తించిన దినం.

బొరియల్లో మునగాలనేది, దాంట్లో అర్థంలేకపోలేదు! శరీరంలోని కణాలన్నిటికీ ఒక్కసారి కదలిక కలుగుతుంది. జల్లుమనిపించి విద్యుద్వేగంతో నరాలన్నిటికీ నూతన శక్త్యుత్సాహాల నిస్తుంది, యీ చన్నీటిస్నానం!...

(సెరాఫిమా లోనికి వస్తుంది.)

సెరాఫిమా:- విద్యార్థులు కొందరు మిమ్మల్ని చూడాలని వచ్చేరు.

పౌలోవ్:- సీమా! వాళ్ళతో చెప్పు, అకడమీషియన్ పౌలోవ్ కార్యాంతర వ్యగ్రుడై వున్నాడని. మృత్యువుతో మాట్లాడుతూన్నాడని చెప్పు!

(గతుక్కుమని అందరూ విస్తుబోతారు. సెరాఫిమా ముఖంమీద బాధ గానవస్తుంది. ఆమె చిన్నబోయి, భర్తకేసి సకరుణంగా చూస్తుంది.)

పౌలోవ్:- చూడు, చూడు, సీమా! ప్రియతమా! క్షమించు. ఊరికే పరిహాసానికన్నాను. వాళ్ళని లోనికి రమ్మని చెప్పు...

సెమ్యోనోవ్:- మహాశయా! మీరల్లా మాట్లాడ్డం యేమీ బాగాలేదు. మాఅందరికీ కష్టంగా వుంది మా అసమ్మతి...

పౌలోవ్:- నాయనా! సెమ్యోనోవ్! యీ జమానాన్యం వహించడానికింకా వ్యవధి వుందిలేవోయ్! చూస్తున్నావుగాదూ, నేనింకా జీవించే వున్నానని?

(ముగ్గురు విద్యార్థులు తొట్రుపడుతూ ద్వారంలో గానవస్తారు)

పౌలోవ్:- (వాళ్ళతో) ఎందుకూ తటపటాయిస్తారు? లోనికి రమ్మన్నానుగదా! రాండి, దగ్గరగా రాండి, నాయనలారా!

(విద్యార్థులు గొంకుతూనే సమీపిస్తారు.)

పాలోవ్:- కూర్చోండి. (సాధుమందస్మితంతో చూస్తాడు.) నేనబద్ధం ఆడాల్సి వచ్చింది... కాని నాకది అలవాటు లేదు. ...తెలుసునుగాదూ, నిరంతరం యేదో పనిచేస్తూండడం నా కలవాటైపోయింది...అదో ఆశ్చర్యమేమీగాదు ... దానికేంగాని, యదార్ధ సంఘటనలమీద ఆధారపడి చేసిన సుసంబద్ధ నిర్ణయాలు, చూచేరూ, వాటికి యెక్కడా తిరుగులేదు... (మొరటుగా, కోపంతో అన్నట్లు) మీకు నేచెప్పేదేమంటే, శాస్త్రపరిశోధక జీవితంలో బండచాకిరీ చేయడం నేర్చుకోమని. అది ప్రధానం. రెండోది నమ్రత, నిగర్వితత్వం. అందరూ నిన్నెంతగా మెచ్చుకుంటున్నా 'నేనొక అజ్ఞానాగ్రేసరుణ్ణి!' అని చెప్పుకోగల ధైర్యం, ఋజుత్వం వుండాలి, నీకు. (ఒక్కమాటు ఆగి) మూడోది, విజ్ఞానార్జనలో తీవ్రకామన వుండాలి. (దిండునానుకుని లేచి, విద్యార్థులవైపు కొంచెం వంగి) ఎల్లప్పుడూ జ్ఞాపకం వుంచుకోండి. శాస్త్రపరిశీలన మానవుని యావజ్జీవితాన్నీ, శక్తియుక్తుల్నీ, శ్రద్ధాభక్తుల్నీ కోరుతుంది... (అంటూ అలసటతో వెనక్కి వాలిపోతాడు. ఆయన దృష్టి యెక్కడెక్కడో పరిభ్రమిస్తూండి వుంటుంది.)

(పళ్ళెంలోని మంచు బంతి మెల్లగా కరిగిపోతూంది.)

పాలోవ్:- (ఉద్రేకంతో, కటువుగా) ఎవరికేనా వున్నది ఒక్కటే జీవితం. మన కర్తవ్యం నెరవేర్చడానికి నూరు జీవితకాలాలు

కూడ సరిపడవంటే, ఎంత అవిరళంగా కృషిచేయాలో గుర్తుంచుకోండి. ప్రతిక్షణాన్నీ విద్యార్జనలో గడపాలి! ...(అంటూ పిడికిలినెత్తి, దిబ్బున పరుపుమీద కొడతాడు. అవశుడై ఊపిరి బిగ్గరగా పీలుస్తూ, కళ్లు మూసేస్తాడు. ఆయన మనో నేత్రంముందు గోపురనిర్మాణ కాలంనాటి దృశ్యాలు గిర్రున తిరుగుతాయి. విద్యార్థులు ముగ్గురు తనకు ధనసహాయం నిమిత్తం చందాలు వేయించుకు వచ్చిన దృశ్యం గానవచ్చి, పరాకుమాటలాడుతాడు.) ఏమయ్యా! మీకీ అధికారం యెవరిచ్చేరంటా? దయచేసి చెప్పండయ్యా, వింటాను.

(పావ్లోవ్ మాటలు అక్కడివాళ్లెవరికీ అర్థంగావు. వాటి అంతరార్థం తెలిసిన సెమ్యోనోవ్ మాత్రం చిరునవ్వు నవ్వుతాడు.)

పావ్లోవ్:- (కళ్ళు తెరుస్తూ) ఏమంటున్నాను? ఏవో భ్రమలు, మిధ్యారూపాలు మనోనేత్రం ముందు గానవస్తున్నాయి. ఏం కారణం చెప్మా? (చుట్టూచూస్తూన్న, ఆయన కండ్లు ఒక్కక్షణం విద్యార్థుల ముఖాలమీద నిలుస్తాయి.) ఓహో! అదా కారణం! నీ జుట్టూ వంగదన్నమాట! (పెయ్యనాకుడు జుట్టుతో వున్న విద్యార్థిని చూస్తూ) కారణంలేని కార్యం వుండదుగదా! అకారణంగా ఆవులింతైనా రాదంటారు, మరి!

(పావ్లోవ్ ప్రశాంతంగా పండుకొనే ఒక విద్యార్థివైపు వ్రేలుచూపుతాడు. అతడు కించిల్లజ్జతో తడబడుతూ, పెయ్యనాకుడు జుట్టును సవరించుకో ప్రయత్నిస్తాడు.)

పాలోవ్:- (చిరునవ్వుతో) దానికేం లేవోయ్, నాయనా! పోనీ-కాని, నువ్వు వైద్యవిద్యార్థివేకదూ?

విద్యార్థి:- ఔనండి. త్వరలోనే పూర్తికాబోతూంది.

పాలోవ్:-బాగుంది. ఐతే...(భారంగా వూపిరి తీస్తూ) రోగికి న్యూమోనియా. మామూలు భాషలో చెప్పాలంటే ఫ్రూపిరితిత్తులు వాపు, బాధ, రెండును తీవ్రబాధవుంది. వాచిన భాగాలు కలిసిపోతున్నాయి. వ్యాపనశీలమైనదన్న మాట. ఆ సందర్భంలో ప్రమాదసమయం, స్థితి యేది? చెప్పండి, చూదాం.

(విద్యార్థులొక్కక్షణం నిశ్శబ్దంగా వుంటారు.)

పాలోవ్:- (వేగిరిస్తూన్నట్లు) యేం? చెప్పు. ప్రమాదం...

పెయ్యనాకుడు విద్యార్థి:- (ప్రశాంతంగా) అవసానదశే.

పాలోవ్:- (వికాసంపొందుతూ) భేష్! సరిగ్గా చెప్పేవు! మరైతే, అవసానదశంటే యేమిటని నీ నిర్వచనం? శరీర శాస్త్రరీత్యా, తెలిసిందా? శరీరశాస్త్రరీత్యా చెప్పు.

ఆ విద్యార్థి:- రక్తనాళముల మందీభావమువల్ల హృదయానికి రక్తం తక్కువగా ప్రవహిస్తుంది. నాడి సన్నగిలి, మందమై, బలహీనమైపోతుంది.

పాలోవ్:- ఐతే, ఐతే...(ఎడమచేతి నాడి స్పృశించి చూడు కుంటాడు.)

విద్యార్థి:- మందీ భూతమైన రక్తప్రసారంవల్ల మున్ముందుగా దెబ్బతినేది కేంద్రనాడీమండలం...

పాలోవ్:- సెభాష్! బాగుంది. భేష్! నాయనా! (సెమ్యో నోవ్‌తో) ఈతడు మంచి అభివృద్ధికి రాగలడు!...

(పాలోవ్ కళ్ళుమూసేసి, పండుకుని వుంటాడు. గదంతా ఒక్క క్షణం నిశ్శబ్దం. మంచుబంతి కరిగిపోతూంది. సెమ్యోనోవ్ విద్యార్థుల్ని బైటికి వెళ్ళమని సంజ్ఞచేస్తూ, నెర్పుతో అంటాడు.)

సెమ్యోనోవ్:- (రహస్యంగా) ప్రాణవాయువు యియ్యి!

(హఠాత్తుగా పాలోవ్ దేన్నో పట్టుకోయత్నిస్తూన్నట్లు చేతితో విన్యాసం చేస్తాడు. అంతలో కళ్ళుతెరచి, తన చేతివైపు ఆశ్చర్యంతో చూస్తూ)

పాలోవ్:- (సెమ్యోనోవ్‌తో గుసగుసగా) అనైచ్ఛిక కండర చలనాలు. మేధస్సూ, నాడీమండలమూ శక్తిహీనమై పోతూన్నట్లుంది, చూస్తే...

సెరాఫిమా:- (దుఃఖంతో, కంగారుగా బోయి, అతడిమీద వంగుతూ) వాన్యా! ఏమైంది?

పాలోవ్:- ఒక్కక్షణం ఆగు. సీమా! ఒక్కక్షణం...(కళ్లు మూసి, తన కడపటి ప్రయోగంలో పూర్ణంగా నిమగ్నుడై నట్లు కనబడుతాడు.)...

సెమ్యోనోవ్:- (బహుమృదువుగా) డాక్టర్ పాలోవ్!

పాలోవ్:- (గుసగుసగా) ఓ! మృత్యువంటే...అది యిదన్న మాట!...ఆశ్చర్యంగా వుందే! చాలా విచిత్రంగావుంది....

(నిశ్శబ్దం. మంచుబంతి కరిగిపోతుంది. మృత్యుచ్ఛాయ లలముకొన్నా, ఆ గదంతా విజ్ఞానతేజస్సుతో కాంతివంతమవుతుంది)

[జీవన్మరణములు, వ్యవస్థావ్యవస్థలు, అజ్ఞాన విజ్ఞానములు, కాంతిచ్ఛాయలు నిరంతరం సంఘర్షిస్తూన్న యీ సువిశాల విశ్వంలో ఒక ఘట్టంమీద తెర వాలింది. విషాదంలోనే విమలానందజ్యోతి.]

[తెర పడింది.]

[ఇన్‌స్టిట్యూట్ ఉద్యానమంతా వసంతశోభతో సుస్నాతమైవుంది. 1936 మే నెల. ఎల్లెడలా మంచుకరిగి శ్యామలస్నిగ్ధమైన భూమాత అవకుంఠనాన్ని తొలగిస్తూంది. ఆకులన్నీ రాలి కంపరై పోయిన చెట్లన్నీ ఆమూలాగ్రంగా చిగురాకు మొగడల ముకులాల్ని బరపి, జీవనప్రవంతికి నవచైతన్యాన్నిస్తున్నట్లున్నాయి. ఆ తోటలోనే పావ్లోవ్ సాహచర్యంలో మనిన వృక్షతరులతా గుల్మాదులెన్నో వున్నాయి. ఇట్టి వసంతాల నెన్నిటినో ఆయనతోబాటు అవీ చవిచూచినాయి. ఇప్పుడా మహాత్ముడు చనినాడుగదా]

(వర్వారా ఆ తోటలోంచి నడిచివస్తూంది. త్రోవప్రక్కన పాలరాతి విగ్రహాలు. ఒక్కొక్క విగ్రహాన్నే పరీక్షగా చూస్తూ, మెల్లగా సాగుతూంటుందామె)

"రేనీ డెస్కార్టెస్,......"

"ఛార్లెస్ డార్విన్,......"

"ఇవాన్ పావ్లోవ్, 1849 - 1936......"

(ఆమె విగ్రహంముందాగి, తనకు సుపరిచితమైన ఆ విజ్ఞాని రూపురేఖల్ని ఆ శిలలో చూస్తూంటుంది. నికోడిమ్ సమీపిస్తాడు.)

నికోడిమ్:- అమ్మా! ఆయన చనిపోయినా జీవించివున్నవాడే ...అమరుడు!...రా పోదాం...(ఇద్దరూ నడిచి, భవనం వైపు అదృశ్యమవుతారు.)

(విగ్రహపు పునాది పలకంమీది వ్రాత స్పష్టంగా గానవస్తూంది.)

"పరిశీలన...పరిశీలన...పరిశీలన..."

ఇవాన్ పిత్రోవిచ్ పావ్లోవ్.

(ఉద్యానంలో శకుంతసంతానాల కలరుతాలు.)



297

# రాబోవు గ్రంధాలు

## (1) వానరుడు - నరుడు : పరిణామంలో శ్రమపాత్ర.

రచన : ఫ్రెడరిక్ ఏంజిల్సు.

జీవ పరిణామంలో వానరుడు-నరుడుగా మారినది యిప్పటికి కడపటి మెట్టు. దానికి చోదక శక్తులేవి? వాక్ యెక్కడనుంచి బైలు చేరింది? వాగ్మిత్వం మానవులకే యెందుకు సంక్రమించింది? ఇట్టి సమస్యలకి శాస్త్రీయ సమాధానాలు యీ చిన్న వ్యాసంలో దొరుకుతాయి. గతితార్కిక భౌతిక వాద ప్రకర్తకుడైన ఏంజిల్సు మహాశయుని రచన.

1951 నవంబరులో వెలువడుతుంది. వెల 0—4—0

## (2) నా బాల్యం : మాక్సిం గోర్కీ.

మహాకవి గోర్కీ యొక్క ఆత్మస్మృతి. తన చిన్ననాటి జ్ఞాపకాలనూ. తన కుటుంబ పరిసర వాతావరణాన్నీ. తన లేతమనస్సుమీద చెరుగని ముద్రలనువైచిన చిన్న చిన్న సంఘటనల్నీ అతి సహజంగా వ్రాసి పొందుపరచేడు యీ పుస్తకంలో గోర్కీ.

1951 డిసెంబరు నెలాఖరుకు వెలువడుతుంది.

400 క్రౌన్ $\frac{1}{8}$ పుటలు— వెల రు 4—0—0

## (3) దక్షిణపవనం : స్టాలిన్ ప్రైజు నవల.

రచన : ఎల్మర్ గ్రీన్.

ఏ దేశంలోనూ భూమిసమస్య అతి ప్రధానమైనది. కృషి జీవులు చాలమందికి చారెడు నేలకూడ లేకపోవడం, దున్ననివారి చేతుల్లో భూమంతా వుండిపోవడం,- యిది ప్రస్తుత సమాజపు పీడల్లో ఒకటి. ఫిన్

248

లాండ్ దేశపు సామాజిక వాతావరణం, అక్కడి సమస్యలూ నవ్యమైన విధానంలో ఆహ్లాదకరంగా రచించి గ్రంథకర్త కృతకృత్యుడైనాడు.

నవలారచనలో సరికొత్త పోకడలు, కళావైదగ్ధ్యం, సున్నితమైన హాస్యం, వ్యంగ్యం తొణికిసలాడుతూంటాయి.

1952 ఫిబ్రవరికి వెలువడుతూంది.

400 పుటలు $\frac{1}{8}$ క్రౌన్ వెల రు 4—0—0

(4) పంచభూతాలు: రసాయన శాస్త్రకథ. విశ్వసాహిత్యమాల వారి 'యక్షప్రశ్నలు' అనే శాస్త్రీయ గ్రంథాన్ని ఆంధ్రమహాజనులు చదివి మెచ్చుకొని వున్నారు. అదేపోకడలో చిన్నబిడ్డల లేతమనస్సుల కెక్కినట్లు రసాయన శాస్త్రాన్నీ, పదార్థ వివేకాన్నీ సంభాషణలో పొందుపరచి తయారు చేసిన చక్కని గాథవంటి రచన.

దీనికి పర్యాయక్రమంలో మరికొన్ని శాస్త్రీయగ్రంథాల్ని కూడ ప్రచురించబోతున్నాం. 'మన వంశవృక్షం' అనే జీవపరిణామ చరిత్ర: 'విశ్వమిత్ర సృష్టి' అనే వృక్షపరిణామానికి మానవుడెల్లాగ తోడ్పడి కృషి గావించినదీ తెల్పు చరిత్ర; ఇట్టివే. ఆంధ్రులయాదరణతో విజ్ఞాన సేవకై కృషిచేస్తూన్న మా యత్నానికి అందరూ తోడ్పడ ప్రార్థన.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B119 |
| పుస్తకం పేరు | విజ్ఞాని పావ్లోవ్ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 253 |
| పెద్ద సైజు పేజీలు | n/o |
| ఖాళీ పేజీలు | viiiB, xvi, 16a,246 |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |